# చతుర ప్రపంచం

## కనపడని అవయవం

మనిషిని అందంగా కనిపింపచేసేది, అసలు మనిషిని మనిషిలా చూపించగలగడానికి ఉపయోగపడే ముఖ్యమైన వస్తువు శరీరాన్ని కప్పిఉంచే చర్మమే. ఆ చర్మాన్ని తొలగిస్తే రక్తమాంసాలు... అవీ తొలగిస్తే అస్థిపంజరం. తల్లి గర్భంలో 13వ వారంలో గర్భస్థపిండానికుండే అస్థిపంజరం మృదువుగా ఉండి క్రమంగా గట్టిపడుతుంది. దాన్ని క్యాల్షిఫికేషన్ గా వ్యవహరిస్తారు. మగవాళ్లకి 18వ ఏడు వరకూ, ఆడవాళ్లకి 16వ ఏడు వరకూ ఈ ప్రక్రియ జరుగుతుంది.




మానవుని అస్థిపంజరంలో మొత్తం 206 ఎముకలుంటాయి. ఒక ఎముకకి ఇంకొక ఎముక కీళ్ల ద్వారా కలిసి ఉండి... శరీరాకృతినిస్తాయి. వీటిలో సగందాకా పాదాలు, చేతుల్లో ఉంటాయి. మరే ప్రాణికీ లేకుండా మనిషికి మాత్రమే ఉండే ప్రత్యేకత అరచేతి వేళ్లు. అస్థిపంజరంలోని వేలి ఎముకలు ఓ వస్తువుని పట్టుకోగలిగే విధంగా ఏర్పడివున్నాయి.

ఎముకలన్నీ ఒకదానికొకటి కలిసివున్నా అలా కలవకుండా... అంటే కీలు లేకుండా ఉన్న ఎముక ఒకటే. అది మెడ భాగంలో ఉండే ఎముక.

మానవ శరీరంలో అన్నిటికంటే పొడవయినది తొడ ఎముక. చిన్నది చెవిలో ఉండే ఎముక. కొన్ని ఆటవిక జాతులు మనిషి తలని శరీరం నుంచి వేరు చేసి, రసాయనిక ప్రక్రియతో ఆ తలని, అందులోని కపాలాన్ని బత్తాయి పండు సైజుకి తగ్గిస్తారు. ఎముకల్లోని మూలుగు (బోన్‌మారో) నుంచే రక్తంలో ఉండే ఎరుపు, తెలుపు కణాలు తయారవుతాయి. ఇవి ఎక్కువగా ఉత్పత్తి జరిగినా, తక్కువగా ఉత్పత్తి జరిగినా అనారోగ్యం తప్పదు.

క్యాల్షియం, ఫాస్ఫరస్ అనే రెండు ముఖ్యమైన ఖనిజాలతో మానవ ఎముక తయారవుతుంది.

నత్తల్లాంటి ప్రాణులకి మాత్రం అస్థిపంజరం బయట ఉంటుంది.

వృద్ధాప్యంలో ఎముకలలో బలం తగ్గి పెళుసుతనం వస్తుంది. వృద్ధులు కిందపడ కుండా జాగ్రత్తగా నడవాలి. ఆ వయసులో ఎముక విరిగితే అతుక్కోవడం కష్టం. పద్నా లుగేళ్ల వయసు దాకా అవి తేలికగా అతు క్కుంటాయి. పిల్లలు పెద్దయ్యేకొద్దీ అనేక ఎముకలు అతుక్కుని ఒక్కటిగా మారి వాటి సంఖ్య తగ్గుతుంది.

---

## మేరా భారత్ మహాన్ హై

ఇండియాలో ఓ చిన్న కంపెనీ వుంది. దానిలోని ఉద్యోగుల సంఖ్య 500 పైచిలుకు. వారి శ్టాటిస్టిక్స్ ఈ కింది విధంగా వున్నాయి.

29 మంది భార్యలను కొట్టిన ముద్దా యిలు.

7గురు ఫ్రాడ్ కేసుల్లో అరెస్ట్ అయ్యారు.

19 మంది అకౌంట్‌లో డబ్బుల్లేకుండా చెక్కులిచ్చి కోర్టుల్లో ముద్దాయిలయ్యారు.

117మంది తలోకరూ కనీసం రెండు వ్యాపారాలని ఆరంభించి దివాళా తీశారు.

ముగ్గురు క్రూరంగా ప్రవర్తించడంతో అరెస్ట్ అయ్యారు.

71 మందికి క్రెడిట్ కార్డులు లేవు. వాళ్ళు అప్పు తీర్చలేని రేటింగ్స్‌వల్ల అవి ఏ క్రెడిట్ కార్డ్ కంపెనీ ఇవ్వలేదు. వారికి ఏ బ్యాంక్‌లోనూ అప్పుకూడా పుట్టదు.

14 మంది డ్రగ్స్‌కి సంబంధించిన కేసుల్లో అరెస్టయ్యారు.

8 మంది సూపర్‌బజార్లలో దొంగతనం చేసి అరెస్టయ్యారు.

21 మంది ప్రస్తుతం వివిధ కేసుల్లో కోర్టులో ముద్దాయిలు.




1998వ సంవత్సరంలో 84 మంది తాగి డ్రయివ్ చేస్తూ పట్టుబడ్డారు.

ఈ కంపెనీ ఏమిటో మీరూహించగలరా? ...!

ఊహించలేకపోతున్నారా? !

అయితే వినండి. అది 545 మంది సభ్యులుగల లోయర్ హౌస్ ఆఫ్ పార్ల మెంట్ ఆఫ్ ఇండియా. వీరే కోట్లాది భారత ప్రజల బాగుకోసం వేల కొద్దీ చట్టాలని సృష్టించి మనం సక్రమమార్గంలో నడిచేలా చూసేది. ఆశ్చర్యంగా వున్నా ఇది నిజమే మరి!

అయినా... మేరా భారత్ మహాన్ హై!

4 జూలై 2000

# దొంగతెలివి

ప్రతి దొంగా తానెంతో తెలివిగా దోచుకుంటున్నాననీ, తనని పట్టుకోవడం బ్రహ్మతరం కూడా కాదనుకుంటాడేమో. ఎందుకంటే తప్పకుండా పట్టుపడతామనీ, శిక్ష తప్పదనీ తెలిస్తే ఎంతమంది సాహసంగా దొంగతనాలకి పాల్పడతారు?

న్యూయార్క్ నగరంలోని పార్కింగ్ మీటర్లలో మోటార్ కారు డ్రైవర్లు డిపాజిట్ చేసే డబ్బు నిజానికి ట్రాన్సిట్ అథారిటీకి చెందాలి. కానీ గిస్సెప్ మన్నిని అనే ఓ వ్యక్తి ట్రాన్సిట్ అథారిటీకి ఈ దొంగతనం జరుగుతున్నట్టు తెలియలేదు.

అయితే డైమ్ నాణాలు మాత్రమే పార్కింగ్ మీటర్లలో వేస్తారు. డాలర్ వేయాలంటే పది డైమ్ నాణాలు వేయాల్సి వుంటుంది. ఇతను వీటిని సంచీల్లో మోసుకుని వెళ్ళేవాడు.

అంతేకాదు తన ఖర్చులకు ఆ నాణాలనే వాడేవాడు. నయాగరా ఫాల్స్‌లో ఇతను 20,000 డాలర్లు చెల్లించి ఓ టైమ్ షేర్ అపార్ట్‌మెంట్‌ని కొన్నాడు. ఏడాదిలో 4 రోజులు ఆ అపార్ట్‌మెంట్‌లో అతను ఫ్రీగా వుండవచ్చు.




జేబులేకి వెళ్ళేదది. అలా ఏడాదికి లక్షన్నర డాలర్లచొప్పున పద్నాలుగేళ్ళ పాటు ఆ డబ్బుని కొట్టేసాడు మన్నిని.

ఇటలీనుంచి అమెరికాకు వలసవచ్చిన తల్లిదండ్రులకు పుట్టిన ఇతగాడు దొంగతాళాలు చేయడంలో ఆరితేరినవాడు. పార్కింగ్ మీటర్లకు డూప్లికేట్ తాళంచెవులను తయారు చేసుకొని పార్క్అవెన్యూలో అరకిలో మీటరు పరిధిలోని 500ల పార్కింగ్ మీటర్లలోని డైమ్స్ నాణాలను కాజేయ సాగాడు.

ప్రతిరాత్రీ 2000 డాలర్లు ఆర్జించేవాడతను. అయితే కొంతవుంచి కొంతతీసుకోవడంతో

కానీ వారి న్యూయార్క్ ఆఫీస్‌కి ఇతను ఆ మొత్తాన్ని డైమ్ నాణాలలో చెల్లించడం అక్కడి కేషియర్‌కి కోపం, ఆశ్చర్యం కలిగించింది. దాంతో క్యాషియర్ ఆ సంగతిని పోలీసులకి తెలియచేశాడు.

డిటెక్టివ్‌లు మన్నినిని వెంబడిస్తే అతను చేసే ఘనకార్యం బయటపడింది. అతనింట్లో పదిహేను లక్షల డైమ్ నాణాలు దొరికాయి. అతనికి పదేళ్ళ శిక్ష విధించారు. ఇది 1973లో జరిగింది.

# చతుర కతలు

## గ్రేట్ సేల్స్‌మేన్

అమెరికాలోని ఓ సూపర్‌బజార్‌లో కొత్తగా చేరిన ఓ సేల్స్‌మేన్ తన పనిని సమర్థవంతంగా నిర్వహించడం గుర్తించాడు మార్కెటింగ్ మేనేజర్.

ఓరోజు అతనిలోని ఆ సమర్థతని స్వయంగా చూడాలనుకుని కస్టమర్‌లా అతని దగ్గరికి వెళ్ళాడు. అప్పటికే అతను ఇంకో కస్టమర్‌తో మాట్లాడుతూండడంతో తన వంతుకోసం చూస్తూ వాళ్ళ మధ్య సంభాషణని వినసాగాడు.

"ఈ ఫిష్‌హుక్ అన్నిటికన్నా బెస్ట్" అంటూ ఒకటి చూపించాడు సేల్స్‌మేన్ అతనికి.

అది అతనికి నచ్చగానే అడిగాడు.

"ఫిష్‌రాడ్, రీల్స్‌మీద ఈ రోజుతో పాతిక శాతం డిస్కౌంట్ ముగుస్తుందని మీకు తెలుసా? ఇవి రేపు కొంటే ధర పెరుగుతుంది"

నిజంగా డిస్కౌంట్ ఏమీలేదు. అయినా అతను పాతికశాతం ధర పెంచి అబద్ధం చెప్పాడని గ్రహించాడు మార్కెటింగ్ మేనేజర్.

కస్టమర్ వాటినీ కొన్నాక అడిగాడు సేల్స్‌మేన్.



"మీరు ఫిషింగ్ సముద్రంలో చెయ్యాలనుకుంటున్నారా? లేక నదిలోనా?"

"సముద్రంలో" చెప్పాడా కస్టమర్.

"అయితే మీకు ఓ మరపడవ ముఖ్యం. ఎంత లోపలికి వెళ్తే, అంత తేలిగ్గా పెద్ద చేపలు మీ హుక్‌కి తగులుకుంటాయి.



చేపలు తగులుతూంటేనే మజా కదండీ"

అందుకతను అంగీకరించడంతో బోట్స్ అమ్మే విభాగానికి తీసుకెళ్ళాడు. ఆరు మీటర్ల పొడవుగల మరపడవని కొన్నాడా కస్టమర్.

"ఈ మరపడవని సముద్రందాకా తీసుకెళ్ళడానికి కారు వెనక కట్టి తీసుకెళ్ళచ్చు మీ కార్ మేక్ ఏమిటి?" అడిగాడు సేల్స్‌మేన్.

"బ్యూక్ కారు"

"అంటే థౌజండ్ సి.సి. దాని ఇంజన్ కెపాసిటితో ఈ పడవని లాగలేదు. మంచి కారు ఒకటి కొంటేనే మీరు ఆ పడవని ఉపయోగించగలరు"

అందుకతను అంగీకరించడంతో కార్లు అమ్మే సెక్షన్‌కి తీసుకెళ్ళి పెద్ద కారు కొనిపించాడు.

ఆ కస్టమర్ వెళ్ళాక సేల్స్‌మేనేజర్‌ని అడిగాడు ఏం కావాలని. "జరిగిందంతా చూశాను. అయిదు డాలర్లు ఖరీదు చేసే ఫిష్ హుక్‌ని కొనడానికి వచ్చి అతని చేత యాభైవేల డాలర్ల వస్తువులు కొనిపించావు. గ్రేట్" మెచ్చుకున్నాడు మేనేజర్ తనెవరో చెప్పి.

"లేదు సార్. అతను ఫిష్‌హుక్ కోసం రాలేదు. తన భార్యకి జ్వరంగా వుందని జ్వరం మాత్రల కోసం వచ్చాడు. ఇంటి దగ్గర అనారోగ్యపు భార్యతో ఏం వేగుతారు, వీకెండ్‌కి ఫిషింగ్‌కి వెళ్ళచ్చుగా అని సజెస్ట్ చేశాను" చెప్పాడు సేల్స్‌మేన్ నవ్వుతూ

—యం. లిపి

# అడుగుజాడ

అదొక వెనుకబడిన మారుమూల ప్రాంతం.

ఎత్తుగా కొండ వుండటంవల్ల దారి సరిగ్గా లేక ఆ వూరు వెనక బడి ఉంది.

కొండ మీదికి తారు రోడ్డు వేయిస్తానని వాగ్దానం చేసి ఎన్నికలలో గెలిచాడు పెద్ద రాయుడు.



ఇచ్చిన మాట ప్రకారం ఫండ్స్ శాంక్షన్ అయ్యాయి.

రోడ్డు పని మొదలయింది.

ముందుగా ఇంజనీర్లు సర్వేకు బయలుదేరారు. ఎత్తు పల్లాలు చూసే లెవెలర్లు, దూరాలు కొలిచే లింకు గొలుసులు, చూసేందుకు దుర్బిణీలు, కాగితాల చుట్టలు....

ఖాకీ టోపీలు, ఇన్‌షర్ట్ పాంటు బాబులు రోజూ కొండమీది నుండి కొండ కిందకు, కొండ కిందనుండి కొండమీదకు తిరుగుతూ హడావుడి చేస్తున్నారు.

రోజూ అటుగుండా వెళ్లే తిప్పడికి ఇదంతా చాలా చిత్రంగా వుంది.

ఈ బాబులంతా కలిసి ఇక్కడ ఏం చేయబోతున్నారు?' అన్నది వాడికి అర్థం

కావడంలేదు.

ఆఖరికి ఉండబట్టలేక ఒకరోజు అక్కడున్న లెక్కలువేసే పెద్దమనిషిని అడిగేశాడు.

"ఏంటిబాబూ? ఏంచెయ్యబోతున్నారిక్కడ? "

"కొండ మీదకి సరైన దారి కనుక్కోబోతున్నాం." అన్నాడా పెద్దమనిషి.

"దానికింత ఆర్భాటం దేనికి? మా గాడిదనడిగినా చూపిస్తుంది గదా దారి? " అన్నాడు వాడు.

"గాడిదనా? ఎట్లా? "

"ఏముంది బాబూ... దాని నడ్డికి ఒక కర్ర పుల్ల కట్టి... కర్రపుల్ల అంచున ఒక కారెట్ ముక్కో... కొద్దిగా పచ్చగడ్డో వేలాడదీస్తే దాన్ని తినేందుకు ముందుకు పోతుందిగదా! గాడిదకి తెలుస్తుంది కొండ మీదికి దారెటో. దాని వెనక పోతే సరి."

"మరి మీ గాడిద సమయానికి దొరక్కపోతేనో..."

"మీ ఇంజనీరు బాబులు ఉండనే వున్నారు గదా!" అని చక్కా పోయాడు తిప్పడు.

–కర్లపాలెం హనుమంతరావు

---

## డిటెక్షన్

"ఒకళ్లు కాదు ఇద్దరు కాదు కొన్ని వందలమంది యువకులు మాయమైపోతున్నారు. అందరూ పధ్నాలుగేళ్లనుండి పెళ్లికాని బ్రహ్మాచారుల వరకూ మాయమైపోతున్నారు. వాళ్లంతటవాళ్లు ఎక్కడికైనా వెళ్లేటట్లయితే ఇంట్లో పేరెంట్స్‌కీ, బంధువులకీ, స్నేహితులకీ చెప్పి వెడతారుకదా! కానీ వాళ్లెవరూ చెప్పి వెళ్లలేదు. అసలేంజరుగుతోందీ? ఈ సిటీలో యువకులంతా ఇలా ఎందుకు మాయమైపోతున్నారు? " శ్వాస పీల్చుకోవడానికన్నట్టు ఒక్కసారి ఆగాడు ఇన్స్‌పెక్టర్ జనరల్ ఆఫ్ పోలీస్.

ఆయన కిందిస్థాయి ఉద్యోగులంతా నిశ్శబ్దంగా ఆయన మాట వినసాగారు.

"ఇదంతా కిడ్నాపింగ్ వ్యవహారం అనిపించడంలేదు. కిడ్నాప్ చేసే వాళ్లు ఇంత మందిని ఒక్కసారి చేయరుకదా! లేక ఇదేమైనా విదేశీయుల కుట్రా? అసలేమిటిదంతా? ఇప్పటికే ఈ కనిపించని యువకుల కుటుంబాల కంప్లైంట్స్‌తో మన ఆఫీస్ ఫైల్స్ నిండిపోతున్నాయి. పత్రికలు, టీవీ, రేడియోల్లో మన అసమర్ధతను తిడుతూ వ్యాసాలు వస్తున్నాయి. పైనుంచి మంత్రుల చివాట్లతో నా తల వాచి పోతోంది. ఇంత మంది పోలీసు ఆఫీసర్సు ఉండి యువకులంతా ఎందుకు మాయమవుతున్నారు? షేమ్... షేమ్..." కోపంతో ఊగిపోతూ చెప్పాడు.

అదే సమయంలో ఫోన్ మోగింది. ఐ.జి. బిక్కుబిక్కుమంటూ రిసీవర్ చెవికి ఆనించుకున్నాడు. అవతల వాయిస్ వినగానే ఆ మనిషి ఎదురుగా ఉన్నట్టు ఫీలైపోతూ చటుక్కున కుర్చీనుంచి లేచి సెల్యూట్ చేసి "సార్!" అన్నాడు. అవతల నుండి మాటలు వింటూ మధ్యమధ్య "యస్సార్!" అంటూ ఐదు నిముషాల తర్వాత ఫోన్ క్రెడిల్ చేశాడు.

"సి.యం గారి సెక్రటరీ బూతులు తిడుతున్నాడు. వారం రోజులక్రితం నుండి కుర్రాళ్లు కనపడకుండా పోతున్నారని వాళ్ల పేరెంట్స్ రిపోర్ట్సు ఇస్తుంటే ఇప్పటివరకూ ఒక్క క్లూ సంపాదించలేకపోయామని మనల్ని అసమర్ధులంటున్నాడు. ఛీ..ఛీ! ఇంతకన్నా అవమానం మరొకటి లేదు. అసలేంటయ్యా ఇది? ఈ సిటీలో ఏం జరుగుతోంది? ఎందుకు కుర్రాళ్లంతా మాయమైపోతున్నారు? ఎవరు? ఎవరు? ఎవరీ మిస్టరీని ఛేదించగలవాడు? " ఆవేశంగా ప్రశ్నించాడు.

"సార్! దీనికి సరైన సమర్థుడు డిటెక్టివ్ రవిచంద్రే సార్. ఎలాంటి మిస్టరీ అయినా

సరే క్షణాల్లో ఛేదిస్తాడు." చెప్పాడు కుర్ర సి.ఐ.

"అయితే వెంటనే రవిచంద్రని పిలిపించండి. "

అయిదు నిమిషాల తర్వాత ఆ గదిలోకి ప్రవేశించాడు డిటెక్టివ్ రవిచంద్ర. అక్కడున్నవాళ్లంతా అతనికి విష్‌చేసి కుర్చీ చూపించారు.

కుర్చీలో కూర్చుంటూ ఐ.జి. వంక చూశాడు. ఐ.జి. విషయమంతా వివరంగా చెప్పాడు.

ఐ.జి. చెపుతున్నంతసేపూ మౌనంగా కూర్చుని వింటున్న రవిచంద్ర చూపు కేలెండర్ మీద పడింది. ఐ.జి. చెప్పడం పూర్తయ్యేసరికి రవిచంద్ర మైండ్‌లో చటుక్కున ఆ ఆలోచన వచ్చింది. క్షణాల్లో అతని పెదవులమీదకు చిరునవ్వు దూసుకు వచ్చింది.

"ఓ.కె.. తెల్లారేసరికి మాయమైన ఆ కుర్రాళ్లంతా తిరిగి తమ ఇళ్లల్లో వుంటారు. నాదీ హామీ. ఓ.కె మీరిక నిశ్చింతగా వుండండి. కానీ నా రేటు తెలుసుగా?" అడిగాడు రవిచంద్ర.

"తెలుసు. థాంక్స్!" రిలీఫ్‌గా నిట్టూరుస్తూ చెప్పాడు ఐ.జి. రవిచంద్ర చెప్పినట్టు మర్నాడు ఉదయానికల్లా సిటీలో మాయమైన కుర్రాళ్లంతా తిరిగి తమ ఇళ్లకు వచ్చేశారు.



"ఏం మంత్రం వేశావు? అసలేంటి కథ? కుర్రాళ్లని ఎక్కడ పట్టుకున్నావ్? వాళ్లెందుకు మాయమయ్యారు? " అడిగాడు ఉత్కంఠగా ఐ.జి.

"మాయా లేదూ మంత్రమూ లేదు. నిన్న రక్షాబంధన్. సిటీలో ఉన్న కుర్రాళ్లంతా తమ చుట్టుపక్కల ఉన్న టీనేజ్ అమ్మాయిలు ఎక్కడ తమకు రక్షాబంధన్ కట్టి అన్నయ్య అంటారోనని భయపడి సిటీ వదిలి దూరంగా వెళ్లారు. నేను నిన్న మీ ఆఫీసుకు వచ్చినప్పుడు మీరు యువకుల అదృశ్యం గురించి చెపుతున్నప్పుడే నా చూపు అనుకోకుండా తెలుగు కేలెండర్‌మీద పడింది. రక్షాబంధన్ అన్న విషయం గుర్తొచ్చింది. కుర్రాళ్లు అందుకే మాయమైవుంటారన్న చిన్న డౌట్ వచ్చింది. నిజానికి నేను నిన్న రాత్రి ఇల్లు కదలలేదు. తెల్లారేసరికి ఆరా తీస్తే నా ఊహ కరెక్టే అయ్యింది." నవ్వుతూ చెప్పాడు డిటెక్టివ్ రవిచంద్ర.

"అమ్మ కుర్రాళ్లూ!" ఆశ్చర్యంతో నోరు తెరిచాడు ఐ.జి.

—కలపర్తి సత్యం



"చూడండీ! నేనీమధ్య కామశాస్త్రానికి సంబంధించిన పుస్తకాలు చాలాచాలా చదివాను. అందరిలో ఉత్తమోత్తమమైన స్త్రీ... పద్మినీ జాతి స్త్రీ. అలాంటి వధువుని నాకు వెతికిపెట్టాలి. అన్నట్టు ఆ స్త్రీ లక్షణాలు..."

అని ఏకరువు పెడుతూ మన్మథరావనే ఓ పెళ్ళికొడుకు "పాణిగ్రహణం" ఆఫీసుకు వచ్చాడు.

ప్రేమవివాహలతో మొదలెట్టి అన్ని రకాల వివాహలనూ... విజయవంతంగా జరిపిస్తున్న ఆ పాణిగ్రహణం ఆఫీసులోని కార్యకర్తలందరూ పెళ్ళికాని అమ్మాయిలే.

రకరకాల వ్యక్తులను తమ సునిశిత మేధాశక్తితో ఎదుర్కొన్న ఆ అమ్మాయిలు ఇతని విషయంలో ఏంచేశారు? గతంలో వారు చేసిన కొన్ని వింతవివాహలు ఎలాంటివి?

హాస్యాన్ని చిలికిస్తూనే ఆలోచింపచేసే ...

**ఎ. జయలక్ష్మిరాజు** రచన

# పాణిగ్రహణం

ఈ నెల చతుర సమగ్ర నవల

ఆ వర్కింగ్ ఉమెన్స్ హాస్టల్లోని యువతులంతా హడావిడిగా అటూ ఇటూ తిరుగుతూ వారివారి పనులు చేసుకుంటున్నారు. అందరూ ఇరవై దాటిన వాళ్ళే. పదోనంబరు గదిలోని రాజేశ్వరి మాత్రం ఏకాగ్రతగా ఓ ఉత్తరం చదువుతోంది.

"ఎక్కడినించి ఉత్తరం? అంత దీక్షగా చదువుతున్నావు? " అంది విజయ.

"నా జాతి ఫ్రెండునించి"

"ఫ్రెండ్సులో కూడా జాతులా? అంటే మీకులం అమ్మాయా? "

"ఇంచుమించు అలాంటిదే"

"ఇంచుమించు అంటే పూర్తిగా మీకులం కాదా? "

"నేను రెండు కులాలకు పుట్టాను"

"ఓస్! అదా! మీ అమ్మా నాన్నలు లవ్ మ్యారేజి చేసుకున్నారు అంతే కదా! అదేం పెద్ద సంగతి, కొత్త సంగతి కాదే! పూర్వం నించి ఇంటికొకరు 'లవ్‌మ్యారేజి' చేసుకుంటూనే ఉన్నారు. ఆ టాపిక్‌కొస్తే మా అమ్మా నాన్నలది కూడా లవ్ మ్యారేజే. ఇపుడు నేను కూడా నీజాతి ఫ్రెండునయిపోయాను చూశావా? అది సరే ఇంతకీ ఆ ఉత్తరం రాసిన అమ్మాయి ఎవరు? ఏం రాసిందేంటి? "

"దానిపేరు రమ! దానికి వాళ్ళమ్మా నాన్నలు పెళ్లిచేయాలనుకుంటున్నారుట"

"మన వయసే కదా! మనకింకా మొగుళ్ళు రాలేదుగానీ, వచ్చి ఉంటే చెరో ఇద్దరు పిల్లల్ని కని, కాన్వెంటులో చేర్పించి ఉండేవాళ్ళం కాదంటావా? ఇంతకీ నీ ఫ్రెండు రమ పెళ్ళి సంగతేమిటి? " అంది విజయ.

"పెళ్ళంటే మాటలా? అన్నీ కలిసి రావాలి కదా. అన్నింటిలోనూ ప్రగతి సాధించాం అంటారు. కానీ ఆడపిల్లల పెళ్ళిళ్ళ దగ్గరకొచ్చేసరికి పాతాళంలోనే ఉంటుంది ప్రగతి"

"అది అందరికీ తెలిసిన విషయమేగానీ, ఇంతకీ మీ రమాదేవిగారి కొచ్చిన సమస్య ఏమిటి? "

"వాళ్ళమ్మా నాన్నలది ప్రేమవివాహం కదా! ఇపుడు రమకు అమ్మ కులంలో అబ్బాయితో పెళ్ళిచేయాలా? నాన్నకులంలో అబ్బాయితో పెళ్ళిచేయాలా అని సందిగ్ధంట. అది తేలితేనే పెళ్ళవుతుందిట"

"అలాగా! నీ జాతి ఫ్రెండు అన్నావు కదా! అలాంటి పెళ్ళి సమస్య బహుశా నీకూ ఎదురయ్యే ఉంటుంది కదా! సలహా చెప్పేస్తే పోలా? "

"ఇన్నిరోజులూ ఒకే హాస్టల్‌లో ఒకే గదిలో ఉంటున్నా ఇంతలోతుగా పర్సనల్ విషయాలెప్పుడూ మనం మాట్లాడుకోలేదు. అసలు నీకూ నాలాంటి అమ్మా నాన్నలే ఉన్నారని ఇపుడేగదా తెలిసింది. ఆ సలహా ఏదో నీవే చెప్పరాదూ!" అంది రాజేశ్వరి.

"ఈ సమస్య నాలాంటి వారు, నీలాంటి వారు చెబితే పరిష్కారం అయ్యేదికాదు. అమ్మా నాన్నలకు ప్రేమించుకున్నపుడు, పెళ్ళి చేసుకున్నపుడు, పిల్లల్ని కన్నపుడూ... ఉన్నంత సఖ్యత, ఐకమత్యం, పిల్లల పెళ్ళిళ్ళ టైంలో ఉండదులే. అందుకు నిదర్శనం నేనే!

"మా అమ్మా నాన్నలు నా పెళ్ళి విషయంలో నన్ను గాలికి వదిలేశారు. నచ్చిన వాడిని చూసి పెళ్ళిచేసుకోవాలనుకుంటున్నాను. నచ్చిన వాడు దొరకాలి. వాడికీ నామీద ప్రేమ కలగాలి!

"ప్రేమదేముందిలే క్షణాల్లో కలుగుతుంది. అమ్మానాన్నల్లా కాకుండా, అవగాహన కలిగి ఉండి కాపురం చేయాలి.

"అబ్బో! పెద్ద తతంగం ఉందిలే! ఇంతవరకు అలాంటిది ఒక్కటంటే ఒక్కటీ జరగలేదు. తలనెరిసిపోతుంటే రంగేసుకుంటున్నాను. ఇష్! నా కథ చాలా బోర్! ఇంతకీ నీకథేంటి? నీవేం అనుకోనంటే ఓ ప్రశ్న! ఆమధ్య నీ పెళ్ళి ఆగిపోయిందనీ, అదనీ, ఇదనీ, పక్కరూంలో వాళ్ళు గుసగుసలాడుకుంటుంటే విన్నాను, నిజమేనా? ఎలా ఆగి

పోయింది? స్వంత ఊరు ఇదే అయ్యుండి నువ్విలా హాస్టల్లో ఎందుకుంటున్నావో చెప్పవా? " అంది విజయ.

"ఏం? ఏదైనా మ్యాగజైన్‌లో కథల పోటీ గానీ పెట్టారా? "

"అలాంటిదేంలేదుగానీ, ప్రతి జీవితానికీ ఓ చరిత్ర ఉంటుందన్న కొటేషను చదివాను. నీ కభ్యంతరం లేకుంటేనే చెప్పు"

"అయితే టైం ఉన్నపుడు కొంచెం కొంచెం చెబుతూ ఉంటానులే. మధ్యమధ్య ప్రశ్నలతో, అనుమానాలతో మాత్రం విసిగించకూడదు"

"అలాగే తల్లీ! మొదలుపెట్టండి" అంది నవ్వుతూ విజయ. రాజేశ్వరి తన జీవిత చరిత్రను పదోపేజీ దగ్గర్నించి తిరగెయ్యసాగింది!

★ ★ ★

మానాన్న బ్యాంకు ఆఫీసరు. మా అమ్మ స్కూలు టీచరు. నాకో అన్నయ్య ఉన్నాడు. పేరు మధు.

డబ్బుకు లోటులేదు. స్వంత ఇల్లు, స్కూటరు, అమ్మా నాన్నలప్రేమ అన్నీ పుష్కలంగా ఉన్నాయి. అసలు పోట్లాట ఎలా ఉంటుందో తెలీదు నాకు. అమ్మా నాన్నలు పోట్లాడుకోవటం ఎప్పుడూ చూడలేదు నేను.

సెలవులకు అమ్మమ్మగారి ఊరికెళ్ళేవాళ్ళం. అక్కడ మామయ్యలు, పిన్ని, బాబాయ్‌లు, తాతయ్య, అమ్మమ్మలు ఎంతో ప్రేమగా చూసేవారు. తిరిగి వచ్చేటపుడు కొత్త బట్టలు కుట్టించేవారు. అమ్మకు ఖరీదయిన చీరపెట్టేవారు.

సంవత్సరమంతా సంతోషంగా అమ్మమ్మగారి ఊర్లో గడిపే రోజులకోసం... ఆ కొత్తదనంకోసం ఎదురుచూసేదాన్ని.

అపుడు నాకు పదేళ్ళు. ఎలిమెంటరీ స్కూలునించి హైస్కూలు చదువుకు వెళ్ళటంతో ఫారిన్‌కెళ్ళి చదువుతున్న ఫోజు... ఫీలింగ్స్...

కొత్త స్కూలు... కొత్త స్నేహితులు... కొత్త పుస్తకాలు... అన్నీ కలసి మొదట్లో కాస్త భయపెట్టాయి. సరిగ్గా అలాంటి సమయంలో అమ్మమ్మగారి ఊరినించి అర్జంటుగా రమ్మని కబురొచ్చింది.

తాతయ్యకి హార్ట్‌ఎటాక్ వచ్చిందని తెలిసిన కబురుతో అమ్మ ఏడుస్తూ ప్రయాణం చేసింది. కూడా మేమూ వెళ్ళాం. తాతయ్య ఆరోగ్యం కుదుటపడింది. ఆ వూళ్ళో దాదాపు పది రోజులున్నాము. అపుడు ఓ కొత్త వ్యక్తి పరిచయమయ్యాడు. అతనిపేరు మురళి. అతను టెన్త్ క్లాసు చదువుతున్నాడు. పెద్ద మామయ్య కొడుకు. నాకు బావ. చిన్నప్పటినించి కనిపించని ఈ బావ ఇపుడు కనిపించడమేమిటి? ఇన్నేళ్ళు కనిపించకపోవడమేమిటి? లాంటి ప్రశ్నలు పెద్దవాళ్ళను అడగలేకపోయాను.

మా పిన్ని కూతురుంది దివ్య అని! అది నాకంటే రెండేళ్ళు చిన్నది. అయినా ఆరిందాలా అన్నీ పెద్ద మాటలు మాట్లాడుతుండేది. కనీసం నన్ను అక్క అని కూడా పిలవదు. పేరు పెట్టే పిలుస్తుంది. సెలవులకెళ్ళినపుడంతా ఏదో ఒక విషయంమీద మా యిద్దరికీ పోట్లాట వస్తుండేది? పెద్దవాళ్ళు తగాదా తీరుస్తుండేవారు.

అదయితే నా ధర్మసందేహాలు తీరుస్తుందనిపించి జట్టుకలిపాను.

"అవునూ ఈ మురళి బావ వాళ్ళదే ఊరు? ఇన్నేళ్ళు నాకు ఒక్కసారి కూడా కనిపించలేదేంటి? " అనడిగాను దివ్యను.

"మరీ... మావయ్య వేరు కులం ఆవిడను పెళ్ళిచేసుకున్నారుట. తాతయ్య తిట్టాడుట. మామయ్యేమో తాతయ్యతో పోట్లాడాడుట. ఇల్లు విడిచి వెళ్ళాడుట. ఇన్నేళ్ళూ బొంబాయిలో ఉన్నారుట. తాతయ్యకిపుడుజబ్బు చేసింది కదా! అందుకని పిలిపించారుట" అంది ఆరిందాలా చేతులు తిప్పుతూ!

"మురళి నీక్కూడా బావ అవుతాడా? " అన్నాను.

# స చి త్ర వి చి త్రం



## చట్టం హస్తం పొడవైనది

న్యూయార్క్ రాష్ట్రంలోని లిస్లే అనే ఊళ్లో నివశించే డానాబార్బర్ (25) అనే ఓ నృత్య ఉపాధ్యాయురాల్ని పోలీసులు అరెస్ట్ చేసి వేలిముద్రలు తీసుకుని బేడీలు తొడిగారు. ఆమె చేసిన నేరం 3 వీడియో టేప్‌లని అద్దెకి తీసుకుని షాపు వాళ్లకి సమయానికి తిరిగి ఇవ్వకపోవడం. ఆమె ఉదయం 7 నుంచీ రాత్రి 10 దాకా నృత్య శిక్షణ గరుపుతూండటంతో ఇంటికి వెళ్లేటప్పుడు, ఇంటినుంచి బయలుదేరేటప్పుడూ ఆ షాపు మూసి ఉండటంతో ఆ క్యాసెట్లు ఇవ్వలేకపోతున్నట్టు ఆ షాపు వాళ్లకి ఫోనులో వివరించింది. అయినా షాపుయజమాని పోలీసులకి ఫిర్యాదు చేస్తే ఆమె వద్దనుంచి ఆ కేసెట్లతో పాటు 144 డాలర్ల ఫైను వసూలు చేసి, అటుపైన అరెస్ట్ కూడా చేశారు. చట్టప్రకారం ఆమె చేసిన నేరానికి ఏడాది జైలు శిక్ష పడేదే కానీ జడ్జి మొదటి తప్పుగా వదిలేశాడు.

"అవును. కానీ నేను వాడిని పెళ్ళిచేసుకో కూడదట. వాళ్ళమ్మది వేరేకులమట. వాడు నిన్ను చేసుకుంటే సరిపోతుందిట. ఎందు కంటే మీనాన్నది వేరేకులం కదా! మీ నాన్నదే పెద్దకులమటగా? మన కులమే చిన్న కులమట. అమ్మమ్మ వాళ్ళు మాట్లాడు కుంటుంటే విన్నాను" అంటూ తనకు తెలి సిన విషయాలన్నీ ఏకథాటిగా చెప్పింది.

ఈ కులాల గురించి ప్రసక్తి నాకెప్పుడూ ఎదురుపడలేదు. నా చిన్న మనసులో ఏదో అలజడి ప్రారంభమైంది. ఏవేవో జవాబు తెలియని ప్రశ్నలు, సందేహాలు.

అమ్మమ్మగారి ఊర్లో ఉన్నన్నిరోజులు సంతోషంగా గడపలేకపోయాను. మాటిమా టికీ పెద్దవాళ్ళ మధ్యచేరి వాళ్ళ మాటలను ఆలకించేదాన్ని. వాళ్ళ మాటల్లో అమ్మ కులం గురించి, నాన్నకులం గురించి టాపిక్ వస్తుందేమోనని ఎదురుచూసేదాన్ని. నాకు నిరాశే మిగిలింది.

ఓరోజు పెరట్లో ఒంటరిగా కూర్చుని ఉండగా మురళి బావ నా పక్కన వచ్చి కూర్చుని తను తింటున్న వేరుశెనక్కాయలు నాక్కొంచెం పెట్టాడు. నా చదువు గురించి, పరీక్షల గురించి అడిగాడు. తను చూసిన సినిమాల గురించి, తను ఆడిన ఆటలపో టీల గురించి చెప్పాడు.

చాలాసేపు మా మధ్య సంభాషణ జరగ డటంతో నాక్కాస్త చనువూ, ధైర్యం వచ్చాయి.

"మీ అమ్మది వేరే కులమటగా?" అన్నాను.

"ఆ! అవును అయితే ఏం?" అన్నాడు మురళి.

"మా నాన్నగారిది కూడా వేరే కులం!"

"తెలుసు!"

"ఇంట్లోవాళ్ళంతా... దివ్య... వాళ్ళంతా మనలని వేరువేరు కులాలని మాట్లాడుకుం టుంటే నాకు బాధగా ఉంది!" అన్నాను.

"వాళ్ళంతా మొరటువాళ్ళు. వాళ్ళ మాట లను పట్టించుకోకూడదు. గాంధీతాత ఏం చెప్పాడు. కులమత బేధాలుండకూడదని చెప్పలా? పుస్తకాల్లో చదువుకోలేదా?"

"అవుననుకో! అసలీ కులమంటే ఏమిటి? ఎక్కడినించి వచ్చింది?"

"నువ్వింకా చిన్న పిల్లవు నీవు నాలాగా టెన్త్‌కొచ్చేసరికి పెద్దదానవవుతావు. అపుడు అన్నీ అర్ధమవుతాయి. ఇపుడు మాత్రం బాగా చదువుకో. మళ్ళీ ఈసారి వేసవిసెల వుల్లో కలుద్దాం. నీకెప్పుడయినా నాకు ఉత్తరం రాయాలనిపిస్తే ఈ అడ్రసుకు రాయి. మనిద్దరం ఒక జట్టు. సరేనా?" అన్నాడు మురళి.

అలా నాకు మురళితో స్నేహం ఏర్ప డింది. నెలకోసారి అతనికి ఉత్తరం రాసే దాన్ని. ఆ ఉత్తరాల్లో నేను చూసిన సినిమా లపేర్లు... పండుగ బట్టల గురించి... నా స్నేహితుల గిల్లికజ్జాల గురించి రాసేదాన్ని. కానీ మురళి ఉత్తరాలకో ప్రత్యేకత ఉండేది. ఆ ఉత్తరాల్లో తాను చదివిన లైబ్రరీ పుస్త కాల గురించి వివరణ ఉండేది. ఫలానా ఫలానా పుస్తకాలను చదువు అంటూ రాసే వాడు. మొదట్లో నాకు చిరాకనిపించినా... మురళి కోసం పుస్తకాలు చదవటం అల వాటు చేసుకున్నాను. క్రమక్రమంగా అల వాటు పిచ్చిగా మారిపోయింది. ఎనిమిదవ తరగతినించి తొమ్మిదిలో చేరాను. ఆ వయ సుకే మహనీయుల జీవిత చరిత్రలన్నీ చది వాను.

ఇలా పుస్తకాలు తప్ప మరోటి లేని నా ప్రపంచంలో, నిశ్శబ్దంగా ఉన్న సెలయేరులో నికి రాయి విసిరినట్టు అయింది.

మా యింట్లో ఓ మార్పు జరిగింది. మా మేనత్త భర్త పోయాడంటూ మా యిల్లు చేరింది. ఆమె వయసు ఇంచుమించు అమ్మ వయసే.

టెన్త్‌క్లాసు పూర్తి చేసిన ఆమె కొడుకు చక్ర వర్తిని తీసుకుని ఏడుస్తూ, నాన్న ముందు శోకాలుపోయింది. ఒక రోజంతా అలా ఏడు

స్తూనే ఉంది. "ఇంక నాకు దిక్కెవరురా లక్ష్మణా! నాన్న ఉంటే అన్నీ చూసుకునే వారు. తమ్ముడి దగ్గర అమ్మ ఉంటోంది. నేను కూడా వాడి దగ్గరికెడితే భారమవు తుందని నీ దగ్గరికి మనసు చంపుకుని మరీ వచ్చాను. 'వాడు కులంతక్కువ పిల్లని చేసు కున్నాడు, ఆ తిండి ఆ వంట నీకు సరి పోదు, కలోగంజో తాగి ఇక్కడేఉండు' అని అమ్మ అంటున్నా వచ్చేశాను. ఎందుకంటే పిల్లాడి భవిష్యత్తు పాడయిపోతుందనీ, వాడిని కాస్త చదివించుకుందామనీ నీ పంచన చేరాను" అంటూ ముక్కు చీదింది.

"అలాగే ఉందువుగాని ఇంక ఏడవకు" అన్నాడు నాన్న చిరాగ్గా.

"పిల్లలూ! ఒరే మధూ! ఒసే! రాజీ! చక్రి మీకు బావ అవుతాడుగానీ, ముగ్గురూ ఒక జట్టుగా ఉండండేం!" అంది నా మేనత్త.

అలా చక్రవర్తి నాకు ఇంకో బావ స్థానంలో మా యింట్లో శాశ్వతంగా మకాం పెట్టాడు!

"అదేమిటి చెప్పటం ఆపేసి ఎక్కడికా పరుగు? "

"నా కథ చెబుతానన్నాను కదాని రోజుల తరబడి బండకతుక్కుని, కూర్చుని చెబుతాన నుకున్నావా? ఇదంతా ఒక్కరోజు జరిగిన కథనుకున్నావా? పదిహేనేళ్ళు జరిగిన కథ. పదపద ఆఫీసుకు టైం అవుతోంది, వెళ్ళాలి" అంది స్నానానికి సిద్ధమవుతూ.

"మంచి సస్పెన్సులో వదిలావు కదే! తెలుగు సినిమాలోలాగా ఇద్దరు హీరోలున్న ట్టున్నారు కదా నీకు? "

"ఇలాంటి ప్రశ్నలేస్తే అవునవును అంటూ మళ్ళీ కూర్చుని కథ చెబుతాననుకున్నావు కదూ. అంత దృశ్యం లేదుగానీ పద!"

"నేను కాస్త లేటుగా బయల్దేరుతాను నువ్వెళ్లు" అంది విజయ.

"అలాగే!" అంటూ త్వరత్వరగా రెడీ అయి హాస్టల్ బయట కొచ్చింది రాజేశ్వరి.

"హాయ్! చందూ! ఇదేమిటి ఈ టైంలో వచ్చావు. ఇలా గేటుముందు తచ్చాడు తుంటే అమ్మాయిలకు బీట్ కొట్టేవాడివను కుని, గూర్ఖా నిన్ను పట్టుకుని చావగొడితే ఏంచేస్తావు? " అంది చందూని చూసి రాజే శ్వరి.

"వాడి బొంద! వాడేం చేస్తాడు. అయినా ఇది ఉమన్స్ హాస్టలు. అందరూ ఆడాళ్ళే. ఏదైనా జరగరానిది జరిగితే ఆదుకోవాలంటే, కనీసం పదిమంది పహిల్వాన్లున్నా చాలరు. అలాంటిది ఆ గూర్ఖా శరీరంమీద రెండువం దల గ్రాముల కండకూడాలేదు. అతనికో డ్రస్సు, లాఠీ ఇచ్చి గేటుముందు కాపలా! హా! అసలు మీ ఉద్దేశ్యం ఏమిటి? గూర్ఖా పనికి మగాడైతే చాలు అనే కదా! ఎంత బలహీన మనస్కులో కదా ఈ స్త్రీలు!" వ్యంగ్యంగా అన్నాడు చందూ!

"మరీ అంత స్టీల్లొద్దు నాన్నా! అతనూ నీలాంటి బేకార్ ఇన్‌స్పెక్టరే. మా వార్డెన్ దగ్గరకొచ్చి ఉద్యోగమో మొర్రో అని ఏడిస్తే దయతలచి ఆ ఉద్యోగమిచ్చింది తెలుసా! ఆ గూర్ఖాను అక్కడ కాపలా పెట్టింది కేవలం నీలాంటి బీటుగాళ్లకోసం. అసలు, నిసలైన దొంగలు కానీ గూండాలు కానీ వచ్చారనుకో తాటవలిచి చేతిలో పెట్టడానికి పహిల్వాన్లు మా ఆడాళ్లలోనే ఉన్నారు. ఈ హాస్టలును అంత తేలిగ్గా అంచనా వెయ్యకు!" అంది రాజేశ్వరి.

"అలాగా! రాజరాజేశ్వరీ, మాతా! తప్పయి పోయింది. అలా బయటకెళ్ళి కాసేపు మాట్లాడుకుందాం, రారాదూ? "

"చూడు తండ్రీ! ఆకలేసినపుడల్లా అన్నం పెట్టటానికి నీకు మల్లే నాకు అమ్మా నాన్నలు ఇక్కడ లేరు. తన్ని తరిమేశారు. నా పుడ్డు నేనే సంపాదించుకోవాలి. ఇలా పరగడుపునే కబుర్లాడుకుంటుంటే పొట్ట గడ వదు. సాయంత్రం చూద్దాం!" అంది రాజి.

"మాట్లాడితే శూలాలతో గుచ్చుతావు కదా! అలాగే సాయంత్రం నీ వెంట నీ స్నేహితురాలు విజయను కూడా తీసుకురా

రాదూ సరదాగా ఉంటుంది" అన్నాడు చందూ.

ఓ క్షణం చందూని తేరిపార చూసి తేలిగ్గా నవ్వేసి "అలాగే!" అంటూ వెళ్ళిపోయింది.

ఆ సాయంత్రం ఓ హోటల్లో చందూ, రాజి, విజయ కూల్ డ్రింకు తాగుతూ కూర్చున్నారు. విజయ ఓ ప్రయివేటు స్కూల్లో టీచరు. రాజేశ్వరి ఓ ప్రయివేటు కంపెనీలో టైపిస్టు. చందూ నిరుద్యోగి. విజయ, రాజి తమతమ ఉద్యోగాల్లోని సాధకబాధకాలు, పెద్దపులుల్లాంటి బాస్‌ల గురించి మాట్లాడుకుంటున్నారు.

"ఇంతకీ ఈరోజు విశేషమేమిటి? " అంది చందూనుద్దేశించి రాజి.

"ఈరోజు నా మనసేం బాగాలేదు. మీతో కాస్త మనసువిప్పి మాట్లాడుకుందామని వచ్చాను"

"భారీ డైలాగులొద్దు! అసలు విషయం చెప్పు"

"ఈరోజు ఇద్దరమ్మాయిలను పెళ్ళిచూపులు చూసొచ్చాను!"

"అమ్మో! పెద్దాడివయ్యావన్నమాట. పైసాకు ఠికాణాలేకున్నా పెళ్ళిచూపుల పేరుతో ఫుడ్డు లాగించేస్తున్నావన్నమాట. అన్నట్టు ఇదే ఉద్యోగం పెట్టుకున్నావా ఏమిటి? "

'ఎందుకలా వ్యంగ్యంగా మాట్లాడు'తావన్నట్టు విజయ రాజీని మోచేత్తో పొడిచింది.

"ఏం పర్లేదులే. చందూ నిక్కర్లేసుకునే వయసునించి తెలుసు. ఏం అనుకోడు" అంది గట్టిగా రాజి.

"అవునండీ! విజయగారూ! రాజీ బుల్లి గౌను వేసుకుని, ముక్కుకారుతూ, ఉమ్మితో పలక తుడుచుకునే రోజులనించి నాకు మంచి ఫ్రెండు. మామధ్య పోట్లాటల్లాంటి వాదనలుంటాయికానీ నిజమైన పోట్లాట ఉండదు"

"ఫ్లాష్‌బ్యాక్‌లాపి అసలు విషయంలోకి రా!"

"ఇంతకీ పెళ్ళి చూపుల్లో ఇద్దరమ్మాయిల్ని చూడటమేమిటి? ఒకరైనా నచ్చారా? " టాపిక్ మార్చింది విజయ.

"రెండుచోట్లకు పెళ్ళిచూపులకెళ్ళానన్నమాట. ఒకరు అమ్మ తెచ్చిన సంబంధం, రెండోది నాన్న తెచ్చిన సంబంధం. ఇద్దరూ నచ్చారు. కానీ ఎవరూ నచ్చలేదని చెప్పేశాను. ఎందుకంటారా? ఎవర్ని చేసుకున్నా ఇంకొకరికి కోపం"

"అలా చేస్తే అమ్మా నాన్నా బాధపడరా? " అంది విజయ.

"వాళ్ళేం బాధపడరు. గత ఇరవై అయిదేళ్ళుగా నన్ను బాధపెట్టటమే వారి ధ్యేయంగా పెట్టుకున్నారు"

"ఇతనూ మన జాతిపక్షే! ఈ పెళ్ళిళ్ళ బాధ ఇతనికీ తప్పలేదు" అంది గుసగుసగా రాజి విజయతో.

"ఏమిటా గుసగుసలు. నేను వినకూడదా? "

"అబ్బే! ఏంలేదు. ఈ అమ్మా నాన్నల గోలనలా పక్కకుపెట్టి నన్ను పెళ్ళిచేసుకోరాదూ! బాగానే ఉంటాను కదా! పైగా ఉద్యోగం కూడా చేస్తున్నాను" అంది రాజి.

"అమ్మో! నిన్ను పెళ్ళిచేసుకోవటమే. ఇప్పటికే ఇద్దరు అభాగ్యులు నీ వలలో చిక్కుకుని కుడితిలోపడ్డ ఎలుకల్లా గిలగిలలాడుతున్నారు. నేనంత సాహసం చేయలేను. నీకో నమస్కారం తల్లీ!" అన్నాడు చందూ.

కిలకిలా నవ్వింది విజయ. నవ్వుతున్న ఆమెను సర్వం మరిచి చూస్తుండిపోయాడు చందూ!

★ ★ ★

సరిగ్గా ఇరవై అయిదేళ్ళ క్రిందట ఓ ప్రేమజంట చందూకు జన్మనిచ్చింది.

శకుంతల, నారాయణరావు ఒకే కాలేజీలో చదువుకునేవారు. శకుంతల చాలా స్ట్రిక్టు! అబ్బాయిలు, మిగతా అమ్మాయిలనేడ్పించినంత సులభంగా శకుంతలనేడ్పించలేకపోవ

డంతో 'గయ్యాళి' అన్న ఓ బిరుదు తగిలించి తృప్తిపడ్డారు. అలాంటి శకుంతలను నారాయణరావు అరవై నాలుగు కళలూ ప్రదర్శించి... ఆరు నెలలు కష్టపడి ఆమె చిరునవ్వు సంపాదించి మరో సంవత్సరానికి కలిసి కాఫీ తాగి... ఎట్టకేలకు ఆమె మెడలో మూడుముళ్ళూ వేశాడు. ఇవన్నీ విశేషాలు కావు. కానీ మూడునెలల తర్వాత నారాయణరావు నిజస్వరూపం తెలిసి నిర్ఘాంతపోయింది శకుంతల. ఎంతో దారుణంగా అతను మోసపుచ్చిన వైనం తల్చుకుని దెబ్బ తిన్న కాలనాగులా బుసలు కొట్టింది. ఆమెనంత బాధపెట్టిన విషయమేమిటంటే... ఆరోజు నారాయణరావు స్నేహితులు వచ్చారు. అందరూ హాల్లో కూర్చుని నారాయణరావును ఆటపట్టిస్తూ గేలి చేస్తున్నారు. బెడ్‌రూంలో ఉన్న శకుంతలకు వాళ్ళ మాటల మధ్యలో తన పేరు వినపడడంతో చెవులు రిక్కించింది.

"ఏది ఏమైనా పందెం గెలిచావు కదరా! శకుంతలకు ముక్కు తాడేసి పొగరణచావు"

"ఇదిగో పందెం డబ్బు పదివేలు! అందరం చందాలేసుకు మరీ తెచ్చాం"

"మగాళ్ళను పూచికపుల్లలా తీసిపారేసే గడుసు పిండానికి ముక్కు తాడేసి మగాడి వనిపించుకున్నావు. హేట్సాఫ్ టు యూ"

"కడవంత గుమ్మడికాయ కత్తిపీటకు లోకువన్నట్టు... ఆడదెప్పుడూ మగాడి అండదండలతోనే బతకాలనీ... మగాడు లేకుంటే ఆడదానికి ఘనుగడే లేదనీ ఇప్పటికి తెలిసుంటుంది"

"ఏరా! నారాయణా! పందెం కోసం ప్రేమ నటించి మూడుముళ్ళూవేశావుగదా! మోజు తీరాక వదిలేస్తావా లేక కాపురం చేస్తూ సాధిస్తావా? "

"పోనీలేరా! ఎంత చెడ్డా పెళ్ళాం. ఇంట్లో పడుంటుంది. బయట మన తిండి మనకుండనే ఉంది"

ఇలా నారాయణరావు స్నేహితులు మాట్లాడే మాటలన్నీ శకుంతలకు చెవుల్లో సీసం పోసినట్లయింది. కోపంతో అక్కడి నుంచి వెళ్ళిపోయిన శకుంతలకు నారాయణరావు స్నేహితులను అలా తన భార్యను గురించి కామెంట్ చేయద్దనీ, మొదట్లో పందెం కోసమని నటించినా, ఆమెనిపుడు మనస్ఫూర్తిగా ప్రేమిస్తున్నానని చెప్పి వాళ్ళ నోరు మూయించడం వగైరాలన్నీ ఆమె వినలేదు. నారాయణరావు ఆమెకు బద్ధశత్రువయ్యాడు. నారాయణరావు ఎంత నచ్చచెప్పినా, అదీ ఒక నాటకమే అంది కానీ అర్థం చేసుకోలేదు. అసహ్యించుకుని పుట్టింటికెళ్ళిపోయింది.

కానీ అక్కడా ఆమెకు చుక్కే ఎదురైంది. శకుంతల తర్వాత ఇద్దరాడపిల్లలున్నారు. "ప్రేమించి పెళ్ళిచేసుకోవటమే తప్పు. పెళ్లయిన మూడు నెలలకే పుట్టిల్లు చేరితే మిగతా పిల్లల పెళ్ళిళ్లు ఎలా చేస్తాం. నా యింట్లో నీకు స్థానం లేదు. ఏ నుయ్యో, గొయ్యో చూసుకో" అంటూ తండ్రి కేకలేశాడు.

తల్లిమాత్రం శకుంతలకు నచ్చచెప్పింది. "కష్టమైనా సుఖమైనా భర్త తోడిదే కానీ ఇలా పుట్టిల్లు చేరితే అందరికీ చులకన అయిపోతావు. మగవాడన్న తర్వాత ఏవో లోటుపాట్లుంటాయి. ఆడాళ్ళం మనమే సర్దుకుపోవాలి" అంటూ నీతిశతకాల సారెతో అత్తింట్లో దింపి వెళ్ళింది.

శకుంతల మాత్రం నారాయణరావుని క్షమించలేకపోయింది. సంవత్సరం లోపలే చందూ పుట్టాడు. చందూ పుట్టాక మానసికంగానేకాక, శారీరకంగా కూడా శకుంతల ఆరోగ్యం దెబ్బతింది. ప్రతి చిన్న విషయానికీ నారాయణరావుని అనుమానించడం, పోట్లాట పెట్టుకోవడం, దెప్పి పొడవడం, ఇల్లు ఒక నరకంగా, భార్యాభర్తలిద్దరూ బద్ధశత్రువుల్లా మారిపోయారు.

నారాయణరావు ఆమెతో విసిగి వేసారి తన ఆనందంకోసం పక్కదారులు పట్టాడు.

తల్లిదండ్రుల పోట్లాటలు చందూకు ఊహ తెలిసినప్పటినుంచి అలవాటయ్యాయి. అవి అతడి మనసుమీద బాగా దెబ్బతీశాయి. ఒంటరిగా ఫీలవుతున్న సమయంలో రమతో స్నేహం కుదిరింది.

ఓ రోజు స్కూల్లో లంచ్ అవర్లో అందరూ ఓ చోట చేరి క్యారియర్లు విప్పుకు తింటున్న సమయంలో రమ చందూ పక్కన చేరి "మీదే కులం? " అనడిగింది.

చందూకు జవాబేం చెప్పాలో తెలియక "తెలియదు" అన్నాడు.

"నాకు తెలుసు" అంది రమ.

"నీకు తెలుసా? ఏమిటో చెప్పమ్మా? " అన్నాడు ఉక్రోషంగా.

"మీ నాన్నదొక కులం. మీ అమ్మదొక కులంటకదా? "

కులమంటే ఏమిటో తెలియకపోయినా కులం పేరుతో అమ్మను, నాన్నను వేరుచేసి మాట్లాడడం చూసి కోపమొచ్చింది చందూకు.

"నోరు ముయ్యి! చంపేస్తాను. నీకెవరు చెప్పారు? "

"ఇందాక టీచర్లు మాట్లాడుకుంటుంటే విన్నాను. మా అమ్మానాన్నలది కూడా ఒక కులంకాదు తెలుసా? మా అమ్మదొక కులం, నాన్నదొక కులం. ప్రేమించుకుని పెళ్ళిచేసుకున్నారుట" అంది ఆరిందాలా. ఆ పిల్ల కూడా తన తల్లిదండ్రులను వేరుచేసి మాట్లాడడంతో కాస్త కోపం తగ్గించుకుని రమతో స్నేహం చేశాడు.

తర్వాత తర్వాత చందూకి కులమంటే ఏమిటో స్పష్టంగా తెలియకపోయినా ఎవరిదే కులమో, చిన్నకులమేదో, పెద్ద కులమేదో, ఎలా ప్రేమించుకుంటారో... ఎలా పెళ్ళిచేసుకుంటారో... వగైరాలన్నీ సగానికి సగం రమ ద్వారా, మిగతా వివరాలు సినిమాల ద్వారా పదిహేనేళ్లలోపే తెలుసుకున్నాడు. ఆ టైంలోనే వీళ్ళ జట్టులో రాజేశ్వరి కూడా చేరింది. ఒకే జాతి పక్షుల్లాగా వీళ్ళు ముగ్గురూ ఓచోట చేరి కబుర్లు చెప్పుకునేవారు. ఆ పసివాళ్ళ మాటల్లో కులాలు... మతాలు... అమ్మానాన్నల పోట్లాటలు... బంధువర్గాల సూటిపోటి మాటలు... ఇరుగుపొరుగుల చిన్నచూపు... దొర్లి... వారి వయసుకు మించిన ఆలోచనలు మనసుల్లో చోటుచేసుకున్నాయి.

రమా వాళ్ళ నాన్నగారికి ట్రాన్స్‌ఫర్ కావటంతో ఊరు విడిచి వెళ్ళిపోయింది. అయినప్పటికీ ఉత్తరాల్లో విశేషాలు తెలియపరుస్తూనే ఉంది. తమ ముగ్గురి తల్లిదండ్రులు ప్రేమించి పెళ్ళిచేసుకున్నారన్నమాటే గానీ... వారు పిల్లలకు తమ ప్రేమను పూర్తిగా పంచి ఇవ్వకపోగా... పిల్లలకు సమస్యలు మాత్రం సృష్టించారు. ఒక్కొక్కరు ఒక్కో సమస్యతో బాధపడుతున్నారు.



"ఇప్పుడిక అన్ని పనులూ అయిపోయాయి కదా! నీ సీరియల్ మొదలుపెట్టకూడదా? " అంది విజయ హుషారుగా.

"ఎక్కడిదాకా చెప్పాను? " అంది రాజేశ్వరి.

"బేతాళకథలో, భోజరాజు కథలో, చెబుతున్న ఫోజూ నువ్వూ"

"ఏమిటి గొణుగుతున్నావు? "

"అబ్బే ఏంలేదు. ఇంకో కొత్త బావ నీ యిల్లు చేరాడు. బావా బావా పన్నీరు అని పాడుకున్నావా?"

"బావా బావా పన్నీరు కాదు. బావా బావా కన్నీరు అని పాడుకుంటున్నాని ప్పుడు. మా మేనత్త, చక్రవర్తి బావల రాకతో మా యింటి వాతావరణం మారిపో యింది. అంతదాకా అమ్మానాన్నల ఒడిలో అన్నయ్య, నేను ఎంతో స్వేచ్ఛగా పడుకుని కబుర్లు, పోట్లాటలు, నవ్వులు, గెంతులు వేసేవాళ్ళం. వాళ్ళ రాకతో 'కీ' ఆగిపోయి నట్టు మాకు తెలీకుండానే నిశ్శబ్దంగా మారి పోయాం. అమ్మ గొంతు పూర్తిగా మూగపో యిందనే చెప్పాలి. మా ప్రశ్నలకు... నాన్న ప్రశ్నలకు... ఆ... ఊ... తప్ప... నోరు విప్పడంలేదు. నాన్న కూడా ఏదో ఇబ్బంది ఫీలవుతున్నట్టు అర్థమయింది.

"వాళ్ళ గొడవలు వాళ్ళకున్నాయి. అది వేరే సంగతి. నాకుమాత్రం చిరాకు, అసహ్యం కలిగించే సమస్య ఎదురయింది. అస్తమానం మా మేనత్త చక్రవర్తికి నన్ను చూపించి "నీ పెళ్ళాంరా కన్నా" అనేది.

చక్రవర్తి మెలికలు తిరుగుతూ సిగ్గుపడే వాడు. అతన్ని చూస్తుంటే నాకు చీదర పుట్టేది.

"బావ నీకు కాబోయే మొగుడే రాజీ" అనేది.

నాకు వళ్ళు మండి, "అలాంటి మాటలు మాట్లాడితే ఊరుకునేదిలేదు" అంటూ గట్టిగా అరిచాను.

వెంటనే నామీద నాన్నకు ఫిర్యాదు చేసింది. నాన్న కోప్పడ్డాడు.

ఓరోజు అమ్మపక్కన చేరి "అమ్మా! అత్త య్యావాళ్ళు ఎప్పటికీ మనింట్లోనే ఉంటారా?" అనడిగాను.

"నాకు తెలియదు. మీ నాన్ననడుగు" అంది విసుగ్గా అమ్మ.

వెంటనే నాన్న దగ్గరికెళ్ళి "నాన్నా, అత్త య్యావాళ్ళు ఊరెప్పుడెళతారు" అన్నాను.

"తప్పమ్మా, అలా అడక్కూడదు. అత్తయ్య, బావ ఎప్పుడూ ఇక్కడే ఉంటారు. బావకూడా మీతోపాటు స్కూలుకొస్తాడు. అన్నయ్య, నీవు, బావ ఒక జట్టుగా ఉండి కలిసి చదువుకోవాలి. కలిసి ఆడుకోవాలి. చక్రవర్తి బావ మంచివాడు. చదువులో ఇంటిలిజెంట్. మీకిద్దరికీ తెలియనివి వాడి నడిగి చెప్పించుకుని చదువుకోండేం?" అన్నాడు నాన్న.

అత్త, బావ ఎప్పటికీ ఇక్కడే ఉండిపోతా రన్న విషయాన్ని నేను సర్దుకోలేకపో యాను. మా యింట్లో... అమ్మానాన్నల మధ్య ఉంటూ కూడా అసహనంగా ఒంట రిగా ఫీలవసాగాను. చదువుమీద ధ్యాస తప్పుతోంది.

అప్పుడప్పుడూ అమ్మా, అత్తయ్యా దేనికో ఒకదానికి వాదులాడుకునేవారు. ఓరోజు అత్తయ్య పక్క వీధిలో హరికథ వినడానికి వెళ్ళింది. అమ్మానాన్నల బెడ్‌రూంలోంచి మాటలు వినపడి చెవులు రిక్కించాను.

"మా అక్కయ్య తలచెడి ఇంటికొస్తే ఇలా గేనా ప్రవర్తించడం?" నాన్న మందలింపు ధోరణిలో మాట్లాడుతున్నాడు.

"ఇంకెలా ప్రవర్తించడం? ఆవిడ నన్ను సూటిపోటి మాటలతో ఎంత బాధ పెడు తోందో తెలుసా? మా పుట్టింటివాళ్ళననడా నికి ఈవిడెవరు? మా వాళ్ళకు తినడానికి లేదుట. తినటానికే లేనివాళ్ళు పెళ్ళేం చేస్తా మని నన్ను ఊరిమీదకు తోలారుట. నేను మిమ్మల్ని వల్లో వేసుకున్నానట. మీ కులం పిల్లను చేసుకుని ఉంటే లక్షలు, కట్నం ఇచ్చే వారుట. ఆవిడను మర్యాదగా చూసుకునేవా రట. ఆడపడుచు లాంఛనాలు ఘనంగా ముట్టేవిట. అవిప్పుడు పనికొచ్చేవిట. నా వంట నచ్చదుట, నాకు పొగరుట, ఒకటా? రెండా? ఒక్కోరోజు ఒక్కోరకంగా చిత్రహిం సలు పెడుతుంది.

"ఈవిడతోనే వేగలేక ఛస్తుంటే ఆ కుర్ర కుంకతో మరో తలనొప్పి. కంచరగాడిదలా

ఉన్నాడు. రాత్రిపూట పక్క తడుపుతాడు.
కంపు వెధవ! నిద్రలో లేచి నడిచి వెళ
తాడు. మొన్నోరోజు అర్ధరాత్రి శబ్దం
ఏమిటా అని చూద్దును కదా తలుపు గొళ్ళెం
తీసి పెరట్లోకెళ్ళి బావిలో నీళ్ళు తోడుతు
న్నాడు.

"ఏంట్రా! ఏమిటీ... ఈవేళప్పుడు నీళ్ళెం
దుకని ఎంత కుదిపి అడిగినా పలకడు. మీ
అక్కగారు వెనకే వచ్చి ఏంట్రా కన్నా నీళ్ళు
తోడుతున్నావా? అని అడిగి 'నువ్వేం అంత
కంగారు పడక్కర్లేదులేమ్మా. మా వాడికి
నిద్రలో నడిచే అలవాటుంది. పగలు చేయా
ల్సిన పని రాత్రి పూట చేయడం అలవాటు.
ఉదయం నీవు నీళ్ళు తోడమని పురమా
యించావు కదా. అదన్నమాట. ఎవరో
యోగీశ్వరులు తప్ప నిద్రలో నడవరుట.
ఒక్కడుపుట్టినా ఎంత యోగ్యుడు పుట్టాడో
చూశావా? నువ్వా కన్నావు ఎందుకు పుస్త
కాల పురుగులని' అని మూతి తిప్పి వెళ్లిపో
యింది.

"మొన్నటికి మొన్న నిద్రలో నడుస్తూ
వెళ్ళి నాలుగిళ్ళవతలనున్న ఇంటి ఓనరు
వసారాలో దోమతెర కట్టుకుని పడుకుని
ఉంటే ఆయన పక్కన ముసుగు తన్ని పడు
కుని... మళ్ళీ తెల్లవారుఝామున లేచి
వచ్చాడుట. ఇలా నాలుగురోజుల్నుంచి జరు
గుతుంటే ఆయన పెళ్ళాం గమనించి అరవై
ఏళ్ళ వయసులో అక్రమ సంబంధం పెట్టు
కున్నాడనీ, రాత్రిళ్ళు ఎవరినో రప్పించుకుం
టున్నాడనీ, తెల్లారకముందే పంపించేస్తున్నా
డనీ నానా యాగీ చేసిందిట. మరుసటి
రోజు వీడిని రెడ్ హ్యాండెడ్‌గా పట్టుకుంటే
వాళ్ళను సముదాయించడానికి మీ అక్కగా
రికి, నాకు తలప్రాణం తోకకొచ్చింది"

అమ్మ అలా ఏకధాటిగా ఒకదానివెంట
మరొకటి చక్రవర్తిని గురించి, మేనత్త
గురించి చెబుతూనే వుంది. నాన్నకు విసు
గొచ్చిందేమో.

"అయితే ఏమిటంటావు?" అన్నాడు
సంభాషణ కట్ చేస్తూ.

"ఎంత డబ్బయినా సరే ,ఖర్చుపెట్టి
వాళ్ళకో ఇల్లు చూసిపెట్టి, వేరే ఉంచండి.
నేనూ నా పిల్లలూ కాస్త గాలి పీల్చు
కుంటాం" అంది.

"ఇంకో ఇల్లంటే మాటలా? డబ్బులు
చెట్లకు కాయటంలేదు. డబ్బు సంగతెలా
వున్నా పెళ్ళాం మాటలు విని వేరే ఉంచా
డని ఆవిడ బాధపడదూ. లోకులేమనుకుం
టారు? అసలే మనం ప్రేమించి పెళ్ళి చేసు
కుని నా తరపు బంధువులకు దూరంగా
బతికాం. పిల్లలు పెద్దవాళ్ళు అవుతున్నారు.
వాళ్ళకీ పెళ్ళిళ్ళు చెయ్యాలా? ఇలా స్వంత
మనుషులనే దూరంగా ఉంచితే మనకిక
దగ్గరయ్యేదెవరు? నీ ఆలోచనలకు స్వస్తి
చెప్పి నోరు మూసుకుని పడుకో" అంటూ
కసిరాడు నాన్న.

అదంతా వింటున్న నాకు చాలా దిగులే
సింది. అయితే వీళ్ళిక ఎప్పటికీ మా
ఇంట్లోనే ఉంటారా? చక్రవర్తి మీద ఎటు
వంటి కోపం, ద్వేషంలాంటి అభిప్రాయాలు
లేకున్నా ఎందుకో అతను ఇంట్లో తిరుగు
తుంటేనే కంపరంగా ఉండేది.

మేనత్త సరేసరి, "నీ మొగుడు నీ
మొగుడు" అంటూ చక్రవర్తి ముందు నన్ను
అంటుంటే ఓపిక నశించి పోట్లాటకు దిగసా
గాను. అమ్మ నన్ను వారించకపోగా సంతో
షిస్తున్నట్టు కనిపించడంతో ఇంకా రెచ్చిపో
యేదాన్ని. విచిత్రంగా ఆవిడ నన్నేం అన
కుండా అమ్మమీద పోట్లాటకు దిగేది.

"ఏమే చిన్నపిల్లకు అయినవీ కానివీ
నేర్పించి, నామీదకు ఉసిగొలుపుతావా? నా
తమ్ముడిని, కూతురిని నాకు కాకుండా
చేస్తావా? ఏం, నీ కులంవాళ్ళకిచ్చి కట్టబెడ
దామనుకున్నావా? నా కంఠంలో ప్రాణ
ముండగా అలా జరగదు. గుర్తుంచుకో"
అంటూ రంకెలేసింది.

"నా కులం వాళ్ళతో కాకుంటే మీ లేకి
కులంలో వారికి, నా పిల్ల నిచ్చి గొంతు

కోస్తాననుకున్నావా? " అంది అమ్మ.

ఇద్దరూ హోరాహోరీగా పోట్లాడుకున్నారు. నాన్న వచ్చాక రభస ఇంకాస్త పెద్దదయింది. నాన్న అత్తయ్య పక్షం చేరిపోయాడు.

"మా కులం లేకికులం, మీది ఉన్నత కులమా? అలాంటిదానివి నన్ను పెళ్ళెందుకు చేసుకున్నావు? ప్రేమించేటప్పుడు కులం గుర్తుకురాలేదా? నా కులాన్ని, నా వాళ్లను గౌరవించడం నేర్చుకో అప్పుడే నీకీ యింట్లో స్థానం" అన్నాడు నాన్న కోపంగా.

"మిమ్మల్ని నమ్ముకుని కన్నవాళ్లని కాదని కట్టుబట్టలతో వచ్చాను. పిల్లలు పుట్టిన ఏడెనిమిదేళ్ళదాకా పుట్టింటి మొహం చూడలేదు. మీతో కష్టం సుఖం అనుభవించాను. ఎందరితో, ఎన్ని మాటలు పడ్డాను. ఎంత క్షోభ పడ్డాను. ఎవరికోసం? మీరు నా అండగా ఉంటారని కాదూ. ఈరోజు మీ అక్కగారి మాటలు విని, నన్నూ నా కులాన్నీ మా వాళ్ళని నిందిస్తే బాధ కలగదా? కోపం రాదా? " అంటూ వెక్కివెక్కి ఏడ్చింది అమ్మ.

అన్నయ్య, నేను అమ్మను కావిలించుకుని ఏడ్చాం.

"ఛీ... ఛీ... పాడుకొంప" అంటూ నాన్న బయటకెళ్లిపోయాడు.

"అమ్మా... మనమిక్కడ ఉండొద్దు. అమ్మమ్మా వాళ్ళ ఊరెళ్ళిపోదాం" అన్నాడు అన్నయ్య.

అమ్మ ఏమనుకుందో ఏమో ఉన్నపళంగా బట్టలు సూట్‌కేస్‌లో సర్ది నన్నూ, అన్నయ్యనూ తీసుకుని అమ్మమ్మగారి ఊరి బస్సెక్కింది.

సరిగ్గా వారం తర్వాత నాన్న వచ్చారు. అమ్మమ్మా, తాతయ్యా, మావయ్యలముందు అమ్మానాన్నలు పంచాయితీ పెట్టారు. విడ్డూరంగా అందరూ నాన్న పక్షం చేరిపోయారు. అమ్మకు హితబోధలూ, మందలింపులూ మిగిలాయి.

"ఆడపడుచు అంటే అర్థమొగుడంటారు. ఆవిడేదో చాదస్తం మాటలంటే వాటిని పట్టించుకుని భర్తతో ఇంత రాద్ధాంతం పనికిరాదే అమ్మడూ! సర్దుకుపోవాలి" అంది అమ్మమ్మ.

"ప్రేమా దోమా అంటూ పెద్దవాళ్ళని కాదని వెళ్ళిపోయావు కదా. ఇపుడే సమస్య వచ్చినా పరిష్కరించుకోవాలి. ఎవరు ఉమ్మేసినా ఊరుకోవాలి. మళ్ళీ మా యింటికొచ్చి పంచాయితీ పెడితే మేమేం చెయ్యగలం" అన్నాడు తాతయ్య.

నాన్నమీద, అత్తయ్యమీద కోపం వ్యక్తం చేయలేని అశక్తుల్లా అమ్మనే మందలించారందరూ.

"మా తగవు మిమ్మల్ని తీర్చమనలేదు. కాపురం చేయటం కష్టమైతే ఏ రైలుకిందో తలపెడతాను తప్ప మీ ఇంట్లో పడి తినను" అంది అమ్మ ఉక్రోషంగా.

"ఏమిటే ఆ మాటలు మీ నాన్నగారి కోపం నీకు తెలీదా? అసలు ఆయన గారి కోపమే నీకూ వారసత్వంగా వచ్చినట్లుంది. బాబూ! సంసారమన్న తర్వాత ఏవో గొడవలు వస్తుంటాయి. అవి నాలుగ్గోడలమధ్య పరిష్కరించుకోవాలి తప్ప వీధిలోకి రాకూడదు. పిల్లలు పెద్దవాళ్ళవుతున్నారు. వాళ్ళముందు మీరిలా పోట్లాడుకుంటే వాళ్ళ జీవితంమీద మీ పోట్లాట ప్రభావం పడుతుంది" అంటూ అమ్మమ్మ నచ్చచెప్పింది.

ఆ మరుసటిరోజు నాన్న మమ్మల్ని తీసుకుని వచ్చేశాడు. వచ్చేముందు మురళి వాళ్ళింటికెళ్ళాను. మురళి ఇంటర్‌లో చేరాడు. నేను టెన్త్‌లో కడుగుపెట్టాను. కాసేపు చదువులగురించి మాట్లాడుకున్నాక "మీ అమ్మానాన్నలు కూడా పోట్లాడుకుంటారా? " అనడిగాను మురళిని.

"లేదే... ఎందుకలా అడిగావ్? "

మేనత్త రాక, చక్రవర్తి నిద్రలో నడక, అమ్మానాన్నల పోట్లాట పొల్లుపోకుండా చెప్పేశాను.

"మా అమ్మానాన్న ఒక్కసారి కూడా

పోట్లాడుకోలేదు"

"అదెలా సాధ్యం? ,మీ యింటికి బంధువులెవ్వరూ రారా? "

"అదేంలేదు. అమ్మతరపు, నాన్నతరపు బంధువులందరూ వస్తుంటారు. మేమూ వెళుతుంటాం. వింత ఏమిటంటే మా యింటికి వచ్చిన బంధువులు వాళ్ళలోవాళ్ళు పోట్లాడుకుంటారే తప్ప వాళ్ళవల్ల అమ్మా నాన్న మాత్రం పోట్లాడుకోరు. అమ్మానాన్న ఎంతో అన్యోన్యంగా ఉంటారు" అని చెబుతున్న మురళిని ఆశ్చర్యంగా చూశాను.

"ఈ రోజుకిక చాల్లే రాజీ! అర్జంటు పని మీద బయటకు వెళ్లాల్సి ఉంది" అంది విజయ.

"ఏం! నా కథ బోరు కొడుతోందా? "

"అబ్బెబ్బె! అలాంటిదేంలేదు. చాలా ఇంట్రెస్టింగ్‌గా ఉంది. మిగతా కథ రాత్రికి చెబుదూగాని. అర్జంటుగా ఓ ఫ్రెండును కలవాలి... ప్లీజ్" అంటూ వెళ్లిపోతున్న విజయను అనుమానంగా చూస్తూ ఆలోచనలో పడిపోయింది రాజేశ్వరి.

★ ★ ★

"ఏమిటి అర్జంటుగా పార్కులో కలవాలని లెటరు పంపారు" పార్కులో పచ్చగడ్డిమీద కూర్చుంటూ అంది విజయ.

"హమ్మయ్య! లెటరు చేరిందికదా! మీరొచ్చేవరకు టెన్షన్ ఫీలవుతున్నానంటే నమ్మండి" అన్నాడు చందూ.

"అంత సేఫ్టీగా పనిమనిషికి లంచం ఇచ్చి మరీ పంపితే ఎందుకు చేరదు"

"ఏదిఏమైనా ఇలాంటి విషయాలకు పూర్వపు రోజులు బావుండేవి"

"అంటే?."

"పూర్వపు రోజుల్లో ప్రేమికులు ఓ పావురం కాలికి ఉత్తరం కట్టి పంపిస్తే సుబ్బరంగా మూడో కంటికి తెలియకుండా చేర్చేది. ఎంచక్కా ఆకాశంవైపు చూసుకుంటూ ప్రేమించుకునేవాళ్లు. ఇప్పుడా వసతుల్లేవు. ఆ పావురాలూ లేవు. ప్రేమికులకన్నీ ఇబ్బందులే. ప్రేమికులు కలుసుకోవటానికి హోటళ్లూ, పార్కులూ తప్ప అప్పట్లోలాగా నిర్జన ప్రదేశాలేలేవు. మనసు విప్పి మాట్లాడుకోవాలన్నా, కళ్లల్లో కళ్లు పెట్టి చూసుకోవాలన్నా కుదరటంలేదుకదా!" నిట్టూరుస్తూ అన్నాడు చందూ.

"అవుననుకోండి. ఈ రోజుల్లో ప్రేమికులకు నిర్జన ప్రదేశాలు దొరక్కుండా ఉంటేనే మంచిదేమో. అయినా ప్రేమికుల గొడవ మనకెందుగ్గానీ ఇపుడు నన్నెందుకు పిలిపించినట్టు? "

"చూడండి విజయగారూ! మరీ మీరంత సూటిగా, కటువుగా అడిగితే ఎలాగ. అయినా నాన్చటం ఎందుకు. నేను మిమ్మల్ని ప్రేమిస్తున్నాను. మీకిష్టమైతే పెళ్లి చేసుకుంటాను. తొందరేం లేదు. ఆలోచించి మీ నిర్ణయం చెప్పండి. వెళదామా? " అంటూ లేచాడు చందూ.

"ఆలోచించేదేంలేదు. ఇప్పుడే చెప్పేస్తాను. కూర్చోండి. నాకీ ప్రేమ వివాహాలమీద నమ్మకాల్లేవండీ" అంది విజయ.

"అంటే పెద్దలు కుదిర్చిన వివాహం అంటే ఇష్టమన్నమాట. ఆల్‌రైట్ పిరికివాళ్లలా చెప్పకుండా పారిపోయి పెళ్లి చేసుకోవటం లాంటి పనులు నాకూ ఇష్టముండదు. మీ పెద్ద వాళ్లను, మా పెద్దవాళ్లను కలిపి మాట్లాడి ఒప్పించి చేసుకుందాం సరేనా? "

పేలవంగా నవ్వింది విజయ. "మా వాళ్లనాకెవ్వరూలేరు... సారీ ఉండి కూడా లేని వాళ్లు"

"అదేమిటి? " ఆశ్చర్యంగా అడిగాడు చందూ.

"మా అమ్మా నాన్న విడాకులు తీసుకున్నారు" అంది.

"వ్వాట్! ఎప్పుడు? "

"ఆరు నెలల క్రితం! అందువల్లనే నేను ఇల్లు వదలివచ్చి హాస్టల్లో ఉంటూ ఉద్యోగం చేసుకుంటున్నాను"

"ఈ వయసులో విడాకులేమిటండి? కారణమేమిటి? "

"పోట్లాటకు వయసుతో నిమిత్తం లేనప్పుడు విడాకులకు కూడా వయసుతో పని లేదు. ఇక కారణమంటారా? వారి పోట్లాటకు, విడాకులకు కారణం నేనే"

"మీరా? "

"అవును! నేనే! మా అమ్మా నాన్న లవ్ మ్యారేజ్ చేసుకున్నారు. నేను పెళ్లికెదిగే వరకూ జీవితం సాఫీగానే ఉండేది. నాకు పెళ్లి చేయాలన్న ఆలోచన వచ్చాక నా పెళ్లి నాన్న బంధువుల్లో అంటే తన కులం వారితో చేయాలని నాన్న, కాదూకూడదు మా కులంలోనే, మా బంధువుల్లో వారికిచ్చి చేయాలని అమ్మ అలా పోట్లాట మొదలయి... అది విడాకుల వరకూ దారితీసింది"

"మరి మీరు? "

"నా గురించి వాళ్లు ఆలోచించలేదు. తండ్రి దగ్గర ఉండాలని, అతనే నాకు పెళ్లి చేయాలని కోర్టు ఆదేశించింది. నా మనసు తీవ్రంగా దెబ్బతింది. ఎవరి దగ్గరా ఉండకుండా నేను బయటకొచ్చి వారికి శిక్ష విధించానని అనుకుంటున్నాను"

"ఇంతకీ మీరు ఎవరి బంధువుల్లో వారిని పెళ్లి చేసుకోవాలనుకున్నారు? " ప్రశ్నించాడు చందూ.

"పెళ్లి చేసుకోవాలనుకున్నాను అంతే! ఎవరి బంధువులు? ఏ కులం? అన్న ఆలోచనలే నాకు రాలేదు. చిన్నప్పటినుంచి నన్ను యువరాణిలా పెంచి నా పెళ్లి దగ్గర కొచ్చేసరికి నా గురించి, నా మనసు గురించి ఆలోచించకుండా వారి వారి పంతాలకే ప్రాధాన్యం ఇచ్చుకుని విడిపోయారు. ఒకప్పుడు అమ్మకోసం, ఆమె ప్రేమకోసం నాన్న స్లీపింగ్‌పిల్స్ మింగి ప్రాణం మీదికి తెచ్చుకున్నాడట. నాన్నకోసం అమ్మ కట్టుబట్టల్తో కన్నవారిని కాదని బయటకొచ్చిందిట. అలాంటి అమర ప్రేమికులు నా పెళ్లి దగ్గరకొచ్చేసరికి కులాలు గుర్తు వచ్చి పోట్లాట. నాన్న ఏమంటాడో తెలుసా? 'నీ బంధువుల్లో చేస్తే కులం చెడుతుంది. వంశం పేరు చెడుతుంది. నా కులంలో చేస్తే సక్రమంగా ఉంటుంది' అంటాడు"

"ఇన్నేళ్లు కాపురం చేసి ఇపుడు నా కులానికి పేరు పెడుతున్నారా? నా కడుపులో పెరిగి, నా రక్తం పంచుకుని పుట్టాక అది నీ కులానికే చెందినదెలా అవుతుంది" అంటూ అమ్మ రంకెలు వేస్తుంది.

"నాకు వారిద్దరి మీదేకాకుండా ప్రేమ వివాహాలు, అసలు వివాహాలమీదే విరక్తి పుట్టి ఇల్లు వదలి వచ్చేశాను. పిల్లల పట్ల, వారి మనసులపట్ల కనీస బాధ్యత లేనివారిని నేను క్షమించలేకపోతున్నాను. నాకు పెళ్లి చేసుకోవాలని లేదు. ఓ ఫ్రెండుగా మిమ్మల్ని అభిమానిస్తాను. గౌరవిస్తాను. ప్రేమాదోమా, పెళ్లి ఇవేవీ మన మధ్యవద్దు ప్లీజ్" అంది విజయ.

"ఓకే ఓకే... మిమ్మల్ని ఇబ్బంది పెట్టను. ప్రేమికుడిగా మీ మనసులో చోటు లేదన్నారు. ఫ్రెండుగా అభిమానిస్తానన్నారు. అది చాలు. మీరు, నేను, రాజీ, రమ ఒకే రకం బాధితులం. ఇలాంటి మనలాంటి బాధితులింకా ఎందరున్నారో" నిట్టూరుస్తూ లేచి నిలబడ్డాడు చందూ.

★ ★ ★

"ప్రియమైన రాజీకి రమ రాయు ఉత్తరం,

"నీ ఉత్తరం చేరి విశేషాలు తెలిశాయి. రాజీ! ఈమధ్య మా ఇంట్లో ఓ విశేషం జరిగింది. విశేషం కాదు, అద్భుతం జరిగింది. ఇలాంటి అద్భుతం జరుగుతుందని ఊహించలేదు. నేను కూడా మీ హాస్టల్ ఫ్రెండు విజయలాగా తల్లిదండ్రులను వదిలి పారిపోయి వచ్చే పరిస్థితి ఏర్పడుతుందనుకున్నాను. కానీ విచిత్రంగా అమ్మానాన్న రాజీపడ్డారు. అమ్మ కులంలోనూ, నాన్న కులంలోనూ రెండు వైపులా నాకు వరుడిని వెతు

కుతారుట. ఎవరో ఒకర్ని నేనే సెలక్టు చేసుకోవాలిట. ఇదీ పరిస్థితి. నాకు ఎన్నేళ్లకు పెళ్లి అయినా ఫర్వాలేదు. నా ప్రాణానికిపుడు హాయిగా ఉంది. ఎందుకంటే ఇంట్లో పోట్లాటలులేవు. వాతావరణం తేలిగ్గా, ఆహ్లాదకరంగా ఉంది.' హమ్మయ్య అనుకున్నాను. నాన్న తరపు బంధువుల్లో ఓ అబ్బాయితో నిన్న పెళ్లిచూపులు జరిగాయి. మొట్టమొదటి పెళ్లిచూపులుకదా. బిడియంగా అనిపించింది. అమ్మ ఒకటే హడావిడి. ఉదయంనించి ఇల్లంతా సర్దినవే సర్దుతూ హైరాన పడిపోయింది. పిండివంటలు చేసి రెడీగా పెట్టింది. చిన్న అలికిడైతే చాలు వీధిలోకి వెళ్లి తొంగి చూసేది. ఆమె ఆత్రుత చూసి నాకు నవ్వొచ్చింది. "ఎందుకమ్మా అంత టెన్షన్ ఫీలవుతున్నావు. నేనేం ముసలిదాన్నయ్యానా! వీళ్లు కాకుంటే మరొకళ్లు. పెళ్లికాకుండా ఉండిపోతానా? " అన్నాను మందలింపు ధోరణిలో.

"ఈ పెళ్లిచూపులు, ఈ తతంగాలు అన్నీ నీకెలా కొత్తగా ఉన్నాయో నాకూ కొత్తగానే ఉన్నాయి రమా! ప్రేమించుకుని పెళ్లి చేసుకున్నాం కాబట్టి ఈ బాధలేవీ నాకు తెలీవు. నీవు మగపిల్లాడివై ఉంటే నాకే బాధా ఉండేదికాదు. ఇన్నేళ్లూ మేం బంధువుల్లో కలవలేదు. కలవాలని వెళ్లినా ప్రశ్నార్థకపు చూపులతో కొందరు, ప్రశ్నలతో కొందరు వేధించేవారు. దాంతో విసుగొచ్చి అందరికీ దూరంగా ఉంటూ కేవలం స్నేహితులతో మాత్రమే సంబంధ బాంధవ్యాలు పెంచుకున్నాం. ఇప్పుడు నీవు పెళ్లీడుకొచ్చాక నాకన్నీ పరిస్థితులు, మనుషులు... మనస్తత్వాలు అర్థమైనాయి. మీ నాన్న తరపు బంధువుల్లో నీకు తగిన సంబంధాలు చాలా తక్కువగా ఉన్నాయి. ఈ సంబంధం కుదరాలని వేయిదేవుళ్లకు మొక్కుకుంటున్నాను. ఈ సంబంధం కుదిరితే మీ నాన్నకూ నాకూ మనస్పర్థలు రాకుండా ఉంటాయి"

అమ్మ మాటల్లో నీకీ సంబంధం నచ్చకపోయినా నాకోసం ఒప్పుకో అన్న భావం వ్యక్తమయింది.

అమ్మా నాన్నలిద్దరూ పోట్లాటమాని రాజీ పడింది దేనిగురించో నాకయితే అర్థంకాలేదు. పెళ్లిచూపులు జరిగాయి. అబ్బాయి ఫరవాలేదనిపించేలా ఉన్నాడు. ఉద్యోగం, స్వంత ఇల్లు... బాగాలేదని చెప్పటానికేకారణమూ కనిపించలేదు. అబ్బాయి మేనత్తగారు ఉన్నట్టుండి ఓ ప్రశ్నవేశారు. "అమ్మాయికి మన కులం, సంప్రదాయాలు నేర్పించారా? నీ పెళ్లాం కుల సాంప్రదాయాలు నేర్పించారా" అంటూ అదేదో జోకేసినట్లు ఫీలయిపోయి ఫక్కున నవ్వింది.

"అబ్బెబ్బె! అన్నీ మన కులాచారాలే సుమా! దాని కులాచారాలు నా కూతురికి నేర్పిస్తే నేనూరుకుంటానేంటి"

నాన్న అహంకారపు మాటలు వింటూంటే నాకే బాధ, అసహ్యం, కోపం కలుగుతోంది. అమ్మ ఎలా తట్టుకుంటుందో అనుకున్నాను.

నాన్న అలా మాట్లాడటంతో ఆవిడ శివమెత్తిన దానిలా అమ్మ కులంలోని లోపాలు, వాళ్ల ఆచారాలకు తమ ఆచారాలకు ఉన్న తేడాలు తీవ్రంగా విమర్శిస్తూ ఓ అరగంట క్లాసు తీసుకుంది. నేను అమ్మవైపు చూశాను. నెమ్మదిగా కన్నీళ్లు తుడుచుకుంటోంది. పెళ్లికొడుకు, అతని తల్లిదండ్రులు ఆమె ఇస్తున్న లెక్చర్‌ను ఎంతో ఆసక్తిగా వింటున్నారు.

చివర్లో "అమ్మాయి మాకు నచ్చింది. లగ్నాలు ఎప్పుడు పెట్టుకుందాం" అన్నాడు అబ్బాయి తండ్రి.

"ఉండరా అన్నయ్యా! నీకన్నీ తొందరే! అమ్మాయితో నేను పర్సనల్‌గా మాట్లాడాలి" అందామె.

"అలాగా! అభ్యంతరమేముంది. రమా! వెళ్లమ్మా! పెద్దమ్మని తీసుకుని బెడ్‌రూంకెళ్లు" అన్నారు నాన్న. అమ్మవైపు ప్రశ్నార్థకంగా చూశాను.

వెళ్లమన్నట్టు కళ్లతోనే జవాబిచ్చింది

అమ్మ.

'ఏమిటి? ఈవిడ నన్ను ప్రశ్నించేది? అదేదో సినిమాలోలాగా, శరీరంమీది పుట్టు మచ్చలు చూడాలంటూ నగ్నంగా తయారు చేయదుకదా' మనసులో అనుకుంటూ బెడ్ రూంలోకెళ్లాను.

తలుపు గడియ వేసిందామె. నాకు చాలా చిరాకేసింది. "ఏంమాట్లాడాలి? " అన్నాను ఏ సంబోధనా లేకుండా. ఆవిడంటే మంచి అభిప్రాయంపోయింది సరిగదా గొంతు పిసి కేద్దామన్నంత కోపంగా కూడా ఉంది.

ఆవిడ నావేపు చూసి వెకిలిగా నవ్వుతూ "అబ్బే! ఏంలేదమ్మాయ్! ఇంతకుముందు నీవు ఎవరినైనా ప్రేమించావా? " అంది.

స్టన్నయ్యాను. నేను ఊహించని ప్రశ్న అది.

"లేదు! ఎందుకలా అడుగుతున్నారు? మీకా అనుమానం ఎందుకొచ్చింది? " అన్నాను.

"మీ అమ్మా నాన్నలిద్దరిదీ ఒకే కులం అయ్యుంటే అనుమానం రాకపోను. మీ అమ్మ ప్రేమించానంటూ మీ నాన్నను లేపు కువచ్చి పెళ్లి చేసుకుందికదా, చిన్నజాతి కులం బుద్ధి పోనిచ్చుకుందికాదు. ఎలాగైనా ఆ తల్లి కడుపున పుట్టినదానివేకదా! ఆ తాలూకు వాసన నీకూ ఉందేమోనని. మీ అమ్మలాగా నీవూ ఎవరినైనా ప్రేమించావే మోనని. అదీగాక మీ అమ్మ నీకు నూరి పోసే ఉంటుంది. 'ఇలా ప్రేమించి పెళ్లి చేసుకున్న వాళ్ళ పిల్లలకు పెళ్లికావటం కష్టం. నాలాగే ఎవరినైనా వల్లో వేసుకుని పెళ్లాడు' అని. అవునా! నిజం చెప్పు" అంది గారపళ్లు బయటపెట్టి ఇకిలిస్తూ.

నాకు కోపంతో ఆపాదమస్తకం కంపించి పోయింది. "అవును! ప్రేమించాను. ఊరికే ప్రేమకాదు. మొన్నోసారి అబార్షన్ కూడా చేయించుకున్నాను. మానాన్న మీకు కుక్క లకు మాంసం విసిరినట్టు, రెండు లక్షలు మొహానపారేస్తున్నారుకదా! నోరు మూసు కుని పడుంటారుకదాని ధైర్యంగా ఉన్నాను. చాలా? ఇంకా వివరాలు కావాలా? " అన్నాను నిర్లక్ష్యంగా.

"అమ్మో! హమ్మో!" అంటూ గావుకేకలు వేస్తూ బయటకు పరిగెత్తి వెళ్లి నేనన్న మాటలన్నీ చెప్పేసింది. పది నిమిషాల్లో హాలు ఖాళీ అయింది. నాన్న నన్ను కోప్ప డ్డారు. నేను నాన్నతో బాగా పోట్లాడాను.

"అసలేమిటి మీ ఉద్దేశ్యం? నా తరపు బంధువులు, నీ తరపు బంధువులు అంటూ మీ ఇద్దరూ నన్ను ఫుట్‌బాల్ ఆడాలనుకుం టున్నారా? ఇంతవరకు మీ బంధువుల్ని ఎపుడూ చూడలేదు. ఇంత సంస్కారహీను లనుకోలేదు. అసలు మిమ్మల్ని చూస్తే చాలదూ. మీ బంధువులదాకా ఎందుకు? ఛీఛీ!" అంటూ ఛీత్కరించి మాట్లాడాను.

అంత ధైర్యం ఎలా వచ్చిందో నాకే అర్థం కాలేదు. నామాటలకు జవాబివ్వకుండా అలా నిల్చుండిపోయాడు.

కొద్దిసేపటి తర్వాత "నా కూతురిని నాకు కాకుండా చేస్తున్నావా? దానికి నూరిపోసి నా మీదకు, నా వాళ్లమీదకు ఉసికొల్పు తావా? " అంటూ బండబూతులు తిట్టి దబ దబమని అమ్మను గొడ్డును బాదినట్టు బాది కసి తీర్చుకున్నాడు.

"రాజీ! ఆ ఇల్లు ఒక నరకంగా ఉంద నుకో! ఇహ ఆ ఇంట్లో ఉండాలనిపించక దగ్గర్లో ఉన్న ఓ కాన్వెంటులో టీచరు ఉద్యోగం సంపాదించాను. ఉదయంనించి సాయంత్రందాకా చిన్న పిల్లల మధ్య గడిపి రావటంతో ఇంట్లో గొడవలు వినపడటం లేదు. కానీ రోజూ నా పెళ్లి గురించి అమ్మా నాన్నా ఘర్షణ పడుతున్నారని మాత్రం వారి మొహాలు చూస్తేనే తెలుస్తోంది. అమ్మను చూస్తే నాకు జాలిగా ఉంది. కానీ నేనేం చెయ్యగలను? ఎవరి ఖర్మకు ఎవరు బాధ్యులు అని వేదాంత ధోరణిలో అనుకుని వదిలేశాను.

"ఇదీ నా పరిస్థితి. చందూ బాగున్నాడా?

ఏదైనా ఉద్యోగంలో స్థిరపడ్డాడా? విశేషాలతో ఉత్తరం రాయి. నీ స్నేహితురాలు... రమ!"

★ ★ ★

"వినేవాడికి చెప్పేవాడు లోకువ అన్నట్టు నీవు నన్నూ నా జీవిత చరిత్రను చాలా అవమానపరుస్తున్నావు సుమా!" అంది రాజేశ్వరి విజయతో చిరుకోపంగా.

"అయ్యో రామా! నేనేమన్నాను తల్లీ! ఏమని అవమానించానేమిటి?" అంది విజయ కంగారు నటిస్తూ.

"ఇంకా ఏమైనా అందామని కూడా అనుకుంటున్నావా? మొన్న కథ మధ్యలో పనుందంటూ హడావిడిగా వెళ్లావు గుర్తుందా? ఎవరిని అంత అర్జంటుగా కలుసుకునేది. ఆ చందూగాడేనా?"

"ఛీఛీ! అంత అసభ్యంగా మాట్లాడతావేమిటి? అతడు నా ఫ్రెండు! చిన్ననాటి స్నేహితుడు. ఒక కంచంలో తిని, ఒక స్కూల్లో చదివి, ఒక గ్రౌండులో ఆడామంటూ బోలెడు ఫ్లాష్‌బ్యాక్‌లు చెప్పి మళ్లీ ఇలా కుళ్లుకుంటావేమిటి?"

"ఏమిటి మిమ్మల్ని చూసి నేను కుళ్లుకునేది. నీ మేలు కోరి చెబుతున్నాను. అతడితో స్నేహం మానెయ్యి. ఆ చందూ దమ్మిడీకి కూడా పనికిరాడు. ఖర్మ చాలక అతని వల్లో పడి పెళ్లయిందా? ఇంతే సంగతులు!"

"నా మేలుకోరే సంగతలా ఉంచు అతనికేమయింది. మంచి వాడుకదా! ఏమైనా దుర్వ్యసనాలున్నాయా?" ఆసక్తిగా అడిగింది విజయ.

"సిగరెట్టు, మద్యంలాంటి వాటి జోలికెళ్లడు. కనీసం హోటలు తిండి కూడా తినడు, ఎవరైనా తినిపిస్తే తప్ప! టిఫిన్ కూడా చద్దన్నం ఉల్లిపాయముక్కతో తిని అడ్జెస్టయిపోతాడు. ఉన్న వ్యసనమంతా ఒక్కటే. ఉద్యోగం చెయ్యకపోవటం"

"పాపం! అతను మాత్రం ఏం చేస్తాడు. యం.ఏ. చదివాడు ఉద్యోగం రాలేదు. అది అతని తప్పా?"

"ఉద్యోగం ఇతన్ని వెతుక్కుంటూ రావటానికి ఇతనేమైనా ప్రధానమంత్రి కొడుకా? ఇతనే వీధులు తిరిగి ఉద్యోగం వెతుక్కోవాలిగాని. గవర్నమెంటు ఉద్యోగం కావాలట. లంచాలకు డబ్బివ్వనంటాడు వాళ్ల నాన్న. ఏదైనా ప్రయివేటు కంపెనీలో ఉద్యోగం చేయవచ్చుకదా! చేయడు. బిజినెస్సు మాటంటే పడదు. వాళ్లింట్లో రోజూ పోట్లాటే! మధ్యలో పెళ్లి గొడవ ఒకటి. కట్నమొస్తే ఆ కట్నం ఉద్యోగానికి లంచంగా వాడుకోవచ్చుననుకుంటే అదీ బ్రేక్! ఇంత సోదివద్దుకానీ నీవు అతన్ని ప్రేమించి ఉంటే లేదా ప్రేమించాలనుకుంటే మాత్రం ముందు గవర్నమెంటుద్యోగం గురించి కలలు కనటం మానిపించు. అదిచేస్తే నీ జన్మ, అతని జన్మ సార్థకమైనట్టే" అంది రాజి.

"నాకతని గూర్చి, అతని ప్రేమ గూర్చి పెద్ద అయిడియాలేదు. అతనే అస్తమానం నాతో మాటలు కలపాలని చూస్తుంటాడు"

"అలాగా! మనసులో అయిడియా ప్రకారం పుట్టేది ప్రేమకాదు. చందూని చూడగానే నీ మొహం ఎలా వెలిగిపోతుందో గమనించలేదనుకున్నావా?" అంది కొంటెగా రాజి.

"పెద్ద కనుక్కున్నావులే. కొలంబస్ పోజూ నువ్వూ. మన పెద్దవాళ్ళు ప్రేమించి పెళ్ళిచేసుకుని, అఘోరించి మనల్ని వీధుల పాలు చేశారుకదా. తెలిసి తెలిసి మళ్ళీ పాత కథే ఎందుకు?" అంది విజయ.

"మన అమ్మానాన్నల తరం పెళ్ళి వేరు. ఈ తరం ప్రేమ పెళ్ళిళ్ళు వేరు"

"ఏమిటో ఆ వేరు. భూమి గుండ్రంగా ఉండునన్నట్టు అటు తిరిగి ఇటు తిరిగి మళ్ళీ అదే ఊబి. మళ్ళీ అదే సమస్యలు. మళ్ళీ గొడవలు, ఇరవై ఏళ్ళ తర్వాత నీవైపు వాళ్ళు, నా వైపువాళ్ళు నీ కులం, నా కులం, అంటూ గుర్తుకు తెచ్చుకుని తీరిగ్గా

పోట్లాట... విడాకులు అంతేగా" విసుగ్గా అంది విజయ.

"అమ్మానాన్నల తరంలో ప్రేమ విషయంలో పెళ్ళి విషయంలో పెళ్ళయ్యాక పద్ధతులైతేనేమి, ఆచారాలైతేనేమి... అన్ని విషయాల్లో పురుషాహంకారమే జయిస్తూ వచ్చింది. అయినా అప్పటివారు కూడా అందరూ ఒకలాలేరు. అర్థం చేసుకుని, సవ్యంగా కాపురాలు చేసి పిల్లల భవిష్యత్తును తీర్చిదిద్దినవారూ ఉన్నారు. ఈ తరం అమ్మాయిలు మానసికంగా చిన్న వయసులోనే పరిణితి చెందుతున్నారు. ఆలోచించి ముందడుగు వేస్తున్నారు. ప్రేమలో... కానీ, పెళ్ళి విషయంలో కానీ అమ్మాయిల మాట ప్రకారమే జరుగుతోంది" అంది రాజి.

"ఈ ప్రేమ, దోమలమీద నాకాట్టే నమ్మకంలేదుగానీ, నీ సీరియల్ మొదలుపెట్టు" అంది విజయ.

"సరే! నా వయసు అప్పుడు పదహారు. వయసు ప్రభావం కావచ్చు, మురళి వ్యక్తిత్వం నాకు నచ్చటం కావచ్చు ఏదిఏమైనా మురళి నా మనసును ఆకట్టుకున్నాడు. నేను ఇంటర్‌లో చేరాను. మురళి డిగ్రీలో చేరాడు. సెలవులు రావటం ఆలస్యం, అమ్మమ్మగారి ఊరువెళ్ళే మాకు మా మేనత్త బ్రేక్ వేసింది.

"అదేంట్రా తమ్ముడూ! ఎదిగినపిల్లను తీసుకుని అలా ఊర్లు తిరగడమేమిటి? నీ పెళ్ళానికి బాగా అలుసిస్తున్నావు సుమా! ఇలాగయితే నీ పెళ్ళాం తరపు బంధువుల్లో వారికే పిల్లను కట్టబెడుతుంది. అపుడు మనమూ మన కులమూ గంగలో కలుస్తాయి. రాజ్యమంతా వాళ్ళదే అవుతుంది. అదీగాక నీ పెళ్ళాం అన్నకొడుకు... అదేరా... వాడూ రెండు కులాలకు చెందినవాడేనటగా... వాడితో నీ కూతురు చనువుగా తిరుగుతుందిటగా... ఆరాతీశానులే" అంటూ ఏమాత్రం జంకులేకుండా అమ్మ ముందరా నా ముందరా నిల్చుని మరీ నాన్నకు నూరిపోసింది.

అంతే... నాన్న మమ్మల్ని అమ్మమ్మగారి ఊరెళ్ళడానికి వీల్లేదంటూ ఆంక్షలు పెట్టాడు. ఎంత కఠినంగా పెట్టాడంటే తాతయ్య అవసానదశలో కూడా కబురొస్తే పంపలేదు. చనిపోయాడని తెలిశాక అమ్మ ఏడ్చి మొత్తుకుంటే అప్పుడు పంపాడు. తాతయ్య అంత్యక్రియలకు మురళి కూడా వాళ్ళ అమ్మానాన్నలతో వచ్చాడు.

తిరిగి వచ్చేటప్పుడు మురళి చెప్పాడు, "మా నాన్నకు మీ ఊరే ట్రాన్స్‌ఫరయిందం"టూ.

నాకు చాలా సంతోషమనిపించింది. మా కాలేజీ అడ్రసు, ఇంటి అడ్రసు, కాలేజీ టైమింగ్స్, ట్యూషన్ టైమింగ్స్ అన్నీ ఇచ్చి రాగానే కలుసుకోమని చెప్పాను. మరో నెలకు మురళీవాళ్ళు మా ఊరొచ్చారు. మా యింటికి రాలేదు సరికదా మా యింటికి మూడు నాలుగు కిలోమీటర్ల దూరంలో ఇల్లు అద్దెకు తీసుకున్నారు.

మురళి నన్ను కాలేజీ దగ్గర కలుసుకున్నాడు. ఎన్నో కబుర్లు చెప్పుకున్నాం.

"మీరు మా యింటికి రానేలేదు" అన్నాను నిష్టూరంగా మురళితో.

"నాకు రావాలనే ఉంది. అమ్మ కూడా నాన్నను అడిగింది. మీ చెల్లిగారింటికెళ్ళొద్దాం. మనకు మాత్రం ఈ వూళ్ళో తెలిసిన వారెవరున్నారు. వెళుతూ వస్తూ ఉంటే సంబంధ బాంధవ్యాలు గట్టిపడతాయి అంది.

అందుకు మా నాన్నగారు "ఇప్పుడప్పుడే వద్దులే మా బావగారికి మనం వెళ్ళడం ఇష్టం ఉండదు. వాళ్ళక్కగారు ఉందాయె ఆవిడ చాలా మొరటు మనిషట. ఆవిడ నిన్నేమయినా చులకనగా మాట్లాడితే బాధపడాలి. కోపంతో మాటామాటా అనుకుంటే నష్టపోయేది మా చెల్లెలే. వాళ్ళ మానాన వాళ్ళు, మన మానాన మనమూ ఉందాం. ఒరేయ్ మురళీ! అత్తయ్య, మామయ్య

అంటూ ఆ ఛాయలకు వెళ్ళేవు సుమా! అంటూ నన్ను హెచ్చరించారు. అయినా నిన్ను చూడాలనిపించి ఇంట్లో చెప్పకుండా వచ్చాను" అన్నాడు మురళి.

"అయ్యో! అయితే మీ యింటికి నన్ను తీసికెళ్ళవా? " అన్నాను బాధగా!

"ఏమిటంత బేలగా మాట్లాడతావు. మా యింటికి నేను తీసుకెళ్ళాలా? నీవు రాలేవా? మనసుంటే మార్గముండదా? మీ నాన్నగారు క్యాంపుకెళ్ళినప్పుడు అత్తయ్యా, నీవూ వచ్చెయ్యండి" అన్నాడు చిరుకోపంగా మురళి.

"అలాగేలే వెళ్ళొస్తా" అంటూ ఇంటిదారి పట్టాను.

"ఏయ్ రాజీ, ఆగు, నేను నీకు బావను. ఇకనుంచి నన్ను బావా అని సంబోధించి మాట్లాడాలి తెలిసిందా? " అన్నాడు మురళి.

"ఛీ... నేనలా పిలవను. బావ అని పిలవాలంటేనే అసహ్యం నాకు. పేరుపెట్టి పిలుస్తాను. ఇష్టమైతే జట్టుకట్టు. లేకుంటే పచ్చి పెట్టు"

"కాలేజీలో చేరావు. ఇంకా చిన్నపిల్లలాగా జట్టు, పచ్చి ఏమిటి? " అంటూ చెవి మెలి పెట్టాడు మురళి.

ఆ రాత్రి అమ్మపక్కన పడుకుని మురళీ వాళ్ళు ఈ ఊరు రావటం, మురళి కాలేజీదగ్గర నన్ను కలుసుకుని మాట్లాడడం, మొత్తం చెప్పేశాను.

"అమ్మా, మామయ్యా వాళ్ళింటికొకసారి వెడదామే? " అనడిగాను.

"చూద్దాంలే" అంది కన్నీళ్ళు తుడుచుకుంటూ అమ్మ.

★ ★ ★

ఆ తర్వాత ఓరోజు నాన్న ఊళ్ళోలేని సమయంలో అమ్మ, అన్నయ్య, నేను సినిమాకెళుతున్నామని మేనత్తకు అబద్ధం చెప్పి మామయ్యగారింటికి వెళ్ళాం. మా మేనత్త సినిమాలు చూడదు. కొడుకుని కూడా మాతో పంపదు. సినిమాలు చూసేవారంతా పతివ్రతలు, పవిత్రులు కారని ఆవిడ అభిప్రాయం.

అత్తయ్యా, మామయ్య మమ్మల్ని చూసి చాలా సంతోషించారు. అన్నయ్యా, నేను, మురళి కలిసి ఎన్నో కబుర్లు చెప్పుకున్నాం. ఆ రోజంతా చాలా సంతోషంగా గడిచిపోయింది.

ఆ తర్వాత నాన్న ఊళ్ళో లేనప్పుడు చాలాసార్లు మురళీ వాళ్ళింటికెళ్ళి వచ్చేవాళ్లం.

రోజులు సాఫీగానే గడిచిపోసాగాయి. మురళి పి. హెచ్. డి. లో చేరాడు. నేను డిగ్రీ చదువుతున్నాను. చక్రవర్తి డిగ్రీ ఫెయిలయ్యాడు.

" ఈ సంవత్సరం డిగ్రీ పాసయ్యుంటే ఆఫీసరుద్యోగం వచ్చేది. పెళ్ళి చేద్దును కదురా వెధవాయ్" అంటూ చక్రవర్తిని తిట్టిపోసింది మేనత్త.

ఈ మూడేళ్ళలో నాన్న ఇల్లు కట్టించాడు. అమ్మ, అత్తయ్యల పోట్లాట ధాటికి తట్టుకోలేక అదేవీధిలో తల్లీకొడుకులకు ఓ రెండుగదుల ఇల్లు కట్టించి అత్తయ్యను, చక్రవర్తిని అందులోకి మార్పించాడు. నెలనెలా జీతభత్యాలు ఇస్తూ చక్రవర్తిని తన ఖర్చుతోనే చదివిస్తున్నాడు నాన్న.

మేనత్త బాధ తగ్గిందనుకుంటే నానమ్మ మా యిల్లు చేరింది. చాలా ముసలావిడ అయ్యింది. ఈ వయసులో కూతుళ్ళ దగ్గర ఉండి పుటుక్కున హరీమంటే అరిష్టం. ఆ పోయేదేదో కొడుకు దగ్గర పోయి తలకొరివి పెట్టించుకుంటే పరలోకంలో నిశ్చింతగా ఉండవచ్చు. పుణ్యమూ, పురుషార్థమూ అంటూ కూతుళ్ళు సాగనంపారు.

అమ్మ మాత్రం... "ఇన్నేళ్ళూ కులాంతర వివాహం, కులభ్రష్టుడు అంటూ తిట్టిపోశారు. ఇపుడు తల కొరివి పెట్టించుకోవడానికి కులభ్రష్టుడు కావల్సివచ్చిందా... ఆవిడ కాలు, చెయ్యి బాగున్నన్నాళ్ళు పనులు చేయించుకుని, పిల్లలకు చాకిరీ చేయించు

కుని ఆవిడ కొచ్చే పెన్షను మింగారు. ఇపుడు మూలబడ్డాక ముసలిదాని చాకిరీ చెయ్యలేక మామీదకు తోలారు" అంటూ నానమ్మ ముందు సణిగింది.

అత్తయ్య ముందు "మీ అమ్మపట్ల కూతుళ్ళ నిర్వాకం... ప్రేమలు ఎలా వెలిగిపోతున్నాయో చూడు" అంటూ ఎకసక్కెంగా మాట్లాడి పోట్లాట పెట్టుకుంది.

వాళ్ళిలా పోట్లాడుకున్నా నాకు, అన్నయ్యకూ మాత్రం నానమ్మ రాక ఓ కొత్తరకమైన సంతోషాన్నిచ్చింది. సహజంగా పిల్లలకు అమ్మానాన్నలకంటే, అమ్మమ్మానానమ్మల మీది ప్రేమ ఎక్కువ ఉండచ్చు డబ్బై ఏళ్ళ నానమ్మ మాకు చిన్నపిల్లలా అనిపించి కొద్దిరోజులు ఆవిడతో సంతోషంగా గడిపాం. ఆ ఆనందం మాకు కొద్దిరోజులు కూడా నిలవలేదు. నానమ్మ మేనత్త ఇంటికి వెళ్ళి వస్తూ ఆవిడ చెప్పుడు మాటలు విని, అమ్మను మెల్లిమెల్లిగా దెప్పటం, సాధించడం మొదలుపెట్టింది. మళ్ళీ పోట్లాట మొదలు. ఈ పోట్లాటలు, కులాల గురించి వాదనలు, కించపరచుకోడాలు, ఏడుపులు, నిశ్శబ్దం... ఇవన్నీ మా జీవితంలో ఓ భాగమైపోయి... మనసు సున్నితత్వం చాలా చిన్నతనంలోనే కోల్పోయింది. నా స్నేహితులుకానీ, మురళి కానీ, వాళ్ళ అమ్మానాన్నలు పోట్లాడుకోరని చెబుతుంటే, అసలు పోట్లాట లేకుండా అంత నిశ్శబ్దంగా కూడా బతుకుతారా అని ఆశ్చర్యంగా ఉండేది. వాళ్ళను చూస్తే ఈర్ష్యగా కూడా ఉండేది. నా మనోభావాలన్నీ చిన్నప్పటినుంచీ మురళితో పంచుకోవడం వల్లనో, అతని స్నేహంవల్లనో, ఏది ఏమైనా మేమిద్దరం ఒకరినొకరం బాగా ఇష్టపడ్డాం. ఒక్కరోజు కూడా కలుసుకోకుండా, ఉండేవాళ్ళం కాదు.

ఓరోజు మురళి, నేను గుడికెళ్ళాం. పూజ ముగించుకుని వచ్చి గుడిమెట్లమీద కూర్చుని కొబ్బరికాయ పగులగొట్టుకుని తింటూ కబుర్లు చెప్పుకుంటున్నాం.

ఆరోజు మా మేనత్త కూడా గుడికి వచ్చి మమ్మల్ని చూసింది. దాంతో దాదాపు నాలుగేళ్ళుగా కుటుంబసభ్యులకు తెలియకుండా సాగించిన మా ప్రేమాయణం కాస్తా బట్టబయలయింది.

మేనత్త మా యింటికొచ్చి నాన్నముందు గగ్గోలు పెట్టింది.

"ఏరా, కులం తక్కువదాన్ని చేసుకున్నా నాకు నీమీద ప్రేమ తగ్గలేదు. నిన్నెంతో అభిమానించాను. నీ కూతురిని నా కొడుక్కి చేసుకుందామని ధారాళంగా పెద్దమనసుతో అనుకున్నాను. నీ పాడుబుద్ధి నాకిపుడు అర్థమౌతోంది. నన్నింట్లోంచి పక్కకు పంపించి, దాని కులంలో వాళ్ళకే ఇచ్చి చేద్దామనుకున్నావు కదూ" అంటూ ఏడుస్తూ గోలగోల చేసింది.

"ఏమిటక్కా నీ గోల? దాని బంధువులన్నా, దాని కులమన్నా నాకు సరిపోదని తెలిసి కూడా ఈ దెప్పి పొడుపులేంటి? " విసుగ్గా అన్నాడు నాన్న.

"నా అరుపులు దెప్పి పొడుపులా ఉందేం! నీ కూతురు, ఆ మురళిగాడు చెట్టాపట్టాలేసుకుని బరితెగించి తిరుగుతుంటే, ఊరు ఊరంతా ముక్కున వేలేసుకుంటున్నారు వెళ్ళి చూడు. దేశమందరికీ తెలిసిన విషయం నీకు తెలీదంటే నమ్మాలా? లోలోపల నీవూ నీ పెళ్ళాం ఆడిస్తున్న నాటకం కాదూ? " అంటూ నాలుగు వీధులకు వినబడేలా అరిచింది.

అమ్మ గజగజ వణికిపోయింది. భయపడుతూనే నాకేసి చూసింది. మురళి గురించి నేను ఇంట్రెస్టు చూపిస్తున్నానని అమ్మ గ్రహించింది. కాకపోతే కలిసి తిరుగుతున్నామన్న విషయం అమ్మ ఊహించివుండదు.

నాన్న నిప్పులు కురుస్తూ నావేపు చూశాడు.

భయపడ్డాకానీ నిలదొక్కుకున్నాను. ఆయన నన్ను ఏదైనా అడుగుతాడనో... లేక సినిమాల్లోలాగా ఇంట్లోంచి బయటకెళ్ళ

కుండా కట్టడి చేస్తాడనో... ఈడ్చి నాలుగు తంతాడనో... ఇలా ఏవేవో ఊహించాను.

కానీ ఆశ్చర్యకరంగా నాన్న ఏమీ అన లేదు. నావేపు కోపంగా చూసి వెళ్లిపో యాడు. అత్తయ్య అరిచి శాపనార్థాలు పెట్టి వెళ్లిపోయింది.

ఆరోజు నాతో ఎవ్వరూ మాట్లాడలేదు. ఒంటరిగా పెరట్లో బాదం చెట్టుకింద మంచం వేసుకుని పడుకుని ఆలోచనల్లో మునిగి ఉన్న నేను అలికిడికి తల తిప్పాను. చక్రవర్తి నా దగ్గరగా వచ్చాడు. నేను లేచి కూర్చున్నాను.

"కూర్చోవచ్చా రాజీ? " అన్నాడు.

"కూర్చో.." అన్నాను. నిజానికతనిమీద నాకు ద్వేషంలేదు. కోపంలేదు. అలాగని అభిమానమూలేదు. అటు పూర్తి అమాయ కుడూ కాదు, అన్నీ తెలిసిన తెలివైనవాడూ కాదు. ఇబ్బంది, మొహమాటం ఫీలింగ్స్ తప్ప ఇంకో ఫీలింగ్ మొహంలో కనిపిం చదు.

"ఎలా బతుకుతాడో జీవుడు" అంటూ అన్నయ్య అతనిమీద జోకులేస్తుంటాడు.

ఆమధ్యనోసారి నాన్న చక్రవర్తిని డాక్టరు దగ్గరకు తీసుకెళ్ళాడు. ఇంత వయసొచ్చినా రాత్రిళ్ళు పక్కతడపడం, నిద్రలో నడిచి వెళ్ళి ఏవేవో పిచ్చిపనులు చేయడం, పర ధ్యానం... ఎప్పుడూ ఏదో నలతతో మంచ మెక్కడం... ఇలాంటి సమస్యలున్నా యంటూ ఏకంగా మానసిక వైద్యుడి దగ్గరికి తీసుకెళ్ళాడు.

ఇతన్ని ఎక్కువగా అభద్రతాభావం పీడి స్తున్నదనీ అందుకే చెయ్యాలనుకున్నవి చెయ్యలేక అలా చెయ్యలేని పనులన్నీ నిద్రలో నడిచివెళ్ళి చేస్తుంటాడనీ అతన్ని ఒంటరిగా వదిలెయ్యకూడదనీ, మెదడు ఖాళీగా ఉండకుండా మంచి పుస్తకాలు చది వించాలని డాక్టరు సలహా చెప్పి ఏవో మందులు రాసిచ్చారు. మేమెవ్వరం అతన్ని పట్టించుకోలేదు. కారణం మేనత్తమీద కోపం, చిరాకు కారణం కావచ్చు అదీగాక చక్రవర్తి కూడా మాతో ఎక్కువగా కలిసి మాట్లాడేవాడు కాదు.

ఈవేళప్పుడు నేనున్నచోట కొచ్చి ఇంత ధైర్యంగా...

డాక్టరుగారిచ్చిన మందులు బాగానే పనిచే సినట్టున్నాయని నాలో నేను నవ్వుకున్నాను.

మంచం చివర ఇబ్బందిగా ఒదిగిపోయి నట్టు కూర్చున్నాడు.

"ఏమిటి విషయం? " చిరాకును అదిమి పట్టి అడిగాను.

నువ్వు మురళిని ప్రేమిస్తున్నావా రాజీ? " అన్నాడు సడన్‌గా.

అతన్నుంచి ఊహించని ఆ ప్రశ్నకు దిమ్మెరపోయాను. కోపం కూడా వచ్చింది. "నోరు మూసుకుని ముందిక్కడనుంచి పోతావా లేదా? " అని అరవాలనుకుని నేను నోరు తెరిచేలోగానే అతనన్నాడు.

"నాకు నువ్వంటే చాలా ఇష్టం రాజీ. నేను నిన్ను పెళ్ళి చేసుకోలేకపోతే విషం మింగి చస్తాను"

రెండుముక్కల్లో చెప్పేసి క్షణంలో అక్కడి నుంచి వెళ్ళిపోయాడు. చక్రవర్తిని గురించి ఆలోచిస్తుండిపోయాను. అతన్ని నేను ఏ విధంగా డిస్టర్బ్ చేయలేదు, నామీద చచ్చి పోవడానిక్కూడా సిద్ధమయ్యేంత ప్రేమను పెంచుకోవడమేమిటి?

చిన్నప్పటినుంచీ మేనత్త 'నీ పెళ్లాం నీ పెళ్లాం' అంటూ నన్ను చూపించడంవల్ల అతని మనసులో ఆ భావం నాటుకుపో యిందా?

ఏ భావమైనా నాటుకోనీ... అతన్ని గూర్చి నాకు ఆలోచన ఏమిటి?

నా సమస్య నాది. నాన్న నన్ను మంద లించకపోవడం బాధ కలిగిస్తోంది.

కొంపదీసి మురళీ వాళ్ళింటికెళ్ళి అత్తయ్య, మామయ్యలతో పోట్లాట పెట్టుకుని మురళిని తిట్టి, కొట్టబోయి... అమ్మో... ఆ దృశ్యం ఊహించుకుంటేనే భయమేస్తోంది.

# రచయితలకు మనవి



★ 'చతుర'లో నవలకు వేసే చిత్రాలు, 'చతురకతలు', 'చతుర ప్రపంచం'వంటి శీర్షికలు కాక కేవలం నవలమాత్రమే అచ్చులో *100* పేజీలు ఉంటుంది. నవలనుబట్టి పేజీల సంఖ్య పెంచడంగాని, తగ్గించడంగాని వుండదు గనుక రచయిత(త్రు)లు తమ వ్రాతప్రతిని అచ్చులో *100* పేజీలకు తక్కువ కాకుండా వుండేలా చూసుకుని పంపవలసి వుంటుంది.

★ **ప్రచురించిన నవలలో ఓ పూర్తి పేజీని తమ చేతివ్రాతలో రాసి చూసుకుని, ఆమేరకు తమ నవల అచ్చులో 100 పేజీలకు సరిపోయేలా ప్లాన్‌చేసుకుని 'చతుర'కు అనుకూలంగా వుండేసైజులో పంపడం మంచిపద్ధతి.**

★ **ఆవిధంగా నవలలు 'చతుర'కు సరిపడా లేకపోయినట్లయితే ఆయా నవలలు పరిశీలనార్హాలు కావని గమనించగోరుతున్నాం.**

★ *ప్రచురణకై ఎన్నికకాని నవలలు తిప్పి పంపేందుకై నవలతోపాటే తగు పోస్టేజిని జతపరచాలి. వ్రాతప్రతులు పోస్టులోగాని, ఇతరత్రాగాని పోయినసందర్భాల్లో మా బాధ్యత వుండదు.*

★ *సాధారణంగా నవలలు మాకు అందిన 4 వారాలలోగా ప్రచురణార్హంగా భావిస్తే ఆ విషయం తెలియపరచడం, లేనిపక్షంలో తిప్పిపంపడం జరుగుతుంది.*

★ *ప్రతి నవలకు అందజేసే రు: **3000/–** పారితోషికం ఏనెల 'చతుర'లో ప్రచురిస్తే ఆనెల మొదటివారంలోనే పంపబడుతుంది.*

**ఎడిటర్:**

# చతుర

**'ఈనాడు' కాంపౌండ్ హైదరాబాద్-500 482.**

# చతుర సమీక్ష



ఈ శీర్షికద్వారా ప్రతినెలా 'చతుర'లో వెలుబడే నవలను సమీక్షించే అవకాశాన్ని కల్పిస్తున్నాం. పాఠకులు తమకు నవల ఎందుకు నచ్చిందో లేదా ఎందుకు నచ్చలేదో వివరిస్తూ రచన బాగోగులు గురించి రాయాలి. సమీక్షలు రాసేవారు కథ మొత్తం మళ్లీ చెప్పకుండా, అవసరమైన మేరకే ప్రస్తావిస్తూ రాయాలి.

1. సమీక్ష అరఠావుకి మించకుండా కాగితానికి ఒకవైపునే రాయాలి.
2. ఏ నెల సమీక్ష ఆ నెల 20వ తేదీ లోపు మాకు అందేటట్లు పంపాలి.
3. మీ సమీక్షకు తప్పనిసరిగా ఈ కింది కూపన్ జతపరచాలి.
4. కవరుపై 'చతుర సమీక్ష'కు అని పేర్కొని ఎడిటర్, 'చతుర', 'ఈనాడు' కాంప్లెక్స్, హైదరాబాదు-500 082 అనే చిరునామాకు పోస్ట్ చేయాలి.

**మాకు సకాలంలో అందిన సమీక్షలలో ఎన్నికచేసిన అయిదు ఉత్తమ సమీక్షలకు రూ.100/- ప్రథమ బహుమతి, రూ. 75/- ద్వితీయ బహుమతి, రూ. 50/- చొప్పున మూడు తృతీయ బహుమతులను అందజేస్తున్నాం. పాఠకుల పరిశీలనాశక్తిని, రచనాసక్తిని పెంచే లక్ష్యంతో ఏర్పాటు చేసిన ఈ సమీక్షా రచనలో పాల్గొని ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోగోరుతున్నాం.**

★ కొందరు బహుమతి విజేతలు తమ బహుమతి తాలూకు చెక్కు అందలేదనీ, అడ్రసు మారిందనీ రాస్తున్నారు. బహుమతి మొత్తాలు ప్రతినెలా మొదటివారంలోనే పంపుతున్నాం. అడ్రసుల విషయంలో కూపన్‌లో రాసేటప్పుడే జాగ్రత్తపడటం మంచిది. ఈ విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలు సాధ్యంకాదు.

కూపన్

**జూలై 'చతుర' నవల పాణిగ్రహణం**

సమీక్షకుని పేరు : ______________________

చిరునామా ______________________

______________________

______________________

నా భయానికి తోడు మురళి నాలుగు రోజులుగా కనిపించలేదు. ఛ... ఛ... కారణం అది అయ్యుండదు. పదిరోజులక్రితం నానమ్మ బాత్‌రూంలో జారిపడి తుంటి ఎముక విరిగి మంచంలో పడింది. ఇంట్లో కొత్త పోట్లాట మొదలయింది. కూతురయ్యుండి మేనత్త, నానమ్మకి మంచినీళ్ళు కూడా తాగించదు. పైగా అజమాయిషీ చేస్తూ అమ్మకు సలహాలిస్తుంది. నానమ్మకు సేవలు చేయలేక అమ్మకు కోపం.

"ఇందుకేరా తమ్ముడూ, కులం గోత్రం అని పెద్దవాళ్ళు నెత్తీనోరూ బాదుకునేది. మనవాళ్ళు మనవాళ్ళే. పరాయిపరాయే. అదే మన కులం పిల్లయితే అత్తగారి సేవ గురించి నాతో వంతు పెట్టుకునేదా చెప్పు. ఈ ప్రేమలూ, దోమలూ అంటూ రెచ్చిపోయేవాళ్ళకు వయసులో ఉన్నపుడు తెలియదు. అన్ని విలువలు, సమస్యలు ఇలా వయసుమీద పడే కొద్దీ తెలిసొస్తాయి" అంటూ నాన్నకు ఇంకాస్త ఆజ్యం పోసేది.

దీంతో నాన్నకు తిక్కరేగి అమ్మతో పోట్లాట దెబ్బలు.. ఏడుపులు... ఇల్లు నరకం...!

నాన్నకీ సమస్యలముందు నా 'లవ్ ఎఫైర్' పెద్ద సమస్యగా అనిపించి ఉండదు. అందుకే నన్ను కోప్పడలేదు. ఇలా నాకు నేను సర్దిచెప్పుకుని సముదాయించుకున్నాను.

కానీ, వారం తిరక్కముందే నాన్న పురోహితుడిని తీసుకొచ్చి నాకు, చక్రవర్తికి పెళ్ళి ముహూర్తం నిర్ణయించమన్నాడు. "ఇంకో రెండు నెలల దాకా ముహూర్తాలు లేవు. మూడురోజుల్లో మౌఢ్యం వస్తుంది. అంతగా కావాలంటే ఈ మూడు రోజుల్లో నిశ్చయ తాంబూలాలు పుచ్చుకోవచ్చు. తర్వాత తాపీగా పెళ్ళిపనులు చూసుకోవచ్చు" అంటూ పురోహితుడు చెప్పాడు.

నాన్న ఆలోచనలో పడ్డాడు.

అమ్మ ఏడ్చి మొత్తుకుంది. "వాడి మానసిక పరిస్థితి బాగుండదు. ఆరోగ్యమూ అంతంత మాత్రమే. చదువు సరిగాలేదు. ఉద్యోగమూ లేదు. బంగారంలాంటి పిల్లను వాడికిచ్చి చేసి దాని జీవితం నాశనం చేస్తారా? అదీగాక మీ అమ్మగారి ఆరోగ్యం బాగా క్షీణించింది. భోజనం మానేసి ద్రవపదార్థాలు మాత్రం తీసుకుంటోంది. ఎప్పుడేం జరుగుతుందో తెలీదు. ప్రస్తుతం ఈ ప్రయత్నం ఆపండి" అంది.

"నాకసలు చక్రవర్తి అంటే ఇష్టంలేదు. నాకీ పెళ్ళి వద్దు" అంటూ ఏడ్చి ఎదురు తిరిగాను.

"మీరెవరు ఏడ్చి మొత్తుకున్నా ఈ నిశ్చయ తాంబూలాలు ఆగవు. రెండు నెలల తర్వాత పెళ్ళీ ఆగదు" అన్నాడు నాన్న

"ఇంత ఇష్టంలేని పెళ్ళి బలవంతంగా చేసి నాతో కాపురం చేయించగలరా? " కోపంగా అడిగాను. దానికి జవాబుగా నాన్న ఏమన్నారో తెలుసా?

"ఇప్పుడు నీవు నా కూతురివి. నా ఇష్టప్రకారం నాకు నచ్చినవాడితో పెళ్లి చేస్తాను. పెళ్లవగానే నీ మీద నాకు హక్కుండదు. ఈ ఇంటికీ నీకూ సంబంధముండదు. నీకంతగా వాడితో కాపురం చేయటం ఇష్టం లేకపోతే పెళ్లయిన రోజే ఆ మురళిగాడితో లేచిపో! నాకు సంబంధంలేదు" అన్నాడు.

నేను మ్రాన్పడిపోయాను. నా జన్మకు కారకుడైన తండ్రిని తేరిపారచూశాను.

ఆయన విషపుటాలోచనలు... ఆయన మాటల్లోని పితృస్వామ్య ఆధిక్యత నాకు చాలా అసహ్యం కలిగించాయి. ఆయనమీద కసి కూడా కొండలాగా పెరిగింది.

మురళి ఊళ్లోలేడనీ, కాంపిటీటివ్ ఎగ్జామ్స్ రాయటానికి బెంగుళూరు వెళ్లాడనీ పరీక్షవగానే ఫ్రెండుతో ఊటీ వెళ్లి వారం దాకా రాడని తెలుసుకున్నాను.

ఎవరూ లేకపోయినా ఫర్వాలేదు. నేను నిస్సహాయురాలిగా అందరు ఆడపిల్లల్లా తల

వంచుకోకూడదు అని నాలో మొండి ధైర్యం వచ్చింది.

తెల్లవారితే నిశ్చయ తాంబూలాలు. నాన్న బంధువులకూ, స్నేహితులకూ ఫోన్లు, టెలిగ్రాంలు ఇచ్చి రప్పించారు. చక్రవర్తికి డబ్బిచ్చి బట్టలు, ఉంగరం, చైను కొనుక్కోమన్నారు. నాకు బట్టలు తెచ్చారు. ఓ ఫంక్షను హాలు ఏర్పాటు చేసి ఆర్భాటం చేశారు.

బంధువులు, స్నేహితులు రావటంతో ఇల్లు చాలదని ముందు రోజు రాత్రే అందరం ఫంక్షను హాలు చేరుకున్నాము. అందరూ సంతోషంగా ఉన్నారు అమ్మ, నేను తప్ప.

ఆ రాత్రి పెద్ద గందరగోళం జరిగింది.

"అయ్యో! అయ్యో! అదేంటే అలా వెళ్లిపోతావు. ఆ తర్వాతేం జరిగిందో చెప్పు" అంది విజయ వెళ్లిపోతున్న రాజేశ్వరి చెయ్యి పట్టుకుని ఆపుతూ ఆత్రంగా.

మౌనంగా ఉండిపోయింది రాజేశ్వరి.

"గందరగోళమన్నావు ఏం జరిగిందేమిటి? తెలుగు సినిమాల్లోలాగా సరిగ్గా సమయానికి సూపర్‌మేన్‌లా మురళి వచ్చి ఆ తతంగం ఆపేశాడా? భేతాళ కథల్లోలాగా ఆ మౌనమేమిటే? కొంపదీసి సమాప్తమా? "

"కాదు సశేషం" నోరు విప్పింది రాజేశ్వరి.

"మరీ నీవింత శాడిస్టువనుకోలేదు. కథ మంచి ఇంట్రస్టింగ్‌గా ఉన్నపుడు సశేషం మార్కు మొహం పెడతావా? అసలు రచయిత్రివి నీవా? నేనా? "

"నీవే! కథ రసపట్టులో ఉన్నపుడు సశేషం పెడితేనే రచయిత్రిగా నీవు పాఠకులకు బాగా గుర్తుండిపోతావు. పత్రిక సర్క్యులేషన్ పెరుగుతుంది. ఓ గొప్ప పాఠకురాలిగా నా కొటేషనిది. అండర్‌లైను చేసుకో" అంది రాజేశ్వరి.

"ప్రపంచంలో ఎక్కడా జరగని కని, విని ఎరుగని కథ చెబుతున్నట్టు ఆ ఫీలింగేమిటి? ఆ స్టైలేమిటి? ఈ దేశంలో కోట్ల కొద్దీ ఆడపిల్లల సమస్యల్లో నీది ఓ సమస్య. అక్కడ పెద్ద వింత జరిగుండదు. మహా జరిగుంటే ఓ మర్డరు జరిగుంటుంది. నేనూహించుకోగలను. రచయిత్రినికదా"

"అలాగా! అయితే కరెక్టుగా చెప్పు చూద్దాం"

"అయితే మర్డరు జరగలేదా? "

"లేదు. రేపటిలోగా ఏం జరిగి ఉంటుందో ఊహించి చెప్పుచాలు" అంటూ లేచివెళ్లిపోయింది, చిద్విలాసంగా నవ్వుతూ రాజేశ్వరి.

కోపంగా అక్కడున్న గ్లాసు తీసి నేలకు విసిరికొట్టింది విజయ.



"ఈ రోజు ఓ ఇంటర్వ్యూకెళ్లొచ్చానండి" అన్నాడు చందూ.

"పెళ్లిచూపుల ఇంటర్వ్యూకా? " అడిగింది విజయ.

"మీరు భలేవారే! బేకార్ ఇన్‌స్పెక్టర్ని నాకెవరిస్తారండీ అమ్మాయిని? ఉద్యోగం ఇంటర్వ్యూనండీ బాబూ"

"అలాగా! దొరికిందా? "

"దొరకటానికి అదేమైనా పారేసుకున్న రూపాయిబిళ్లటండీ! లంచం లక్ష రూపాయ

లడిగారు. పెద్ద రికమెండేషను కావాల
న్నారు. రెండూ మనకు లేవు. ఇంటర్వ్యూ
కెళ్లొచ్చిన అనుభవం మాత్రం మిగిలింది"

"అదిసరే! ఈ రోజుల్లో ఆడపిల్లల తల్లిదం
డ్రులు అబ్బాయిలకు ఉద్యోగం చూపించి
మరీ అల్లుళ్లను చేసుకుంటున్నారుకదా! ఆ
రూట్‌లో వెళితే బాగుంటుందేమో ఆలోచిం
చలేకపోయారా? "

"అమ్మో! అలా చేసుకుంటే ఇంకేమయినా
ఉందా? ఈ రోజుల్లో ఆడపిల్లలు
అసాధ్యులు. మా నాన్న చూపించిన
ఉద్యోగం, మానాన్న డబ్బు, మా నాన్న
కట్నం అంటూ నాతో సర్కస్ చేయించరూ!
మా ఎదురింట్లో ఇలాంటి కేసు ఒకటి
తెల్లారి లేచినప్పటినించి వీనులవిందు
చేస్తుంటే విని తరిస్తున్నాం" అన్నాడు
చందూ.

"ఇంతకీ మీకు గవర్నమెంటు ఉద్యోగానికి
కావల్సిన హంగులు లేవుకదా! దానిమీద
అంత క్రేజ్ పెంచుకోవటమెందుకు? రాలే
దని బాధపడటమెందుకు? దేశంలో
బోలెడు ప్రయివేటు ఉద్యోగాలున్నాయి.
ఏదో ఒకటి చేసి బతకొచ్చుకదా! అంతెం
దుకు ఆడపిల్లను, అమ్మానాన్నలకు
దూరంగా ఉంటూ ప్రయివేటు ఉద్యోగం
చేయటంలేదా? మీరు ట్రైచేస్తే దొరుకుతుం
దికదా!"

"అమ్మో! ప్రయివేటు కంపెనీల్లో వెట్టిచా
కిరీ చేయిస్తారు. అది నావల్లకాదు. అదిగాక
వాళ్లకెపుడు కోపమొస్తుందో, ఎప్పుడు తీసే
స్తారో తెలియదు. వాళ్ల అడుగులకు మడు
గులొత్తుతూ ఉండటం నా చేతకాదు. గవ
ర్నమెంటు ఉద్యోగమైతే ఓ నెల రోజులు
కొంపలో ఉన్నా జీతం వస్తుంది. అడిగేవా
రుండరు" అన్నాడు చందూ.

"ఓహో! అయితే మీరు ఓ రకమైన సోమ
రిపోతన్నమాట"

"అదేమిటండీ! అంత పెద్ద మాటన్నారు.
నేను సోమరిపోతునా? మా ఇంట్లో ఎన్ని
పనులు చేస్తానో తెలుసా? "

"సరిసరి! అవన్నీ వినటానికి నాకు
టైంలేదు. మీరు చేసే పనుల లిస్టు ఇంకో
సారి చదువుదురుగాని నేను వెళ్లొస్తా"
అంటూ లేచింది విజయ.

"అదేమిటి అంత తొందర? "

"మీరేం పని చెయ్యకపోయినా ఇంటికెళ్ల
గానే మీ అమ్మ మీకు పుడ్డు పెడుతుంది.
మీలాంటి వారితో ఊసుపోని కబుర్లు
చెబుతూ కూర్చుంటే నాకు పుడ్డు ఎక్కడి
నించి వస్తుంది" అంటూ వెళ్లిపోయింది.

ఆలోచిస్తూ ఇల్లు చేరిన చందూకు
వాకిట్లోనే తండ్రి ఎదురయ్యాడు. "ఏరా!
సిగ్గులేదూ! ఊరంతా తిరిగొచ్చి ఊరపం
దిలా తిని, దున్నపోతులా పడుకుంటావు.
ఏదైనా ఉద్యోగం చూసుకోమంటే చూసు
కోవు" అంటూ ఇంతెత్తున ఎగిరాడు.

"ఉద్యోగమా? నేను ప్రధానమంత్రి కొడు
కునికదా! లంచం, రికమెండేషను లేకుండా
పిలిచి ఇస్తార్లే ఉద్యోగం. ఉద్యోగమట
ఉద్యోగం. ఉన్న ఒక్కగానొక్క కొడుకుని. ఓ
లక్ష పారేసి ఉద్యోగంలో ఇరికిద్దామనుకోవు.
సంపాదించిందంతా ఎవరికి పెట్టి పోతావు"

"ఏమిటీ లక్ష రూపాయలు పారేయాలా?
అప్పనంగా వచ్చిన సొమ్ము లేదిక్కడ. ఎవ
రికి పెట్టి పోతానా? చచ్చాక నా శవయా
త్రలో నోట్లు చల్లించుకునే ఏర్పాటు చేసుకుం
టాను కానీ నీకు మాత్రం ఖర్చుపెట్టను.
కష్టపడి సంపాదించిన డబ్బు విలువ నీకేం
తెలుస్తుంది. సోంబేరి వెధవాని... సోంబేరి
వెధవ" తిట్టుకుంటూ బయటకెళ్లిపోయాడు
నారాయణరావు.

అంతవరకూ శ్రోతలా ఉన్న శకుంతలమ్మ
భర్త వెళ్లిపోగానే చందూ ముందుకొచ్చి "ఆ
మనిషి అంతలా తిడుతుంటే రోషం
లేదుట్రా నీకు! సిగ్గులేకుండా లక్ష ఇవ్వ
రెండు లక్షలివ్వు అని అడుగుతావు. చది
విన చదువుతో ఏదో ఒక ఉద్యోగం చూసు

కుని పౌరుషంగా బతకలేవూ" అంది కోపంగా.

తల్లివైపు నవ్వుతూ చూసి "రోషమూ పౌరుషమూనా? అమ్మా! నేనో విషయం అడుగుతాను చెబుతావా? మీ పెళ్లయి పాతికేళ్లు దాటిపోయిందికదా! ఇన్నేళ్లు కొట్టుకుంటూ తిట్టుకుంటూ నువ్వు నాన్న దగ్గరే ఎందుకున్నావు? వదిలేసి వెళ్లి రోషంగా, పౌరుషంగా బతకలేకపోయావా? ఎందుకు వెళ్లలేదు? తాళిబొట్టు సెంటిమెంటా? లేక బయటికి వెళ్లి బతికే ధైర్యం లేకనా? లేక ఆయన ఒంటరివాడవుతాడనా? వదిలి వెళ్లిపోతే ఆయన సుఖపడిపోతాడనా? జవాబు చెప్పలేవుకదూ! నా పరిస్థితీ అంతే! ఆయన అలా తిడుతుంటాడు. మనమిలా రోషం, మీసం పక్కకు పెట్టి ఆయన్ని సాధిస్తూ రాజాలా బతికేస్తూనే ఉంటాం" అంటూ నవ్వుతున్న కొడుకునెత్తిన ప్రేమగా మొట్టింది శకుంతలమ్మ "హోరి భడవా" అంటూ.

★ ★ ★

"ప్రియమైన రాజీకి నీ స్నేహితురాలు రమ రాయునది.

నీ ఉత్తరం చేరింది. ఈమధ్య మా ఇంట్లో వాతావరణం ప్రశాంతంగా ఉంది. కాస్త స్థిమితంగానే బతుకుతున్నానని అనుకుంటుండగా అన్నయ్యకు పెళ్లి సంబంధాలు చూడసాగారు. "చెల్లికి పెళ్లి కాకుండా నేను చేసుకోవడమేమిటి నాకిప్పుడప్పుడే పెళ్లివద్దు" అని అన్నయ్య అన్నాడు.

"దాని పెళ్లికి ఆటంకాలు ఏర్పడుతుంటే జోతిష్యం అడిగాం. అంజనం వేయించాం. జాతకాలు చూపించాం. ఈ ఇంట్లో కోడలు పాదం మోపితే తప్ప దానికి పెళ్లయి ఇల్లు వదలదుట. అందుకే నీకు పెళ్లి చేయాలనుకుంటున్నాం. కోడలు వచ్చిన వేళావిశేషంతో మంచి వరుడు దానికీ దొరకచ్చు పెద్దవాళ్ల మాటలు కాదనకు" అంటూ నాన్న వాడి అంగీకారం తీసుకున్నాడు.

అంతే! "అబ్బాయికి పెళ్లి చేయాలనుకుంటున్నాం" అని నాన్న ఎవరో ఒకరి చెవిలో ఊదారు.

"మా అమ్మాయినిస్తాం... మా అమ్మాయినిస్తాం. లక్షా? రెండు లక్షలా? స్కూటరు ఇస్తాం. సూటు ఇస్తాం. మెడలో చైను, చేతికి ఉంగరాలా? ఇంట్లోకి ఫర్నిచరా? మీరేం కోరినా మేం రెడీ!" అంటూ అమ్మాయిల తల్లిదండ్రులు క్యూలో నిలబడ్డారు.

నాకు చాలా ఆశ్చర్యమనిపించింది. అంతే కట్నకానుకలు నన్ను చేసుకోబోయే వరుడికి స్తానని నాన్న అంటున్నా కులం గురించి, గోత్రం గురించి ఆలోచించిన వీళ్లందరికీ ఇప్పుడవి అంటే అన్నయ్యను అల్లుడిగా చేసుకోవటానికి ఇవేవీ అడ్డురాలేదు అనిపించింది. రెండు కులాలకు పుట్టాను కాబట్టి నాది మూడో కులమట. పేరు లేని కులమట. సంకరజాతిట. నాలాగే అన్నయ్య కూడా పుట్టాడు. కానీ కేవలం... కేవలం మగ పుట్టుకవల్ల వాడికీ వాసనలేవీ తాకటం లేదు. విచిత్రంగా పెళ్లి దగ్గరకొచ్చేసరికి ఇరుపక్షాల వారు కులం సంగతి మర్చిపోయారు. ఒకరి పద్ధతులను మరొకరు గౌరవించుకున్నారు. మంచి పెంపకం, తల్లిదండ్రులు మంచివారు. అబ్బాయి బుద్ధిమంతుడు, ఉద్యోగస్థుడు, అందగాడు మంచి భవిష్యత్తు ఉంది అన్నారు. నాలుగైదు చోట్లకు పెళ్లిచూపులకెళ్లి వచ్చాక అన్నయ్య ఓ అమ్మాయి నచ్చిందన్నాడు.

కానీ నాన్న ఓ లింకు పెట్టాడు. అమ్మాయి అన్నయ్య నన్ను చేసుకుంటే తప్ప ఒప్పుకోము అన్నారు. అంటే కుండమార్పిడి. ఎదురు వియ్యం అంటారు చూడు అదన్నమాట.

కానీ అందుకు వాళ్లు ఒప్పుకోలేదు. ఇంకో యాభై వేలు ఎక్కువ కట్నం ఇస్తాంకానీ ఈ పద్ధతి వద్దన్నారట. అందుక్కారణం నేను కురూపినికాదు. నిరక్షరాస్యురాలినికాదు. క్యారెక్టర్ పరంగాకాదు. కేవలం కులం

సమస్య. వింతగా ఉందికదూ. ఈ ఇంటికొచ్చే కోడలికి ఈ కులాలు అడ్డురావు. నేనింకొకరింటికి వెళ్లాలంటే కులం ప్రతిబంధకమౌతోంది. ఈ ప్రపంచంలో ఎందరో ప్రేమించి పెళ్లిచేసుకుంటున్నారు. వారికి పుట్టిన పిల్లలందరూ నాలాంటి సమస్యనెదుర్కొంటున్నారా? లేక నేనొక్కదాన్నే ఈ కులాలకు బలవుతున్నానా అనిపిస్తోంది. అంతే! ఆ సంబంధం బెడిసికొట్టింది. అన్నయ్యకు కోపమొచ్చింది. దాని పెళ్లితో నాకు లింకు పెట్టకండంటూ కేకలేశాడు. దాంతో నాన్న లింకుల ప్రస్తావన పక్కకు పెట్టాడు. మరో సంబంధం ఖాయమైంది. వచ్చే నెలలో అన్నయ్య పెళ్లి. వాడి పెళ్లయితే నా పెళ్లవుతుందని జోస్యం చెప్పారు కాబట్టి అమ్మ నాతో పూజలు చేయిస్తోంది. ఏ దేవుడు కరుణిస్తాడో! మరి ఉంటాను!

-రమ"

★ ★ ★

"ఆ రాత్రి పెద్ద గందరగోళం జరిగిందన్నానుకదా!" అంటూ మొదలుపెట్టింది రాజేశ్వరి.

"అమ్మో! కథ మొదలుపెడుతున్నావా? ఆకలేస్తోంది. భోంచేశాక చెబుదూగానిలే" అంది విజయ.

"నాకిపుడు మంచి మూడ్ ఉంది. చెప్పాలనుకుంటున్నాను. ఇపుడు తప్పితే మళ్లీ ఎపుడు చెబుతానో నాకే తెలీదు. తిండికేం తొందరలేదు. తర్వాత మింగచ్చు"

"భోజరాజుకథల్లో బొమ్మలాగా ఎంతలా పోజు కొడుతుందో" పళ్లు నూరుకుంటూ గొణిగింది విజయ.

"ఏమిటి నీలో నీవే గొణుక్కుంటున్నావు? "

"అబ్బే ఏం లేదు. చెప్పు తల్లీ చెప్పు. తమరి కథ వింటూంటే ఆకలి దప్పులుండవులెండి" నవ్వు పులుముకుంటూ అంది విజయ.

"అలారా దారికి" అన్నట్టు ఆమెవైపు చూసి చెప్పసాగింది రాజేశ్వరి.

"ఫంక్షన్ హాలు చేరుకున్న తర్వాత మాకు కేటాయించిన గదిలో ఓ సూట్‌కేసు తలక్రింద పెట్టుకుని పడుకున్నాను. ఆ సూట్‌కేసులో నాకు సంబంధించిన వస్తువులు, బట్టలు, కొంత డబ్బు, నా సర్టిఫికెట్లు సర్ది ఉంచుకున్నాను. అంతా సద్దుమణిగి నిద్రపోయాక ఆ సూట్‌కేసు తీసుకుని బస్సుకానీ రైలుకానీ పట్టుకుని ఈ ఊరు వదిలివెళ్లాలి. ఓ వారం రోజులు ఏ ఫ్రెండు ఇంట్లోనైనా తల దాచుకుని తర్వాత మురళిని రప్పించుకుని విషయం వివరించి ఠకీ మని పెళ్లి చేసుకోవాలి. ఆ తర్వాత ఎవ్వరూ ఏం చేయలేరు. ఎవరైనా ఏడవనీ మొత్తుకోనీ శవాలు పడనీ వీటన్నిటికీ భయపడి నా జీవితం నాశనం చేసుకోను. ఇదీ నా నిర్ణయం. కళ్లు మూసుకుని నిద్ర నటిస్తున్నాను.

"అన్నయ్య డబ్బు బాగా సంపాదించినట్టున్నాడు సుమా. నిశ్చితార్థం ఇంత గ్రాండ్‌గా చేస్తున్నాడు. పెళ్లి ఇంకెంత గ్రాండ్‌గా చేస్తాడో!"

"అన్నట్టు ప్రదీప్ రాలేదేంటి? చెల్లి నిశ్చితార్థం జరుగుతుంటే అన్న రాకపోవడమేమిటి? వాడికీ పెళ్లి ఇష్టంలేదేమో"

"ఛ అదేంకాదు. కొత్తగా ఉద్యోగంలో చేరాడుకదా. సెలవు దొరకలేదుట"

"ఏది ఏమైనా అన్నయ్య పంతం నెగ్గించుకున్నాడు. మన కులంలోనే కూతురికి పెళ్లి చేసి మనలో కలిపేసుకుంటున్నాడు"

"వదిన కులంలో చేసుంటే ఇంత జనం కలిసేవాళ్లా? అంతెందుకు నేనస్సలు వచ్చుండేదాన్నికాదు"

"మరే! మా ఆయన అస్సలు పంపేవాడు కాదు తెలుసా? "

"వాళ్ల పద్ధతులు, ఆచారాలు వేరుట. మరీ అనాగరికుల్లా ప్రవర్తిస్తారుట. బాబూ"

"మెల్లిగా మాట్లాడు ఆవిడ వింటుంది"

అమ్మకూ నాకూ కూడా స్పష్టంగా వినిపిం

చేంత గుసగుసగా మాట్లాడుతున్న వాళ్లని చూసి పీకలు పిసకాలనిపించింది. వీళ్లిలా రెచ్చిపోవటానికి కారణం నాన్నకదూ. నా ఆలోచనల్లో నాన్న బద్ధ శత్రువయిపోయాడు. ఈ ఇంట్లో ఇంకా కొద్ది గంటల్లో ఇప్పుడు రెచ్చిపోయి మాట్లాడుతున్న నోర్లన్నీ మూతబడతాయి. చూపుడువేలు ముక్కు మీదకు చేరుతుంది. పితృస్వామ్య పరిపాలన పునాదులతో సహా పడిపోతుంది.

నేను పోలీసుల సాయం తీసుకుంటే! ఈమధ్య చాలామంది ప్రేమికులు పోలీస్‌స్టేషన్లలోనే జంటలవుతున్నారు.

పరిపరి విధాల ఆలోచిస్తూ అమ్మ పడుకున్నవైపు చూశాను. నిశ్శబ్దంగా కన్నీరు కారుస్తున్న అమ్మ దగ్గరికి చేరాను. అమ్మ కన్నీళ్లు తుడిచాను.

“నేను ధైర్యంగా ఉన్నాను. నీవెందుకమ్మా ఏడుస్తావు. ఎలా జరగాలని ఉంటే అలా జరుగుతుంది. ఏం జరిగినా నువ్వు మాత్రం నిబ్బరంగా ఉండు” అంటూ అమ్మను ఓదార్చాను. అమ్మ ఒడిలో తలపెట్టుకుని పడుకున్నాను.

అమ్మ వాలకం చూస్తే అమ్మ నాకేదో చెప్పాలనుకుంటున్నట్టు, చెప్పలేక ఇబ్బంది పడుతున్నట్టు గ్రహించాను. కానీ ఆమెను రెట్టించి ఏదీ అడగలేదు.

కాసేపటికి అమ్మ నిద్రపోయింది.

అప్పటిదాకా అందరికీ పనులు పురమాయించి వచ్చి నాన్న కూడా గదిలోకొచ్చి పడుకుని నిద్రపోయాడు.

పక్కగదుల్లో టీవీల్లో ఇంటినించి తెచ్చిన విసిఆర్‌లలో సినిమాలు చూస్తున్నారు గోల గోలగా. మేమున్న గదిలో నేను తప్ప అంతా నిద్రపోయారు.

నేను శబ్దం చేయకుండా సూట్‌కేసు తీసుకుని లేచి నిలబడ్డాను. పక్కగదిలోంచి సినిమా గోల మాత్రం వినిపిస్తూనే ఉంది.

“రెండు గంటలు దాటినా వీళ్లకిదేం పొయ్యేకాలం నిద్రపోకుండా” అని తిట్టుకుంటూ గదిదాటి బయలుదేరటానికి రెండడుగులు వేశాను.

ఒక్కసారిగా అందరూ ఉలిక్కిపడి లేచేట్టుగా పక్క గదిలోంచి ఎవరో అమ్మాయి గావుకేకలు, పెద్దవాళ్ల అరుపులు కలగాపులగంగా వినబడ్డాయి.

నేను కంగారుగా నా చేతిలోని సూటుకేసు కిందపెట్టి అలాగే కూర్చున్నాను.

“ఏమిటి? ఏమిటి? ఏం జరిగింది” అంటూ మా గదిలోని వారంతా హాల్లోకి పరిగెట్టారు.

“అనవసరంగా అందరూ మేల్కొని నా ప్లాను పాడుచేశారు. మళ్ళీ వీళ్ళంతా ఎప్పుడు నిద్రపోతారు. నేనెప్పుడు బయటపడతాను. సరిగ్గా నాలుగ్గంటలకు ట్రెయిన్ ఉంది. అప్పటికి స్టేషన్ చేరుకోగలనా? ఇంతకీ గలాటా ఏమిటి? ఆ! ఏముంటుంది ఎవరికో తేలు కుట్టింటుంది” ఇలా అనుకుంటూ అందరితో పాటు నేనూ హాల్లోకి వచ్చాను.

అక్కడ అందరూ గుమిగూడి ఉన్నారు. వారిమధ్యలో చక్రవర్తి తలపట్టుకుని ఓ కుర్చీలో కూర్చుని ఉన్నాడు. అతని తలమీద ఎవరో నీళ్ళు పోసినట్టున్నారు. మొత్తం తడిసి నీళ్లోడుతున్నాడు.

అక్కడో అమ్మాయి నెత్తీ నోరూ బాదుకుంటూ ఏడుస్తోంది. మా మేనత్తతో, ఆ అమ్మాయి తల్లిదండ్రులు విపరీతంగా బూతులు ప్రయోగించి మరీ పోట్లాడుతున్నారు.

అక్కడ జరిగిన విషయమేమిటంటే చక్రవర్తి క్రితంరోజు షాపింగ్‌కెళ్ళి, నిశ్చితార్థంలో నా వేలికి తొడగటానికి ఓ మంచి ఉంగరం కొన్నాడట. అపుడు అదే షాపులో ఓ కొత్త డిజైను మంగళసూత్రాలు ఎవరో కొంటూండగా చూశాడట. అలాంటి పీసు ఇంకొక్కటి మాత్రం ఉందని షాపు వాడన్నాడుట. ఈ రెండు నెలల తర్వాతయినా, పెళ్ళికోసం

తాళి కొనాల్సిందే కదా అనుకుని, మంగళ సూత్రాలు కొనేశాడుట.

కొని ఇంట్లో పెడితే పోయేది. అలా చేయక దానికో తాడు స్వయంగా పేని పసుపురాసి మరీ జేబులో ఉంచుకుని నిద్రపోయాడుట. నిద్రలో నడిచే అలవాటుంది కదా దొరగారికి. అలా ఆ రాత్రివేళ లేచి నిదానంగా నడిచి పక్క గదిలోకొచ్చాడు. అక్కడ అందరూ నిద్రపోతున్నారు. ఎవరో ఒకళ్ళిద్దరు మాత్రం సినిమా చూస్తున్నారుట. గుమ్మం దగ్గరే కుర్చీలోనే కూర్చుని ఓ అమ్మాయి నిద్రపోతోందిట.

అంతే! మన హీరోగారు ఠకీమని ఆ అమ్మాయి మెడలో తాళికట్టేశాడుట.

ఆ అమ్మాయి గబుక్కున మేలుకుని కేకలు. అందరూ గుంపుకూడారు. చక్రవర్తిని తాగుబోతనుకుని నెత్తిన బిందెడు నీళ్ళు గుమ్మరించారు. అదీ సంగతి. అందరి హృదయాలు బరువెక్కాయి. అమ్మ, నేను మాత్రం అంతవరకు అనుభవించిన టెన్షన్ కరిగిపోగా ఫ్రీగా ఊపిరిపీల్చుకున్నాము. ఇపుడేం నిర్ణయం తీసుకుంటారా అని ఎదురుచూస్తున్నాను. నిజానికి నాకా వాతావరణం గంటక్రితంవరకూ ఉక్కిరిబిక్కిరిగా ఉండి బాధపెట్టింది. చక్రవర్తి చేసిన ఆ పనితో నాకావాతావరణం చాలా ఇంట్రస్టింగ్గా ఇంచుమించు సినిమా చూస్తున్న ఫీలింగు కలిగించింది.

చక్రవర్తి తాళికట్టిన ఆ అమ్మాయి పేరు శశికళ. చక్రవర్తి ఇంటెదురుగా ఉంటున్నారు. అమ్మాయి పెద్దగా చదువుకోలేదు. తల్లిదండ్రులు బీదవారు. నలుగురాడపిల్లల్లో శశికళ మూడవ అమ్మాయి. ఇంట్లో అప్పడాలు, వడియాలు, ఊరగాయలు చేసి పెద్ద పెద్ద కొట్లకు అమ్మివేస్తుంటారు. ఆ అమ్మాయి తండ్రి ఓ పెద్ద హోటల్‌లో వంటచేస్తాడుట. ఇద్దరమ్మాయిలకు ఎలాగో కష్టపడి పెళ్ళి చేశారు. మూడవ అమ్మాయి అయిన శశికళకు సంబంధాలు చూస్తున్నారుట. చక్రవర్తికి ఆ అమ్మాయి పరిచయంలేనిదేం కాదు. ఇంటెదురుగా ఉంటున్నారు కాబట్టి, పరిచయంకొద్దీ ఏదైనా పనిమీద చక్రవర్తి వాళ్ళింటికి వెళ్ళేవాడుట. ఆ అమ్మాయి కూడా చక్రవర్తి ఇంటికి వస్తూ పోతూ ఉండేదిట.

అంతో ఇంతో స్నేహంగా ఉండే రెండు కుటుంబాలు చక్రవర్తి చేసిన ఈ వింత చర్యతో విపరీతంగా ఘర్షణపడాల్సివచ్చింది.

"ఎలాగూ తాళికట్టేశాడు కాబట్టి మా అమ్మాయిని భార్యగా స్వీకరించాలని" పట్టుబట్టాడు శశికళ తండ్రి.

"ఇది తెలియక చేసిన తప్పు. వాడికి నిద్రలో నడిచే అలవాటుంది" అంటూ సర్దిచెబుతోంది మేనత్త.

అసలే కూతురికి కట్నకానుకలిచ్చుకోలేక, వరుడిని వెతకలేక నానా అవస్థలు పడుతున్న శశికళ తండ్రికి జరిగిన పని పెద్దగా బాధకలిగించలేదు. ఎలాగైనా చక్రవర్తికి ముడిపెట్టేస్తే పోతుందని చూస్తున్నాడు. కానీ అతను మనసులో ఉన్నది బయటపెట్టకుండా "మా పిల్లకు పెళ్ళి నిశ్చయమైంది. ఇప్పుడీ సంగతి తెలిస్తే వాడు చేసుకుంటాడా? ఆడపిల్ల గలవాళ్ళ బాధలు మీకేం తెలుస్తాయి? తెలిసి చేసినా తెలియక చేసినా హిందూసాంప్రదాయం ప్రకారం ఓ ఆడదాని మెడలో మగాడు తాళికడితే పెళ్ళయినట్టే లెక్క. పదండి పోలీస్‌స్టేషనుకు కేసు పెడతాను" అంటూ రెచ్చిపోయాడు.

"కేసులూ గట్రా ఎందుకు ఎలాగూ వంటవాళ్ళు వచ్చారు. తెల్లారాక విందు భోజనం చేసి నాలుగక్షింతలు వేసి వెళితే సరి" కొందరు ఆకతాయిలు జోకులు వేస్తూ వెటకారంగా నవ్వుకున్నారు. నాన్న, అమ్మ శ్రోతలుగా మిగిలిపోయారు. ఈ గొడవ ఇలా జరుగుతుండగానే ఇంటిదగ్గర్నించి కబురొచ్చింది నానమ్మ చనిపోయిందంటూ. అందరూ హడావిడిగా ఇంటికి పరిగెత్తుకెళ్ళాం!"

"వార్నీ! కథ మంచి రసపట్టులో సాగిందే! ఈ ముసలావిడకిప్పుడే కాలం తీరిపోవాలా? అపుడేం జరిగింది" అంది విజయ.

"ఏం జరుగుతుంది? అంత్యక్రియలు జరిగాయి. నానమ్మ పోయింది కాబట్టి సంవత్సరంపాటు ఇంట్లో శుభకార్యాలేవీ జరగకూడదన్నారు" అంది రాజి.

"కాకీవాలె! పండూ క్రిందపడె" అన్నట్టయిందన్నమాట నీ పరిస్థితి. అన్నీ నీకనుకూలంగానే జరిగాయి భలే, భలే" చప్పట్లు చరిచింది విజయ.

"నా బొంద కథలేం రాస్తావోకానీ తిక్కతిక్క సామెతలన్నీ ప్రయోగిస్తుంటావు"

"సారీ! సారీ! ఇంతకీ చక్రవర్తి సంగతేమయింది? "

"ఏమవుతుంది! అందరూ కలిసి అదే వీధిలో ఉన్న రిటైర్డు జడ్జి దగ్గరకెళ్ళారు. "కేసులూ గట్రా అంటూ వీధినపడకండి. ఆ అమ్మాయిని ఏలుకో" అన్నారుట ఆయన.

'ససేమిరా వద్ద'న్నాడట చక్రవర్తి "నేను రాజేశ్వరిని ప్రేమిస్తున్నాను. ఆ అమ్మాయినే పెళ్ళిచేసుకుంటాను ఈ పెళ్ళి రద్దయ్యే మార్గం చెప్పండి" అన్నాడట.

నాన్న, మేనత్త కూడా చక్రవర్తికి వంతపాడారుట.

"అలాగయితే మీ ఖర్మ. కోర్టుకు వెళ్ళండి. అక్కడికెళ్ళినా ఇంత త్వరగా విడాకులు మంజూరుకావు. కనీసం, సంవత్సరం రోజులు వాయిదాలు గట్రా అంటూ తిప్పుతారు. ఈ సంవత్సరం రోజులు కోర్టు చుట్టూ తిరగండి. ఈలోగా ముసలావిడ చనిపోయిన కర్మతిథి సమయం సంవత్సరమూ గడిచిపోతుంది. మీ అదృష్టంకొద్దీ విడాకులు మంజూరు అవుతే ఎవరిదారి వారు చూసుకోవచ్చు" అని చెప్పి పంపారుట.

"నాకు చక్రవర్తితో విడాకులు తీసుకోవటం ఇష్టంలేదు. అతన్ని భర్తగా అంగీకరిస్తాను. అతనిపై కేసు పెట్టను. కోర్టుకు రాను" అందిట శశికళ.

వాళ్ళ సంగతలా పెండింగులో ఉండగా మా నాన్న అందరితోనూ ఏమంటున్నాడో తెలుసా? "చక్రవర్తి చేసిన తప్పుకు పరిహారంగా అంతో ఇంతో డబ్బు ఇచ్చి శశికళను వదిలించుకొని నా కూతుర్నిచ్చి కట్టబెడతాను" అంటున్నాడు.

నాన్నను చూస్తే నాకు వళ్ళు మండిపోయింది. ఇంత జరిగినా ఇంకా తన పట్టు విడవకుండా, నన్ను చక్రవర్తికే కట్టబెడతాననటం, వింటుంటే వళ్ళు మండిపోసాగింది. అయినప్పటికీ నాన్నతో శాంతంగా వాదించాను.

"ఎందుకొచ్చిన గొడవ నాన్నా! ఆ అమ్మాయా బీదపిల్ల. తెలిసో తెలియకో, రుణానుబంధంవల్లో జరిగింది, జరిగిపోయింది. చక్రవర్తి బావకు నచ్చచెప్పి వాళ్ళిద్దరి కాపురం కుదుర్చు" అన్నాను ధైర్యంగా.

"వాడికాపురం నేను కుదిరిస్తే నీకు లైన్ క్లియర్ అవుతుందనా వాగుతున్నావు. మీ అమ్మ తరపు ఆ కులంతక్కువ వాడిని చేసుకుని నా పరువు తీద్దామనుకున్నావా? నా కంఠంలో ప్రాణముండగా అది జరగదు. అదీగాక చక్రిగాడికి నువ్వంటేనే ప్రాణం. జరిగిందానికి వాడు కుమిలిపోతున్నాడు. అసలే వాడి మానసిక పరిస్థితి అంతంతమాత్రం. ఇపుడు మనం కూడా దూరమయితే వాడు బతకడు. ఆ గొడవలన్నీ నేను చూసుకుంటాను. నువ్వు నోరుమూసుకుని చెప్పినట్టు విను" అంటూ కేకలు వేశాడు.

నాకు సహనం చచ్చిపోయింది. "ఏమిటి మీరు చెప్పేది. మొన్నటి దాకా మీరు చెప్పినట్టే అన్నింటికీ సిద్ధమయ్యాను. కానీ ఇప్పుడు జరిగిన పరిస్థితుల దృష్ట్యా అతనితో నా పెళ్ళి జరగదు. అందుకు నేను ఒప్పుకోను. ఎందుకంటే రెండో పెళ్ళివాడిని చేసుకునే ఖర్మ నాకు పట్టలేదు కనుక. ఇంకో ఆడపిల్ల ఉసురు నేను పోసుకోదల్చుకోలేదు కనుక" అన్నాను తీవ్రంగా.

"ఏమిటీ! అతను రెండో పెళ్ళివాడా? నిద్రలో తాళికడితే అది పెళ్ళవుతుందా? ఆ పిల్ల పెళ్ళామవుతుందా? "

"మనసాంప్రదాయం ప్రకారం తాళికడితే పెళ్ళయినట్టే కదా! అందరూ ఆ పిల్లనే ఏలు కోమని... చివరికి జడ్జిగారు కూడా అన్నారు వినలేదా? "

"అంతా ఏదో వాగుతుంటారు. ఎంత డబ్బు ఖర్చుపెట్టయినా సరే ఆ పెళ్ళి రద్దు చేయిస్తాను"

"సరే! మీరీ పెళ్ళి రద్దుచేస్తారు. మళ్ళీ నన్నతడు పెళ్ళిచేసుకున్న తర్వాత, ఏ అర్ధ రాత్రో నడిచి వెళ్ళి, ఇంకో అమ్మాయిని రేప్ చేయటమో, ఇంకేదో చేయటమో చేస్తే? అపుడేం చేస్తారు. ఏం చెయ్యరు. నా చావేదో నన్ను చావమంటారు. నిద్రలో నడకవల్ల తప్పుచేశాడు. సర్దుకో! అంటారు. అంతే కదూ! అంత సహనం నాకు లేదు" అన్నాను దురుసుగా.

"నీ మాటలు వాడిపుడు విన్నాడంటే ఎంత హర్ట్ అవుతాడో తెలుసా? వాడి ఆరోగ్యం ఏమవుతుందో తెలుసా? "

"అలాంటపుడు నాకు నచ్చచెప్పటం మాని అతనికే నచ్చచెప్పండి. హర్ట్ కాకుండా చూడండి! అంతేకానీ అతనేదో అవుతాడని జాలిపడి నా జీవితం నాశనం చేసుకోమం టారా? అతనేమయితే నాకేం. నా జీవితం నా యిష్టం. నాయిష్టమొచ్చిన వాడిని పెళ్ళి చేసుకుని యిష్టమొచ్చిన రీతిలో బతుకు తాను. పెళ్ళి విషయంలో మాత్రం మీరు చెప్పినట్లు వినటానికి సిద్ధంగా లేను" అన్నాను విసురుగా.

"నేను చెప్పినట్టు వినకపోతే తక్షణం నా యింటినించి బయటకు నడు" గర్జించాడు నాన్న.

ఒక్షణం స్టన్నయ్యాను "ఆడపిల్లను పట్టు కుని అంతలేసి మాటలేంటండీ" అంటూ అమ్మ ఏడ్చింది.

"ఇదంతా నీవల్లనే. నీవే దానికి నూరి పోశావు" అంటూ అమ్మను తిట్టి దబదబ బాదాడు. ఆ చర్యతో నాలో ఇంకా తెగింపు వచ్చింది. చక్రవర్తి గలాటా నిశ్చితార్థంరోజు జరగకుండాఉంటే ఆరోజే ఇల్లొదిలి వెళ్ళి ఉంటే ఈయనకు తగిన శాస్తి జరిగుండేది అనిపించింది. అయినా ఇప్పుడు కూడా మునిగిందేమీలేదు అనుకుని సూట్ కేసులో బట్టలు, సర్టిఫికెట్లు సర్దుకున్నాను.

"వెళ్లవే వెళ్ళు! నీచురాలా! కూతురు చచ్చిందని, పిండాలు పెడతాను" అంటూ రంకెలు వేశాడు.

అమ్మ నన్ను అడ్డుకుంది. కానీ 'వ్యక్తిత్వపు ఉనికి పట్టించుకోకుండా అధికార పీఠానికి బలికావాలని నిర్దేశిస్తే ఈ తరం అమ్మా యిలు తలవంచరని నీ భర్తకు చెప్పు' అంటూ గడపదాటి వచ్చేశాను" అంది రాజే శ్వరి.

"వచ్చి ఈ వర్కింగ్ ఉమెన్స్ హాస్టల్ లో చేరాను. ముందు తిండికి మాత్రం సరిపడ ఉద్యోగం దొరికింది. ఆ తర్వాత ఉద్యోగం దొరికింది" అంది రాజేశ్వరి నిట్టూ రుస్తూ.

"మరయితే మురళిని పెళ్ళిచేసుకోవచ్చు కదా! ఇంక ఆలస్యం దేనికీ!"

"అతనికి మంచి ఉద్యోగం... అంటే ఇపుడు చేస్తున్న ఉద్యోగం పర్మినెంటు అవు తేనో... దీనికంటే మంచి ఉద్యోగం దొరికి తేనో తప్ప పెళ్ళిచేసుకోకూడదనుకున్నాము. ఆర్థికంగా నిలదొక్కుకోవాలి కదా! ఉద్యోగాల్లే కుండా పెళ్ళి చేసుకుని సినిమాల్లో హీరోయి న్‌లా కష్టాలు పడటం నావల్ల కాదు"

"మీ సంగతి సరే చక్రవర్తి పరిస్థితేమిటి? అతనెలా ఉన్నాడు? "

"వ్యక్తిగతంగా అతనిమీద ద్వేషంలేదు. ప్రేమలేదు. అతన్ని చూస్తే కాస్త చిరాకని పించినా, అతని ఆరోగ్యం, మానసిక పరి స్థితి గుర్తుకొచ్చి జాలి అనిపించి... చిరాకు నదిమిపెట్టి మామూలుగానే మాట్లాడుతుం టాను. అతన్ని నెమ్మదిగా శశికళ రూట్లోకి

మార్చటమెలా అని ఆలోచిస్తున్నాను"

"అతను నిన్ను గాఢంగా ప్రేమించాడు కదా! ఆమె రూట్లో కెలావెళతాడు"

"ప్రేమకంటే తాళి గొప్పది. తెలుగు సినిమాలు చూడటం లేదా? "

"తాళికంటే ప్రేమ గొప్పదని కూడా చూపిస్తున్నారు కదా!"

"నువ్వు నోరుముయ్యి!" గయ్యిమంది రాజేశ్వరి.

★ ★ ★

"ఇంచుమించు అపూర్వ చింతామణి లెవిల్లో ఆలోచిస్తున్నట్టున్నావ్" అన్నాడు మురళి.

"అలాంటిదే కానీ అపూర్వ చింతామణి తలలు నరికి చరిత్రకెక్కింది. మనం నిస్సహాయులైన జంటలను కలిపి బతికిస్తాం" అంది రాజి.

"అసలీ ఆలోచన ఎందుకొచ్చింది? " అడిగింది విజయ.

"ఇప్పుడున్న ఉద్యోగానికి రాజీనామా ఇచ్చెయ్యాలంటున్నావు. మరి పుడ్డు సంగతెలా? " మురళి ప్రశ్న.

"ఇందులో సభ్యులెంతమంది ఉంటారు మేడం గారూ! మగవాళ్ళకు ప్రవేశం ఉందా? " చందూ ప్రశ్న.

"ఇందుకోసం ఆఫీసు పెట్టాలిగా ఓ పెద్ద భవంతి చూడమంటావా? "

"ఆగండాగండి. అందరి ప్రశ్నలకు నింపాదిగా జవాబు చెబుతాను వినండి" అంటూ మొదలుపెట్టింది రాజేశ్వరి.

"ఓ పదిరోజులక్రితం లైబ్రరీకెళ్ళాను. అందులో నా దృష్టి నాకర్షించినదేమిటంటే దినపత్రికల్లో అమ్మాయిల పెళ్ళిళ్ళకోసం, అంటే వరుడు కావలెను, పెళ్ళి పల్లకి, పెళ్ళి మండపం... కళ్యాణ ప్రాప్తిరస్తు... అంటూ ఓ ఫుల్ పేజీ అంతా ప్రకటనలే. అందులో వరుడు కావలెనంటూ ఇచ్చిన ప్రకటనలెక్కువగా ఉన్నాయి. అంతో ఇంతో ఆర్థికస్తోమతు ఉండి, చదువు, అందం ఉన్న అమ్మాయిలకే పెళ్ళిళ్ళు కావటంలేదని తెలుస్తోంది. ఇంక, నిస్సహాయులు, ప్రేమించుకుని పెళ్ళి చేసుకోలేక, పెద్దలు అంగీకరించక... లేచిపోయి బాధలుపడటమో... ఆత్మహత్యలకు పాల్పడటమో చేస్తున్నారు. అది తెలిసిందే కదా. ఉదాహరణకు నేను. నేనున్న పరిస్థితిలో ఇంకో అమ్మాయి... అంటే ధైర్యంలేని ఏ అమ్మాయి ఉన్నా ఈ పాటికి ఆత్మహత్య చేసుకుని ఉండేది. లేదా తల వంచబడి, అలా బలి అయిపోయి జీవితం దుర్భరం చేసుకునేది. అంతెందుకు విజయస్థానంలో మరో బేల ఉంటే ఏం జరిగేది? తల్లిదండ్రులు పోట్లాడి పిల్లల్ని గాలికి వదిలేస్తే ఏం జరిగుండేది? అందులోనూ ఆడపిల్లల సంగతేంటి? వాళ్ళ పెళ్ళి ఎలా అవుతుంది? ఇలా మనలాంటి నిర్భాగ్యులు ఎంతోమంది ఉన్నారు"

"అయితే వాళ్ళందరికీ పెళ్ళిళ్ళు చేయటం మనవల్లనవుతుందా? " అంది మధ్యలో విజయ.

"అందరికీ చెయ్యగలమోలేదో కానీ కొందరికైనా అంటే... మనల్ని ఆశ్రయించిన వారికి పెళ్ళిచేసి పంపాలని నా కోరిక"

"ఆడాళ్ళం మన చేతనేమవుతుంది? "

"అదే! అదే! ఆ నిరుత్సాహమే వద్దంటాను. ఇదిగో ఇలా చూడు ఈ పేపర్లో ప్రకటన. కేవలం మహిళలే నిర్వహిస్తున్న పెళ్ళి వేదిక. చూశావా? " అంది రాజి పేపరు కట్టింగ్ చూపిస్తూ.

"ఆల్ రెడీ ఓ మహిళా సంస్థ పెళ్ళిళ్ళు చేస్తామంటూ పూనుకుందికదా! మళ్ళీ మనమెందుకు? మనం కూడా వాళ్ళనే ఆశ్రయిస్తే పోలా" నవ్వింది విజయ.

"నోరుముయ్యి! మనం ఆ మహిళా సంస్థకు పోటీగా పెళ్ళిళ్ళు జరిపిస్తామనటం లేదు. వాళ్ళు అన్ని కులాలవారికి అంటే ఏ కులంలో అమ్మాయికి ఆ కులంలోనే అబ్బాయిని చూసి, కట్నకానుకల మధ్యవర్తిత్వం వహించి సంబంధాలు సెటిల్ చేసి పెడుతు

న్నారు. కానీ మన పద్ధతి అది కాదు"

"మరేంటమ్మా!" చందూ వెటకారంగా అడిగాడు.

"ఈ పాంఫ్లెట్ చదువు నీకే తెలుస్తుంది'

"అయ్యబాబోయ్! పాంఫ్లెట్స్ కూడా వేయించావా? ఏదీ ఏదీ చదవనీ" ఆత్రంగా తలోటి తీసుకుని చదివారు.

## పాణిగ్రహణం...

"ఆదర్శ యువతీ యువకులకిదే మా ఆహ్వానం"

"ప్రేమికులారా తరలిరండి"

"మీ ప్రేమను పెద్దలు అంగీకరించడం లేదా?"

"మీ కులాలు, అంతస్థులు అడ్డు వస్తున్నాయా?"

"కలిసి ఆత్మహత్య చేసుకోవాలనుకుంటున్నారా?"

"వద్దు! తొందరపడద్దు. ఒక్కసారి మా 'పాణిగ్రహణం' ఆఫీసుకు విచ్చేయండి. మీ సమస్యలకు పరిష్కారం చూపి... అన్ని రిస్కులు మేం తీసుకుని మిమ్మల్ని జంటగా కలిపి పంపిస్తాం"

నోట్: ఈ పాణిగ్రహణం ఆఫీసులో ఉద్యోగం చేయాలనుకునేవారు, ఉత్సాహం ఉన్న యువతులు వచ్చి సంప్రదించగలరు.

"అయితే ప్రేమించుకున్నవారికి పెళ్ళిళ్ళు జరిపిస్తావన్నమాట. సరే, వాళ్ళు అంత ధైర్యంగా వస్తారంటావా?" అన్నాడు మురళి.

"అది తర్వాత గానీ, ఇంతకీ ఈ ఆఫీసు ఎక్కడ పెట్టావు తల్లీ"

"ఇక్కడికి దగ్గరే, పాంఫ్లెట్ లో అడ్రసుంది చూడు. మీరన్నట్టు పెద్ద భవంతి కాదు. రెండు గదుల ఇల్లు. ఇంటిపైన ఓ పెద్ద బోర్డు. ఆఫీసులో ఓ పదికుర్చీలు, ఓ టేబుల్, ఓ పుస్తకం, పెన్ను, ప్రస్తుతానికింతే"

"అది సరే, పెళ్ళిళ్ళు చేయించినదానికి ఋణమో పణమో కమీషను లాంటిదేమైనా... కనీసం... ఇంటద్దయినా కావాలి కదా" మురళి నసుగుతున్నాడు.

"కమీషను, ఆదాయం... మన దగ్గరకొచ్చే ప్రేమికుల ఆర్థిక స్థోమతను బట్టి ఉంటుంది"

"ఇంతకీ పెళ్ళిళ్ళు చేయించడమెక్కడ?" అడిగాడు చందూ.

"అది కూడా వారి ఆర్థిక స్థోమతను బట్టే. వారివారి పెద్దవాళ్ళవైపునుంచి ఇబ్బందులు లేకుండా అన్నీ పకడ్బందీగా ఉండేలా పెళ్ళి చేసేస్తాం! అంతేకానీ... ఖర్చులన్నీ మనం పెట్టుకుంటామని కాదు. వారివారి ఆర్థిక స్థోమతను బట్టి కళ్యాణమండపంలో జరగచ్చు, గుడిలో జరగచ్చు, అదీ ఖర్చునుకునే వాళ్ళకు పాణిగ్రహణం ఆఫీసులో దండలు మార్పించి, రిజిస్ట్రాఫీసులో సంతకాల పెళ్ళీ జరగచ్చు" అంది రాజి.

"పకడ్బందీగా... రిస్కులు తీసుకుని అంటున్నావు. మనతో అవుతుందంటావా? మన సమస్యలు పరిష్కరించుకోవడానికే మెదడు పని చేయక చస్తున్నాం. ఎందుకొచ్చిన గొడవ చెప్పు. ఊళ్ళోవాళ్ళ సమస్యలు, పెళ్ళిళ్ళు మనకెందుకు రాజీ. పెళ్ళిళ్ళంటే ఆషామాషీ వ్యవహారం కాదు. నూరు అబద్ధాలాడి ఒక్క పెళ్ళి జరిపించాలన్నారు. అంటే... అంటే... మనం... రోజుకు ఎన్ని అబద్ధాలాడాలో... మనతో అవుతుందంటావా... అభాసు పాలవుతామేమో. ఆలోచించు" అంది విజయ.

"దొంగ పెళ్ళిళ్ళు చేయిస్తుంటే అబద్ధాలాడవలసి ఉంటుంది. మన దగ్గరికి ఆల్ రెడీ ప్రేమికులైనవారే కదా వస్తారు. ఇంక అబద్ధాలతో పనేం ఉంటుంది"

"ప్రేమికుల పెద్దవాళ్ళు అంటే మీ నాన్న లాంటివాళ్ళు పాణిగ్రహణం ఆఫీసుమీదకు దాడిచేసి "లక్షల కట్నం పలికే నా సుపుత్రుడిని బికారికి కట్టబెడతావా?" అని చావగొట్టిపోతారేమో! ఎందుకైనా మంచిది కరాటే నేర్చుకోండి" అన్నాడు మురళి నవ్వుతూ.

"ఇలాంటివన్నీ ఊహించే పాణిగ్రహణం ఆఫీసు సభ్యురాళ్ళుగా ఒక లేడీ యస్.ఐ.ని, ఒక లేడీ లాయర్ని కూడా ఉంచుతున్నాను"

"వాళ్ళనెక్కడినుంచి పట్టుకొచ్చావు? " చందూ ప్రశ్న.

"ఎక్కడినుంచీ పట్టుకురాలేదు. వాళ్ళిద్దరూ నా స్నేహితులే. నా ఆలోచనను వారితో చెప్పగానే ఉత్సాహంగా ముందుకొచ్చి తమ వంతు కర్తవ్యం నెరవేరుస్తామని హామీ ఇచ్చారు" అంది రాజి.

"అసలు ఈ ఆలోచన... అంటే... ఇలా ఊళ్ళోవాళ్ళందరికీ పెళ్ళిళ్ళు చెయ్యాలన్న ఆలోచన ఎప్పుడు పుట్టింది నీకు? " చందూ ప్రశ్న.

"నా పెళ్ళి నిశ్చితార్థం ఆగిపోయినపుడు. నాన్నతో పోట్లాడినపుడు. అపుడు పడిన టెన్షన్‌లోంచి పుట్టిందీ ఆలోచన. నాలాంటివారు ఇంకెందరో కదా ఇలాంటి బాధలు పడేది అనిపించి అప్పుడే నిర్ణయం తీసుకున్నాను. ఇప్పుడు అమలు జరపబోతున్నాను"

"సరే, మీ ఆఫీసులో అంతా ఆడాళ్ళేనా? మాకూ పార్ట్‌టైం జాబ్ లాంటిదేమైనా ఇస్తారా? అసలు మమ్మల్ని మీ ఆఫీసు గుమ్మం తొక్కనిస్తారా? " అడిగాడు మురళి.

"మగాళ్ళ ప్రసక్తిలేదు. ఏదో చిన్ననాటి స్నేహితులు కదాని మీకుపార్ట్ టైం జాబ్ ఇచ్చామనుకో. చిన్నపని అయినా, పెద్దపని అయినా మేం... మగాళ్ళంలేనిది మీ ఆడంగుల చేతనేమవుతుంది అని మా దగ్గర కాలరెగరేసుకుని మాట్లాడి, బయటకూడా అదే ప్రచారం చేస్తారు. మగాళ్ళ సంగతి మాకు తెలీదా? కష్టమో, సుఖమో, టెన్షనో మా బాధలు మేమే పడతాం. అలా చేస్తే మాకు కాస్త తృప్తిగానయినా ఉంటుంది" అంది రాజి.

"ఓహో! వీళ్ళు గిన్నిస్‌బుక్‌లోకెక్కాలనుకుంటున్నారు మురళీ!" అన్నాడు చందూ.

"ఎక్కనీ! అదీ మనకు గర్వకారణమే కదా! పోనీ మీ ఆఫీసుకు ఫ్రెండ్సుగా ఎప్పుడైనా రావచ్చా? " చందూ ప్రశ్నించాడు.

"రావచ్చు.. కానీ త్వరగా వెళ్ళిపోతుండాలి. మమ్మల్ని డిస్టర్బ్ చేయకూడదు" అంది విజయ.

"అబ్బో! మరీ ఇన్ని నిబంధనలా? సరే... సరే... ఆ పాంప్లెట్సు ఇటు ఇవ్వండి. ఉడతాభక్తిగా వాటిని పంచే కార్యక్రమం చూస్తాం" అన్నాడు మురళి.

"అక్కర్లేదు. అన్ని న్యూస్ పేపర్లలో పెట్టి పంపించే ఏర్పాట్లు చేశాం. అదేకాక పేపర్లో కూడా ప్రకటన వేయించాం. మీరేం మాకోసం శ్రమపడక్కర్లేదు" అంది రాజి.

"అలాగా, ఇంకెందుకు మనమిక్కడ వెడదాంపద" అన్నాడు మురళి చందూనుద్దేశించి.

"వెళ్ళొస్తాం శ్రీ రాజరాజేశ్వరీదేవిగారూ, సర్వేజనా పాణిగ్రహణ ప్రాప్తిరస్తు!" అంటూ ఫోజిచ్చి నిలబడిన చందూను చూసి నవ్వేశారు రాజి, విజయ.



"ప్రియమైన రాజీకి రమ వ్రాయు ఉత్తరం. అన్నయ్య పెళ్ళికి నువ్వు వస్తావని ఎదురుచూశాను. అంత బిజీ ఏమిటో నాకర్థంకాలేదు. నీమీద కోపం కూడా వచ్చింది.

"అన్నయ్య పెళ్ళి అని నేనెంత సంబరపడ్డానో తెలుసా? నెల రోజులముందే

బట్టలు, మేకప్ సామాను అంతా రెండేసి సెట్లు కొన్నాను. వదినకొకటి, నాకొకటి అన్నట్టుగా. వదినగాకంటే నాకో మంచి స్నేహితురాలు రాబోతోందని మురిసిపోయాను. ఎందుకంటే ఆ అమ్మాయి నా ఈడుదే కాబట్టి నన్నర్థం చేసుకుంటుంది అనుకున్నాను.

"కానీ ఆ అమ్మాయి మనస్తత్వం నేనూహించినట్టుగాలేదు. మొదటి మాటల్లోనే నన్ను దూరంగా పెట్టింది. అయినా నేను మొదట్లో పట్టించుకోలేదు. ఒక తల్లి రక్తం పంచుకుపుట్టిన బిడ్డలే పొందిగ్గా ఉండరు. ఎక్కడో పుట్టి ఒక్కసారిగా మన ఇంటికి వచ్చి నిమిషాల్లో, గంటల్లో మనతో అడ్జస్ట్ అయిపోవాలంటే కష్టం. టైం పడుతుంది అని నన్ను నేను ఊరడించుకున్నాను.

"అన్నయ్య పెళ్ళయి నెలరోజులయ్యింది. వదిన మా నాన్నగారితో మాత్రం ఫ్రీగా మాట్లాడుతుంది. నాతో అమ్మతోమాత్రం... ఆచితూచి మాట్లాడుతుంది. అత్తగారు, ఆడపడుచంటే భయం కాబోలుననుకుని అమ్మ, నేను నవ్వుకున్నాం. కానీ అది భయం కాదని త్వరలోనే తెలిసిపోయింది.

ఓరోజు నాన్న తరపు బంధువుల్లో నన్ను చూసుకోటానికి పెళ్ళి వారొస్తున్నారని నాన్న చెప్పారు.

పెళ్ళి చూపుల్లో ఫలహారాలు అందించే కార్యక్రమంలో వదిన అటూఇటూ తిరుగుతూ పనులు చేస్తోంది.

నన్ను వాళ్ళ ఎదురుగా కూర్చోపెట్టారు. పరిచయాల కార్యక్రమం మొదలయింది.

"ఈ అమ్మాయి మా కోడలు" అంటూ నాన్నగారు వదిన్ని చూపించి వారికి పరిచయం చేశారు.

"అలాగా! పుట్టిల్లు ఏ ఊరు? ఎవరి అమ్మాయి" అంటూ అడిగారు.

ఆ అడగటంలో తప్పేం ఉందో నాకర్థంకాలేదు. "మా ఊరు తిరుపతి. మా నాన్నగారి పేరు సుబ్బరాయశర్మగారు. మా గోత్రం కౌండిన్యస, చాలా... వివరాలు ఇంకా కావాలా? అన్నట్టు మా అమ్మగారిదీ, నాన్నగారిదీ ఒకేకులం!" అంటూ దురుసుగా జవాబిచ్చి అక్కడినుంచి వెళ్ళిపోయింది, వదిన!

అందరం అవాక్కయిపోయాం, "మీ కోడలి పిల్లకు కాస్త కోపమెక్కువున్నట్టుందే. ఎలా భరిస్తున్నారు" అంటూ వాళ్ళలో ఓ ముసలాయన మొహంమీదే అనేశాడు. అందరి మనసులూ వికలమయ్యాయి. ఉత్తరం రాస్తామంటూ వెళ్ళిపోయారు.

నాన్నగారికి వదినమీద చాలా కోపం వచ్చింది. "ఏమిటమ్మాయ్, నువ్వు చేసిన పని. చదువుకున్న దానివని, సంస్కారం తెలిసుంటుంది, మంచి కులం, సంప్రదాయం గల అమ్మాయివనుకున్నానుకానీ, ఇంత మొరటుగా ప్రవర్తిస్తావనుకోలేదు. మన పిల్లను వాళ్ళింటికి పంపాలనుకుంటున్నప్పుడు కాస్త వినయ విధేయతలక్కర్లేదా? మాట్లాడ్డం వస్తుంది కదాని, ఎంత మాటంటే అంత అనెయ్యటమేనా? " అని దండించినట్టు మాట్లాడారు.

"నేను వాళ్ళ దగ్గర వినయంగా ఉండటమేమిటి? ఎవరమ్మాయినని వ్యంగ్యంగా అడుగుతారా? నిప్పులు కడిగే వంశంనుంచి వచ్చినదాన్ని. నాతో పెట్టుకుంటారేం? అణిగిమణిగి ఉండడానికి నేనేం కులం తక్కువదాన్నా? లేక మీ అమ్మాయిలాగా రెండుకులాలకు పుట్టినదాన్ననుకున్నారా? నాకు వళ్ళు మండిపోతే ఎలా మాట్లాడతానో, నాకే తెలియదు" అంది.

నాన్న నోటమాట రాలేదు. అమ్మకూ, నాకూ కూడా చాలాకోపం వచ్చింది.

"నిన్ను వాళ్ళు కులమడిగారా? కులాల ప్రసక్తి ఎందుకు తీసుకొచ్చావు? " అంది అమ్మ కోపంగా.

"ఈ ఇంట్లో రెండు కులాలున్నాయికదా! నేనూ ఇంకో కులందాన్నో లేక మీలాగా లేచి వచ్చిన బాపతోనని, వాళ్ళనుకోకముందే చెప్పాను తప్పేమిటి? " అంది వదిన విసు

రుగా.

అమ్మ కోపం ఆపుకోలేక చెంప ఛెళ్ళుమనిపించింది. అంతవరకూ ప్రేక్షకుడిలాగా ఉన్న అన్నయ్య ముందుకొచ్చి "ఏమిటమ్మా, అంత నీచంగా చెయ్యి చేసుకుంటావు?" అన్నాడు మీదిమీదికొస్తూ కొట్టేవాడిలాగా.

"నీ పెళ్ళాం నీచంగా మాట్లాడగాలేనిది, నేను చెయ్యి చేసుకుంటే నీచమైందా వెధవా?" అంది గట్టిగా అరుస్తూ అమ్మ.

"అదిప్పుడేం తప్పు మాట్లాడింది? ఉన్న మాటేగా అంది" అన్నాడు.

"ఏంట్రా, ఉన్నమాట? నన్ను లేచి వచ్చిన బాపతంటుందా? ఏం చూసిందది. మేం ప్రేమించుకుని పెద్దలనొప్పించి మరీ పెళ్ళి చేసుకున్నాం. అయినా నా తెలివితక్కువ కానీ, నీకు సంజాయిషీ చెప్పడమేమిటి. ఆడంగి వెధవ్వి. నిన్నగాక మొన్న వచ్చిన ఈ పనికిమాలినది నన్ను వేలెత్తి చూపిస్తుందా? ఎవరిచ్చారు దానికంత అధికారం. దానికి వంతపాడి కన్నతల్లిని కించపరుస్తావా? వెధవా? ముందు నా యింట్లోంచి వెళ్ళిపోండి. మీరిక్కడినుంచి ఓ గంటలోగా ఖాళీ చెయ్యకపోతే కిరసనాయిలు పోసుకుని నిప్పంటించుకుని చస్తాను జాగ్రత్త..." అంటూ పెద్దగా అరుస్తూ ఏడిచింది.

అమ్మ అంతలా ఆవేశపడడం ఎప్పుడూ చూడలేదు. బహుశా నాన్నగారు కూడా అమ్మని ఆ స్థితిలో ఎప్పుడూ చూడలేదేమో, అమ్మ కేమయినా అవుతుందేమోనన్నట్టు ఆమెను శాంతింపచేయబోయారు.

అన్నయ్య, వదిన అప్పటికప్పుడు బట్టలు సర్దుకుని వెళ్ళిపోయారు.

అన్నయ్య వెళ్ళబోతూ కూడా, "అత్తగా ఎలా మసలుకోవాలో తెలీదు. కనీసం తల్లిగా ఎలా లేచిపోవాలో నేర్పించి, నాన్న బరువు దించు" అంటూ శూలాల్లాంటి మాటలన్నాడు.

అంతవరకూ సహనంగా ఉన్న నేను, వాడితో కలియబడి చొక్కా పట్టుకుని నిలదీసి, చెంపలు వాయగొట్టాను. వాడూ నన్ను కొట్టాడు. బూతులు తిట్టుకున్నాం. అమ్మ, నాన్న వచ్చి మమ్మల్ని విడిపించారు.

అన్నయ్య, వదిన వెళ్ళిపోయారు. ఆ షాక్‌నుంచి ఇంకా తేరుకోకముందే అన్నయ్య స్నేహితుల ద్వారా ఇంకో షాక్ న్యూస్ తెలిసింది.

నా పెళ్ళి కావటం కష్టమనీ, ఎక్కువ కట్నం గుమ్మరించాల్సి వస్తుందనీ, అన్నయ్యగా తన వంతు సాయం చెయ్యాల్సి ఉంటుంది కాబట్టి, ఏదో ఒక గొడవ పెట్టుకుని ఇంట్లోంచి వెళ్ళిపోతే, ఏ పీడా ఉండదనీ, ఇలా ప్లాన్ చేసి వెళ్ళిపోయారని తెలిసింది.

అది తెలిశాక అమ్మ ఇంకా బాధపడింది. అలా రోజుల తరబడి ఏడుస్తూనే వుంది. నేను మాత్రం మామూలుగా ఉన్నాను.

అన్నయ్య ట్రాన్స్‌ఫర్ చేయించుకుని ఆ ఊరినుంచే వెళ్ళిపోయాడని తెలిసింది. ఆ విషయం తెలిసి అమ్మానాన్న మనసెలా ఉందో నాకయితే తెలీదుకానీ, నాకు మాత్రం పీడాపోయింది అనిపించింది.

భారంగా రోజులు గడుస్తున్నాయి. నీ ఉత్తరం కోసం ఎదురుచూస్తూ,

నీ

రమ"

★ ★ ★

ఆరోజు నారాయణరావు ఇంటికొచ్చేసరికి శకుంతలమ్మ చందూని బతిమిలాడుతూ కనిపించింది.

"నాన్నా చందూ... ఉదయంనుంచి ఏమీ తినకుండా అలా ఉన్నావేంట్రా, కాస్త ఎంగిలి పడు కన్నా"

"నాకాకలిలేదమ్మా, నన్ను విసిగించకు" అన్నాడు చందూ.

"నీరసమొస్తుంది నాన్నా! కాస్త తినమ్మా. నా తండ్రివి కదూ?"

"నా మనసు బాగాలేదు నన్నొదిలెయ్యమ్మా"

"ఏమైందిరా ఉద్యోగం గురించేనా నీ దిగులు. అన్నం మానేస్తే ఉద్యోగం వస్తుందా? దాని టైం వస్తే అదే వస్తుంది"

"ఛ... ఉద్యోగం గురించి కాదులేవే"

"మరింకేంట్రా?"

"దీన్నిగురించి" అంటూ ఓ చేతిరుమాలు చూపించాడు చందూ.

"ఏంటిది. ఈ కర్చీఫ్ గురించి దిగులేమిట్రా. అయినా ఇంత పాత కర్చీఫ్ నీకెక్కడిది?"

"ఈ కర్చీఫ్ నా ప్రేమికురాలిది" శూన్యంలోకి చూస్తూ అన్నాడు చందూ.

"ఆ...!" నోరు తెరిచింది శకుంతలమ్మ ఆశ్చర్యంగా.

అంతవరకూ తలుపవతల ఉండి తల్లీకొడుకుల సంభాషణ వింటున్న నారాయణరావు లోపలికొచ్చాడు.

"ఏంట్రా కూశావు. తాడూపేడూ లేని వెధవా? నీకొక ప్రేమికురాలా? ఈ కర్చీఫు నీ ప్రేమికురాలిదా? ఇండియాలో ఉన్న దరిద్రమంతా ఈ కర్చీఫ్‌లోనే తాండవిస్తున్నట్టుంది కదరా? కర్చీఫే ఇంత చండాలంగా ఉంటే, దీని ఓనరు ఇంకెంత దరిద్రురాలో ఎవత్తిరా అది? నాలుక చీరేస్తాను జాగ్రత్త" అంటూ రంకెలేశాడు.

"నాన్నా, నన్నేమయినా అనండి పడతాను. నా లవ్వర్‌నంటే ఊరుకునేదిలేదు" సీరియస్‌గా అన్నాడు చందూ.

"పైసాకు ఠికాణా లేదుకదరా నీకూ ప్రేమలూ, ప్రేమికురాండ్రూ కావల్సి వచ్చారంట్రా?"

"మీరు కూడా నిరుద్యోగిగా ఉన్నప్పుడే అమ్మను ప్రేమించానని చెప్పారు. మీ గతం నాకు తెలుసు. మీ నాన్నగారి డబ్బుతో పాలకోవా కొని తెచ్చేవారుట..."

శకుంతలమ్మ అక్కడినుంచి లేచి వెళ్ళిపోయింది నవ్వును దాచుకుంటూ.

నారాయణరావు తడబడ్డారు. "అ... ఆ... అయితే ఇ... ఇప్పుడేమిటి... దానికీ దీనికి ఏమిటి సంబంధం?"

"సంబంధమెందుకులేదు. 'ఆ తానులోదే ఈ పీసు' అన్నట్టు నేను నీ కొడుకుని. ప్రేమ విషయంలో నిన్ను ఆదర్శంగా తీసుకున్నాను. అలా అని నేను నీలా నాటకాలు, డ్రామాలూ అంటూ మోసం చేసే బాపతు కాదు. మాది గుండెలు పగిలే ప్రేమ. సారీ... గుండెలు... రగిలే ప్రేమ. ఏం, ఏంటలా చూస్తున్నావ్. ఈ పదం కూడా సరికాదా. పోనీ గుండెలు పొంగే ప్రేమ... ఏం... కరెక్టేకదా"

"నీ మొహాన దుప్పటి కప్పా! ప్రేమట... ప్రేమ. కూతే పలకటానికి నోరు సరిగాలేదు వెధవకి. ఇంతకీ ఈ కర్చీఫ్ కథేమిట్రా, చీమలు తిన్న బెల్లం మొహం వెధవా?"

"ఇది నా లవ్వర్ పారేసింది. నేను తెచ్చుకున్నాను"

"పారేసిందీ? ఛీ... ఎక్కడా? చెత్తకుండీలోనా?"

"కాదు. మురిక్కాలువలో. తెచ్చిశుభ్రం చేశా సూపర్ రిన్‌తో"

"ఛీ... చండాలపు వెధవా? ఇపుడు దాన్నేం చెయ్యబోతున్నావురా?"

సంభాషణ పెరిగేకొద్దీ నారాయణరావులో టెన్షన్... బి.పి., కోపం పెరిగిపోయి ఊగిపోతున్నాడు.

"దీనికి డిజైన్స్ కుట్టి కొత్తదానిగా చేసి ఆమెకే ప్రెజెంట్ చెయ్యాలనుకుంటున్నాను"

"అవున్లే! ఇంకోటేదైనా ప్రెజెంట్ చేయటానికి పది రూపాయలు సంపాదించే యోగ్యత కూడా లేదాయె" గుచ్చుకునేలా అన్నాననుకున్నాడు నారాయణరావు.

"నీ మాటలకు రోషమొచ్చి ఉరేసుకుంటాననుకున్నావా? అంత దృశ్యం మన లైఫ్‌లో నేలేదు. నాకు యోగ్యతలేదని ఒప్పుకుంటున్నాను. ఈ పాత కర్చీఫ్‌ని కొత్త కర్చీఫ్‌గా మార్చటానికి అంటే ఈ రంధ్రాలున్న చోట అద్దాలు కుట్టి, రంధ్రాలు లేనిచోట డిజైను చేసి, పూర్తిగా కొత్తదిగా మార్చి ఓ పూలబొ

కేలో పెట్టి ఆమె కందివ్వటానికి సరిగ్గా వెయ్యి రూపాయలవుతుంది. అది నీవు నా తండ్రిగా, ఓ ముసలి ప్రేమికుడిగా నాకిచ్చుకోవాలి" అన్నాడు చందూ.

"పళ్లు రాలగొడతాను జాగ్రత్త!"

"ఏం ఇవ్వవా నాన్నా! డాడీ! నాది పవిత్ర ప్రేమ డాడీ! నీలాగా ఫ్రెండ్సుకోసం, డబ్బు కోసం పందెంవేసుకుని తాళికట్టే కపటప్రేమ కాదు నాన్నా! నిజం డాడీ! నన్ను నమ్ము" అంటూ నాటకఫక్కీలో మాట్లాడి "అందమైన ఓ నా ప్రేమరాణీ... లాలలాలలా... నీ చిల్లుల కర్చీఫు కూడా చిత్రమేలే" అంటూ రాగయుక్తంగా పాడుతూ కర్చీఫును ముద్దాడుతూ తన గదిలోకెళ్ళిపోయాడు చందూ.

"ఛీ! వెధవాని వెధవ!" కొడుకుని తిట్టుకుంటుండగానే, అతడి మెదడులో ఏదో ఆలోచన వచ్చింది.

గబగబ భార్య శకుంతలమ్మ గది ముందుకొచ్చి నిలబడి తలుపు తట్టాడు.

ఆవిడ తలుపు తీసి ఏమిటన్నట్టు చూసింది.

"ఏమిటీ నన్ను సాధించటానికి వాడిని పావుగా ఉపయోగించుకుంటున్నావా? మన ప్రేమ కథంతా 'ఏ టు జడ్' వాడికి చెప్పేశావా? " ఉరిమాడు నారాయణరావు.

"ఏమిటీ మన ప్రేమ కథా! మన మధ్య ప్రేమ... దానికో కథ కూడానా? ఆ పురాణాన్ని సిగ్గులేక కొడుక్కి చెప్పుకోవటం కూడానా? జయదేవుడు తాటాకులమీద అష్టపదులు రాసుకున్నట్టు డైరీలు రాసుకుంటావుగా. వాటన్నిటినీ మొన్నోరోజు నువ్వు ఊళ్లో లేనప్పుడు కంఠతా పట్టినట్టున్నాడు" అంది శకుంతలమ్మ విసుగ్గా మొహంపెట్టి.

"ఒకరి డైరీలు మరొకరు చదవకూడదన్న ఇంగితజ్ఞానం తల్లిగా నేర్పించే బాధ్యతలేదా నీకు"

"మొదటినించి నా జీవితంలో అన్నీ సవ్యంగా... ప్రేమ... పెళ్ళి... నాటకీయంగా కాకుండా... నిజం ప్రేమ... నిజం... పెళ్ళి... ఇలా అన్నీ సవ్యంగా జరిగుంటే... మనస్ఫూర్తిగా బాధ్యతగా కొడుకుని పెంచేదాన్నేమో. నీమీద నేనెలాగూ కక్షతీర్చుకోలేకపోయాను. వాడి ద్వారా నా కక్ష తీరుతోంది. చేతనైతే వాడిని నీకనుగుణంగా మార్చుకో. లేకుంటే ఖర్మ అని అనుభవించు" అంటూ దబ్బున మొహాన్నే తలుపేసింది శకుంతలమ్మ.

చందూ చెప్పినదంతా విని పకపక నవ్వింది విజయ.

"నిర్వాకం చేశావులేకానీ, ఇంతకీ ఆ కన్నాల కర్చీఫ్ లవ్వరు ఎవరు తండ్రీ" అడిగింది రాజేశ్వరి.

"ఏమో! తెలీదు. మీరిద్దరు మాత్రం కాదు"

"అంత చండాలపు కర్చీఫ్‌లు మా దగ్గర దానం చేద్దామన్నా లేవుగానీ ఆ అమ్మాయెవరో చెబుదూ" అడిగింది విజయ.

"ఉడుక్కుంటున్నారా? నా కలలరాణి... ఇంతవరకూ ఆమెను చూడలేదు. సౌందర్యలహరి...స్వప్నసుందరి"

"అమ్మో! పాటందుకున్నాడు. పారిపోదాంపద" అంటూ లేచి వెళ్ళారు విజయ, రాజేశ్వరి!

★ ★ ★

ఆరోజు సాయంత్రం 'పాణిగ్రహణం' ఆఫీసులో రాజేశ్వరి, విజయలతోపాటు మరో నలుగురమ్మాయిలు తలోపనీ చేసుకుంటున్నారు.

ఆరోజు పోస్టులో వచ్చిన వధూవరుల వివరాలు కొందరు చదువుతున్నారు. ఇంకో అమ్మాయి ఆ వధూవరుల వివరాలన్నీ ఫైల్లోకెక్కిస్తోంది.

మనం ప్రేమించుకొన్న వారికి మాత్రమే వివాహాలు చేస్తామని కదా ప్రకటన ఇచ్చాం. పాంప్లెట్లు వేయించాం! మరి ఇదేమిటీ, మా అమ్మాయి వివరాలివి, మాకులం ఇది... మాగోత్రం ఇది... అంటూ వరుణ్ణి

వెతకకండంటూ ఇలా ఉత్తరాలు రాస్తు న్నారు. ఈ పాఠకులకు, ప్రకటనలు కూడా అర్థంచేసుకోవటం రాదా ఏమిటి? " అంది విజయ.

"బహుశా ప్రేమించటానికి వరుణ్ణి వెతక మనేమో" అంది కమల. కిసుక్కున నవ్వారు మిగతా స్టాఫు.

"తప్పు! అలా కించపరచి మాట్లాడవద్దు. ఈ దేశంలో రకరకాల కారణాలవల్ల పెళ్ళి కాని ఆడపిల్లలు కోకొల్లలు... వారి తల్లిదం డ్రుల బాధలు వర్ణనాతీతం. ఇక్కడున్న మనందరమూకూడా అలాంటి బాధలనుభ విస్తున్న వాళ్ళమే. పాణిగ్రహణం వివా హాలు... అనగానే తల్లిదండ్రులకు ఏదో ఆశ ఓ రాయి విసిరి చూద్దాం. ఈ చోట నైనా అమ్మాయికి వరుడు దొరకొచ్చునేమో నన్న భావంతో వారివారి వివరాలు తెలు పుతూ రాసుంటారు. అయినా ప్రేమ పెళ్ళిళ్లే కాక ఇలా మామూలు పెళ్ళిళ్ళు కూడా జరిపిస్తేనేం. థ్రిల్లుంటుంది గదా"

రాజేశ్వరి అంటుండగానే కాలింగ్‌బెల్ మోగింది.

"కమిన్" అంది విజయ.

ఓ యువకుడు లోపలికొచ్చాడు. అతను చాలా అందంగా ఠీవిగా ఉన్నాడు. "నా పేరు సారథి" అంటూ తననుతాను పరి చయం చేసుకుంటుండగానే "కూర్చోండి" అంటూ కుర్చీ చూపించింది విజయ.

"చెప్పండి" అంది రాజేశ్వరి.

"మీరీ పెళ్ళిళ్ళన్నీ రిజిస్ట్రాఫీసులోనే చేయి స్తున్నారా? " అడిగాడతను.

"అవును... అదే కదా భద్రత"

"ప్రేమికులు వారంతటవారే పెళ్ళి రిజిస్ట్రా ఫీసులో పెళ్ళి చేసుకోవచ్చు కదా. మధ్యన ఈ దళారీల తంతు అనవసరం కదా" అన్నాడతను స్వరంలో వ్యంగ్యం ధ్వనిస్తుం డగా.

"చాలామంది యువకులకు ప్రేమించిన పుడున్నంత ధైర్యం పెళ్ళి దగ్గర కొచ్చేసరికి ఉండదు కదా. ధైర్యం నూరిపోసి పెళ్ళి చేయటానికే ఈ దళారీలు" అంది విజయ కూడా వెటకారంగా.

విజయను కళ్లతోనే వారించింది రాజి "ఇంతకీ మీరొచ్చిన పనేమిటో చెప్పండి" అంది.

"నాకూ ఓ పెళ్ళి చేయాలి మీరు!"

"అలాగా. ప్రేమికులన్నమాట" ముఖాన నవ్వు పులుముకుంటూ అంది రాజి.

"వివరాలు చెప్పండి" అంది కమల.

"చెబుతాను. చెప్పేముందు ఓ ప్రశ్న. మీకు ఒక్కో పెళ్ళికి ఎంత కమీషన్ ముడు తుంది" అడిగాడు సారథి.

"వారివారి ఆర్థికస్థితినిబట్టి"

"నేను మీకు కమీషను పదివేలిస్తాను. బహుశా అంత పెద్ద కమీషను మీరు ఇంత వరకు అందుకొని ఉండరు. అవునా" వెకి లిగా నవ్వుతూ అన్నాడు.

"ముందు విషయం చెప్పండి!" సీరియ స్‌గా అంది రాజి.

"నేనో అమ్మాయిని ప్రేమించాను. పెళ్ళి చేసుకోవాలనుకుంటున్నాను. మా యిద్దరికీ పెళ్ళి చేయాలి" ముసిముసిగా నవ్వుతూ అన్నాడతను.

"అలాగా! ఆ అమ్మాయి కూడా మిమ్మల్ని ప్రేమించిందా? "

"సుబ్బరంగా ప్రేమించింది" సిగరెట్టు అంటిస్తూ అన్నాడు.

"సిగరెట్టు ఆర్పేయండి. అలాంటివన్నీ ఇక్కడ కుదరవు" కాస్త కోపంగా అంది విజయ.

"అలాగా! బయట బోర్డుపెట్టి ఉంటే బావుండేది!" అంటూ సిగరెట్టు ఆర్పేశాడు.

"మా పెళ్ళి రిజిస్ట్రాఫీసులో కాకుండా ఈ పాణిగ్రహణం ఆఫీసులోనే దండలు మార్చు కుంటాం" అన్నాడు.

"మా ఆఫీసు నిబంధనల ప్రకారం, ఇక్కడ దండలు మార్చుకున్నా రిజిస్ట్రాఫీ సులో కూడా సంతకాల పెళ్ళి తప్పనిసరి.

ఇంతకీ మీరు రిజిస్ట్రాఫీసులో పెళ్ళి ఎందుకు వద్దంటున్నారో తెలుసుకోవచ్చా? " అడిగింది రాజి.

"నాకింతకుముందే పెళ్ళయింది. ఇద్దరు పిల్లలున్నారు. ఆ సంగతి నేను ప్రేమించిన అమ్మాయికి తెలియదు... అని నేననుకుంటున్నాను. ఒకవేళ తెలిసినా నష్టపోయేదేం లేదనుకోండి. పోతే ఈ అమ్మాయి నచ్చింది. ఆమెకూ నేను నచ్చాను. తన మెడలో తాళికడితే తప్ప పక్కమీదకు రానంటోంది. పోతే పోనీ ఓ లైసెన్సు బిళ్ళ కడితే లైన్‌క్లియర్ అవుతుంది కడతాను రమ్మంటే అక్కడా ఇక్కడా కాదు పాణిగ్రహణం ఆఫీసులోనే తాళికట్టాలంటూ పట్టు బట్టింది. సరేనని నేను మీ దగ్గరకొచ్చాను. తీరా చూస్తే మీరు నిబంధనలూ, గాడిద గుడ్డూ అంటున్నారు. ఓ పదివేలిస్తాను. పెళ్ళి జరిపించండి" అన్నాడు సారథి.

అందరూ మొహాలు చూసుకున్నారు. సైలెన్సు అన్నట్లు చూసింది రాజి.

"ఇద్దరి పెళ్ళాలను పోషించటం మీకు కష్టం కాదా" అనడిగిందతన్ని చాలా మామూలుగా.

"మోజుతీరగానే తన్నితరిమేస్తారా? " తలో ప్రశ్న వేశారు.

"ప్రత్యేకంగా నేను పోషించాల్సిన పని లేదు. గవర్నమెంటుద్యోగం చేస్తోంది. దాని బతుకు అది బతుకుతుంది. అడపాదడపా నాకూ సహాయం చేస్తుంది. మా ఆఫీసులో అందరికీ సెకండ్ సెటప్పులున్నాయి. నా కోరికా ఈవిధంగా తీరుతోంది" అన్నాడు విలాసంగా నవ్వుతూ.

అందరికీ వళ్ళు మండింది. తమాయించుకుని రాజేశ్వరివైపు చూశారు.

"చూడండి సారథిగారూ, మా నిబంధనల ప్రకారం, కాబోయే దంపతులతో విడివిడిగా ఇంటర్వ్యూ చేసి పెళ్ళిచేయటం మా ఆనవాయితీ. ఆవిడను పంపించండి" అంది రాజి.

"అలాగే రేపే టైంకు పంపిస్తాను. పది వేలు కూడా ఆ అమ్మాయితోనే పంపమంటారా? "

"పెళ్ళయ్యాక పంపుదురుగాని"

మరుసటిరోజు ఆ అమ్మాయివచ్చేసరికి యస్. ఐ. గోవర్ధనిని పిలిపించింది రాజేశ్వరి.

ఆ అమ్మాయిరాగానే గోవర్ధని "నీకసలు బుద్ధుందా? నువ్వు ప్రేమించిన వాడికి పెళ్ళయి ఇద్దరు పిల్లలున్నారు తెలుసా? గవర్నమెంటుద్యోగం చేస్తున్నావు. ఇంత కంటే మంచివాడు దొరకలేదా నీకు" అంటూ గదమాయించింది.

"నాకు ముందే తెలుసు మేడం! బాగా ఆలోచించే ఈ నిర్ణయం తీసుకున్నాను. నాకిపుడు ముప్ఫయిరెండేళ్ళు. ముసలితల్లి తప్ప మరో అండలేదు. ఏ కారణంవల్లనైతే నేమీ, వచ్చిన సంబంధాలన్నీ చెడిపోతున్నాయి. నాకూ ఒక తోడు... మగ తోడు... కావాలనిపించింది. పెళ్ళయినవాడైనా ఫర్వాలేదు. మొగుడున్నాడంటే చాలు... ఎంతో కొంత రక్షణ, అందుకే ఈ నిర్ణయం తీసుకున్నాను. ఇందులో అతని తప్పేంలేదు. ఇకపోతే భవిష్యత్తులో "నువ్వు నా పెళ్ళానివి కాదు ఈ పిల్లలు నాకు పుట్టలేదు" అని అతడు ఏకారణంవల్ల నైనా అంటే... నా పిల్లలకు తండ్రిగా చెప్పుకునేందుకు అతడే నా భర్త అని మీరు సాక్ష్యంగా ఉంటారని ఈ పాణిగ్రహణం ఆఫీసులో పెళ్ళి చేసుకోవాలనుకున్నాను" అందా వృద్ధకన్య.

అందరూ గుడ్లప్పగించి చూస్తూ అలా ఉండిపోయారు. ముందుగా రాజేశ్వరి తేరుకుంది.

"చూడమ్మా! నీ సాధకబాధకాలు నీవు వెళ్ళబోసుకున్నావు. బాగుంది. కానీ ఈ పాణిగ్రహణం ఆఫీసు నిబంధనలకు ఇలాంటి పెళ్ళిళ్ళు పూర్తిగా విరుద్ధం. పైగా లీగల్‌గా చెల్లవు కూడా. ఇక నీవు వెళ్ళచ్చు" నిష్కర్షగా చెప్పింది రాజేశ్వరి.

ఆ అమ్మాయి కాళ్ళావేళ్ళాపడి తన పెళ్ళి ఎలాగైనా జరిపించమని ప్రాధేయపడింది. చివరికి యస్.ఐ. గోవర్ధని కలుగచేసుకుని బయటకు తరిమినంత పనిచేసేదాకా వదల్లేదు.



"మే ఐ కమిన్ ప్లీజ్!" కోకిలలాంటి కంఠస్వరం వినగానే అందరూ పనులాపి తల తిప్పి చూశారు.

"రండి!" అంటూ ఆహ్వానించి "కూర్చోండి" అంటూ సీటు చూపించి ఆమెవైపు నఖశిఖపర్యంతం చూసింది రాజి.

నిండా పద్దెనిమిదేళ్ళుంటాయేమో. పసితనంపీడని అందమైన మొహం. మంచి ఎత్తు... సన్నగా, నాజూగ్గా ఉంది. పొడవాటి జడ, సోగకళ్ళు... ఎంతో సింపుల్‌గా అలంకరించుకున్నా ఆర్టిస్టు గీసిన బొమ్మలా ఉంది అనుకుంది.

"చెప్పండి!" అంది రాజేశ్వరి.

"నేనొకతన్ని ప్రేమించాను" అందామ్మాయి.

విజయ, కమల ఒకరినొకరు చూసుకుని ముసిముసిగా నవ్వుకున్నారు. ప్రేమించావు కాబట్టే మమ్మల్ని వెతుక్కుంటూ వచ్చావు అన్న అర్థం గోచరించిందా నవ్వులో.

"అలాగా! అతనేం చేస్తారు? మీ పెద్దవాళ్ళు ఒప్పుకోలేదా? అతనూ మిమ్మల్ని ప్రేమించాడా? మీమీ పెద్దవాళ్ళను ఒప్పించాలా? లేక పెళ్ళయ్యాక మీరే చూసుకుంటారా? " అంది రాజేశ్వరి. అన్ని ప్రశ్నలకు నాన్చకుండా ఒకేసారి జవాబుచెప్పమన్నట్టు.

"ఆయన ఓ గవర్నమెంటు ఆఫీసుద్యోగి. వయసు దాదాపు ముప్ఫయి అయిదేళ్ళుంటాయి. ఇద్దరు పిల్లలున్నారు"

"ఆయనకు భార్యపోయి ఎన్నేళ్ళయింది? " ప్రశ్నించింది రాజి, మనసులో ఏవేవో సందేహాలు తలెత్తగా.

"పోవడమేమిటి? నిక్షేపంలా బతికే ఉంది" అందా అమ్మాయి.

విజయ, కమల మిగతావారు తలపట్టుకున్నారు "ఈరోజు మనం అయిపోయాం" అంది కమల గుసగుసగా.

"మరి! ఆవిడకు ఆరోగ్యం సరిగా లేదా? " ప్రశ్నలు వేస్తూనే ఉంది రాజి.

"అలాంటిదేం లేదుకానీ, ఆవిడతో ఆయనకు విసుగొచ్చిందిట. ఆవిడ గయ్యాళిట. నన్ను ప్రేమించారు. మేమిద్దరం పెళ్ళి చేసుకోవాలనుకున్నాము"

వింటున్న విజయకు వళ్ళుమండిపోయింది. చేస్తున్న పని ఆపి రక్కున లేచి వచ్చి "చూడమ్మా! తల్లీ, ఇక్కడ పవిత్రమైన మనసులతో ప్రేమించుకున్న వారికి మాత్రమే పెళ్ళిళ్ళు చేయబడతాయి. అంతేగానీ ఇలాంటి అక్రమ సంబంధాల కేసులకు పెళ్ళిళ్ళు చేస్తే మేం కాస్తా జైల్లో కూర్చోవాలి వెళ్ళెళ్ళు" అంది కోపంగా.

ఆ అమ్మాయి బిక్కమొహం వేసుకుని రాజేశ్వరివైపు దీనంగా చూసింది. 'నువ్వు శాంతించు' అన్నట్టు విజయవైపు చూసి "చూడమ్మా! నీ పేరేంటన్నావ్! రాణి కదూ! అతనికి భార్య ఉండగా మీ ప్రేమ ఎలా సాగింది? "

"అతను మా యింట్లో అద్దెకుంటున్నాడు. అతని భార్య పుట్టింటికెళ్ళినపుడు నాతో సరదాగా మాట్లాడేవాడు. మా యింట్లో వారికి

తెలియకుండా అతన్ని కలుసుకుని మాట్లాడే దాన్ని.

కానీ, ఎలాంటి పొరపాటు చెయ్యలేదనుకోండి! అన్ని ముచ్చట్లు పెళ్ళయ్యాకే అని చెప్పాను" మునిపంటితో కింది పెదవి కొరుకుతూ సినిమా యాక్టరులా సిగ్గుపడింది.

"అందుకే అతను పెళ్ళికి తొందరపెడుతున్నాడు. తాళిబొట్టు కడితే పెళ్ళయినట్టే కదా ఏ ఊరి బయట గుళ్ళోనో కట్టేస్తానన్నాడు. నేను ఒప్పుకోలేదు. ప్రేమికులకు పెళ్ళిళ్ళు చేస్తామంటున్న మీ ప్రకటన పేపర్లో చదివాను. మా పెళ్ళికి పెద్దలుగా మీరుంటే బావుంటుందనీ... అదీగాక మీరు జరిపిన పెళ్ళిళ్ళు... కొత్త దంపతుల ఫోటోలు పేపర్లో వేయిస్తున్నారు కదా... మా ఫోటో... అదే... మా పెళ్ళి ఫోటో కూడా పేపర్లో రావాలని ముచ్చటగా ఉంది. అదీగాక మరీ దిక్కులేనిదానిలా ఊరిబయట గుళ్ళోపెళ్ళేమిటని ఇక్కడ కొచ్చాను" అంది రాణి.

"అలాగా! మంచి పని చేశావు. ఎలాగో నీ పెళ్ళి జరిపిస్తామనుకో. అతను నీకు వేరే ఇల్లు చూసి సపరేట్ కాపురం పెడతాడటనా? " అడిగింది రాజి.

"వేరే ఇల్లెందుకు? అందరం ఒక ఇంట్లోనే ఉంటాం"

"అదెలా? "

"ఎందుకుండలేము. సినిమాల్లో ఉండటం లేదా? ఒక హీరో ఇద్దరు భార్యలతో కాపురం చేస్తూ... సరదాగా ఉంటుంది కూడా... సినిమాలోలాగా"

అక్కడున్న అందరూ ఒకరి మొహాలొకరు చూసుకున్నారు. ఆ అమ్మాయిమీద సినిమాలు ఎంతగా ప్రభావం చూపిస్తున్నాయో అర్థమైంది. రాజేశ్వరి ఓ అయిదు నిమిషాలు నిశ్శబ్దంగా ఆ అమ్మాయిని పరికించి చూస్తూ అలా ఉండిపోయింది.

"ఏమిటండీ ఆలోచిస్తున్నారు. మీరింకేం ఆలోచించకండి. అనుమానించకండి. ఇదిగో ఇలా చూడండి. ఈ ఉత్తరం చూడండి. ఎంత అందంగా రాశారో చూడండి" అంటూ ఓ ఉత్తరం చూపించింది. ఇతరుల ఉత్తరాలు చదవటం సంస్కారం కాదని తెలిసి వారించినా చదివేదాకా వదల్లేదు ఆ అమ్మాయి. తీరా చదివాక నవ్వాపుకోలేకపోయారంతా. ఆ ఉత్తరంలో ఓ తెలుగు సినిమా పాట రాసుంది. అందులో అందాన్ని వర్ణించే పదాలే ఎక్కువగా ఉన్నాయి.

ఏం చేయాలో నిర్ణయించుకుంది రాజి.

"మా కాపురం చాలా సరదాగా ఉంటుందికదూ" కలల్లో తేలిపోతూ అందా అమ్మాయి.

"ఎన్నాళ్ళు సరదాగా ఉంటారు. పెద్ద భార్యకూ నీకూ పోట్లాటరాదా? "

"పెద్దగా పోట్లాటలేం ఉండవు. పెద్ద భార్యకు కాన్సరొస్తుంది. నా చేతినీ, ఆయన చేతినీ కలిపి ప్రాణాలొదుల్తుంది" అంది బాధ ధ్వనిస్తూ ఆ అమ్మాయి.

నిట్టూర్చింది రాజేశ్వరి. అసలే ఈ వయసు మంచిదికాదు. మంచిదికాని ఈ వయసులో ఏది మంచో ఏది చెడో తెలుసుకోకుండా రెండు గంటల సినిమాను జీవితానికి అన్వయించుకుని ఆకర్షణకు, అదీ క్షణికమైన ఆకర్షణకు ప్రేమ అని పేరు పెట్టుకుని జీవితాన్ని తెగిన గాలిపటంలా చేసుకోబోతున్న ఈ అమ్మాయిని చూసి కోప్పడాలో జాలిపడాలో అర్థంకాలేదు.

"ఇంతకీ ఏమంటారు. మా పాణిగ్రహణం ఆఫీసులో మీ పెళ్ళి జరగాలి అంతేకదూ" అంది రాజి.

"ఖచ్చితంగా అంతేనండి! మీ ఫీజు కూడా ఇచ్చుకుంటాను" అందామె.

"తప్పకుండా మీ పెళ్లి జరిపిస్తాము" అంటున్న రాజీని విజయతో సహా అక్కడున్న స్టాఫంతా గుర్రుగా చూశారు. అందరివైపు చిరునవ్వుతో ఓసారి పరికించి చూసి రాణివైపు తిరిగి "చూడండి మా ఆఫీసులో

పెళ్లంటే ఆషామాషీకాదు. ఒక్కసారి పెళ్లయ్యిందంటే ఆ బ్రహ్మముడిని స్వయంగా బ్రహ్మదేముడు వచ్చినా విప్పలేడు. అలా విప్పకుండానూ, విడిపోకుండాను ఉండటానికి మేము కొన్ని నియమ నిబంధనలను పెట్టాము. అవి మీరు పాటించి మాతో సహకరిస్తే మీ వైవాహిక జీవితం, మూడు సినిమాలు, ఆరు డ్యూయెట్లుగా సాగిపోతుంది"

"మా జీవితం బాగుండాలని మీరు తాపత్రయపడి సలహాలిస్తుంటే మేం మాత్రం కాదంటామా? మీ నియమనిబంధనలేమిటో చెప్పండి" ఉత్సాహంగా ముందుకు వంగి అంది రాణి.

"పూర్వం రాజులకు ఒక్కొక్కరికి పదేసి ఎనిమిదేసి మంది భార్యలుండేవారు. అప్పుడు ఇలా కరవులేదు. బోలెడు ధనం, బోలెడు స్థలం ఉండటంతో ఒక్కొక్కరికి ఒక్కో అంతఃపురం కట్టించి వాళ్లనందులో ఉంచి రాజుగారు మెయిన్‌టెయిన్ చేసేవారు. అయినప్పటికీ పండగలకీ, కార్యాలకీ కలుసుకున్నప్పుడు కీచులాడుకునేవారుట. అంతలా అంతఃపురాలు మెయిన్‌టెయిన్ చేసినా చిన్న పారిజాత పువ్వుకోసం సత్యభామ, శ్రీకృష్ణుల పోట్లాట మనకు తెలిసిందేకదా! రానురాను కాలం మారేకొద్దీ స్థలాభావం చేతా, కరువుకాటకాల చేతా, జనాభా పెరిగిపోవటం చేతా, అంతమంది భార్యలతో వేగటం సాధ్యంకాకపోవటం చేతా ఒక్క భార్యతో సరిపెట్టుకుందామన్న నిర్ణయానికొచ్చారు.

ఈ రోజుల్లో అయితే ఇరుకు గదుల్లో తక్కువ సంపాదనతో ఒక్క పెళ్లానికి కూడు పెడితే చాలురా బాబూ అనుకుంటున్నారు"

"అలా ఏం అనుకోటంలేదులెండి. ఇప్పుడు సినిమాల్లో హీరోకు ఇద్దరు పెళ్లాలుంటున్నారుకదా! అన్నట్టు సినిమాల్లోనే కాదు మా వీధిలోనే ఇద్దరికి ఒక్కొక్కళ్లకి ఇద్దరేసి పెళ్లాలున్నారు" అంది రాణి ఈ సోదంతా ఏంటన్నట్టు అడ్డు తగులుతూ విసుగ్గా మొహంపెట్టి.

కోపంతో పళ్లు పటపట లాడించింది విజయ.

"వస్తున్నా! వస్తున్నా! నీ పాయింట్‌కే వస్తున్నా! వాళ్లు సినిమా హీరోలు. ఒక్క సినిమాలో నటిస్తే లక్షలు తీసుకుంటారు. కానీ మనం మధ్య తరగతివాళ్లంకదా! ఇంతకీ నీ లవర్ గవర్నమెంటుద్యోగి అన్నావుకదా. రెండు అంతఃపురాలు మెయిన్‌టెయిన్ చెయ్యగలడా? ఓకే ఓకే చేస్తాడనే అనుకుందాం. గవర్నమెంటు ఉద్యోగికి ఇద్దరు పెళ్లాలుండటం నేరం. ఇపుడు భర్త మీది ప్రేమతోనో, భయంతోనో మీ సవతి గారు మీ పెళ్లికి ఒప్పుకున్నా రేపెప్పుడయినా ఈర్ష్యతోనో, కోపంతోనో ఈ రెండో పెళ్లి గురించి దావావేసిందంటే అతని ఉద్యోగం పోతుంది. అప్పుడు ఇద్దరు పెళ్లాలను పోషించటం సంగతలా ఉంచి తననే పోషించుకోలేడు. అసలీ ఉద్యోగం పోవటానికి కారణం నీవేనని నిన్ను ఇంటినించి గెంటేయవచ్చు. ఇలా రకరకాల బాధలు ఎదుర్కోవాల్సి వస్తుంది. అప్పుడు నీ పరిస్థితి ఏమిటి? "

"నన్నే గెంటేస్తాడని ఎందుకనుకోవాలి. ఆమెను గెంటెయ్యొచ్చుకదా? "

"పొరపాటు. ఎవరికైనా మొదట వడ్డించుకున్న అన్నమే రుచి. మారు వడ్డించుకున్న అన్నానికి రుచి తక్కువ. ఇంతకీ నేను చెప్పొచ్చేదేమిటంటే ఈ పెళ్లి తనకిష్టమేనని, తనకారోగ్యం బాగా లేదని, దాంపత్య సుఖానికి పనికిరానని, కాబట్టి తన భర్తకు రెండో పెళ్లి తానే స్వయంగా చేయిస్తున్నట్టు అతని భార్యతో అనుమతి పత్రం రాయించుకు రమ్మను. దాన్ని రిజిష్టరు చేయించి పకడ్బందీగా మీ పెళ్లి జరిపిస్తాము. అపుడు నీ జీవితానికి ఢోకా ఉండదు" అంది రాజి.

"అంతేకదా! చిటికెలో రాయించుకుని

వస్తాను. అసలిపుడాయన నేను ఏం చెబితే అది చెయ్యటానికి సిద్ధంగా ఉన్నారు. ఆవిడ కీళ్లు విరిచి అయినా సరే రాయించరూ. రేపీటైంకంతా ఆ అనుమతి పత్రంతో సహా మీ ముందుంటాను" అంది రాణి గర్వంగా కళ్లు తిప్పుతూ.

"అది సరే! అనుమతి రాయిస్తానని ఆయన ఏం చెబితే అది చేసే స్థితికి మాత్రం నీవు దిగజారవద్దు. అర్థమైంది కదా" అంది రాజి.

"ఓ అదా అర్థమైంది... అర్థమైంది. వెళ్లొస్తాను" అంటూ వెళ్లిపోయింది రాణి.

రాణి అలా వెళ్లగానే విజయ రాజేశ్వరి మీద విరుచుకుపడింది.

"ఆ పిల్ల కొవ్వెక్కి పైత్యపు మాటలు మాట్లాడుతుంటే నువ్వు తానతందాన అంటావేమిటి? మన సంస్థకున్న మంచి పేరు కాస్తా తుడిచిపెట్టుకుపోతుంది. అయితే ఆ పిల్ల అనుమతి పత్రం తీసుకు వస్తే పెళ్లి చేస్తావా? " ప్రశ్న మీద ప్రశ్న గుప్పించి అడిగింది.

"ఎందుకలా బీపీ పెంచుకుంటావ్. ఏం జరుగుతుందో అలా చూస్తుండు"

చిద్విలాసంగా నవ్వుతున్న రాజేశ్వరివైపు చూసి పళ్లు పటపటలాడించింది విజయ.

వారం రోజుల తర్వాత దివాలా తీసిన మొహంతో పాణిగ్రహణం ఆఫీసుకొచ్చింది రాణి.

"అనుమతి పత్రం తెచ్చారా? " అంది రాజి.

"లేదు" అంది దిగులుగా రాణి.

"ఏం"

"ఈ రోజు రాయించుకొస్తాను, రేపు రాయించుకొస్తాను అని మొదటి రెండురోజులన్నారు. 'అసలు నిన్ను ఆ పాణిగ్రహణం ఆఫీసుకు వెళ్లమని ఎవరు చెప్పారు. గుళ్లో తాళికట్టేసి లాడ్జిలో శోభనం జరుపుకుందాం పద' అన్నాడు.

"కాదుకూడదు నీ పెళ్లాంతో అనుమతి పత్రం రాయించుకొచ్చాకనే మిగతావన్నీను అని మొండికేశాను. రెండు రోజులనించి అతను ముఖాముఖంగా నేను కనిపించినా మాట్లాడలేదు. ఈ రోజు నేను కాలేజినించి వచ్చేలోగానే లారీకి సామాను ఎక్కించి ఇల్లు ఖాళీ చేశారు. అదేంటని అమ్మనడిగితే వాళ్లకీ ఇల్లు వాస్తు సరిగా లేదుట. అనుకున్న పనులు సవ్యంగా జరగటంలేదని ఇల్లు మారారుట. మారిన ఇంటి అడ్రసు కూడా ఇవ్వకుండా వెళ్లిపోయారు" అంది రాణి.

"ఇప్పుడర్థమైందా? అతని మోసం. త్వరపడి నీవు గుళ్లో తాళికట్టించుకుని ఉంటే నీకు కడుపు చేసి నువ్వెవరో నాకు తెలీదనే వాడు అదేదో సినిమాలోలాగా. అది చూసి పరువుపోయిందని మీ అమ్మానాన్న ఉరిపోసుకునేవాళ్లు అవునా" అంది రాజి.

మారు పలక్కుండా కన్నీళ్లు కారుస్తూ శూన్యంలోకి చూస్తుండిపోయింది రాణి.

"జరిగింది జరిగిపోయింది. ప్రేమా దోమా అంటూ ఇలాంటి తాత్కాలిక వ్యామోహాలకు లోబడకుండా బుద్ధిగా చదువుకో. చదువు ముగిశాక మంచి వరుడిని మేమే వెతికి నీకు పెళ్లిచేస్తాం సరేనా" అంటున్న రాజేశ్వరిని కౌగలించుకుని వెక్కి వెక్కి ఏడ్చింది రాణి.

అందరూ జాలిగా చూశారా దృశ్యాన్ని.

★ ★ ★

"ప్రియమైన రమకు రాజేశ్వరి రాయునది. నీ ఉత్తరం చేరింది. నా జాతకంలో పెళ్లియోగం ఉన్నట్టులేదు అంటూ నిరాశా నిస్పృహలతో నీవు రాసిన ఉత్తరం చదివాను.

పిచ్చికోపమొచ్చింది నాకు. పెళ్లిజీవితంలో ఓ భాగమే కానీ పెళ్లే జీవితంకాదుకదా! పెళ్లికోసమే ఆడవాళ్లు పుట్టినట్టు అటు తల్లిదండ్రులు, సంఘం, చివరికి ఆడపిల్ల కూడా ప్రవర్తించటం దురదృష్టకరం.

సరే సరే! నీకిపుడు నీతి పాఠాలు చెప్పే

టైం లేదు. నీ పెళ్లి ఆ టైం వచ్చినపుడు అవుతుంది.

నా గురించి అడిగావు, 'మురళి పరిస్థితి ఏమిటి? నిశ్చితార్థం దాకా వచ్చి ఆగిపోయిన అమ్మాయివి కాబట్టి తనూ వద్దన్నాడా' అని రాశావు. మురళి అంత కుసంస్కారికాదు. నాతో పెళ్లికి అతను త్వరపడుతున్నాడు. నేనే పెండింగులో పెట్టాను.

'పెళ్లిళ్ల పేరమ్మవయ్యావటగా' అంటూ రాశావు. అట కాదు అయ్యాను. ఇదేం కొత్తది, వింత ఉద్యోగం కాదు. మొదటినించి మగవాళ్లు పెళ్లిళ్ల పేరయ్యల జాబ్స్ చేస్తున్నారు. ఆడవాళ్లు మాత్రం ఈ జాబ్ ఎందుకు చేయకూడదు. మగవాళ్లు కుదిరిస్తే తప్ప ఆడవాళ్ల పెళ్లిళ్లు జరగవా? ఆడవాళ్లు మాత్రం పెళ్లిళ్లు ఎందుకు కుదర్చలేరు? అదంత సాధ్యంకాని పనా? అనిపించింది. అదీగాక ఏ కులం వాళ్లకు ఆ కులం వాళ్లలో వధువునో వరుడినో వెతికి పెళ్లి కుదర్చటం ఏమంత కష్టమైన పనికాదు. వెరైటీగా ప్రేమించుకొన్న వారికి పెళ్లిళ్లు చేయాలని నిశ్చయించుకొని నడుం కట్టాను.

ఈ వృత్తినే ఎన్నుకోవటానికి ముఖ్య కారణం నా జీవితం. నా పెళ్లి!

అమ్మా నాన్నా ఉండి, అంతో ఇంతో ఆర్థిక స్థోమత ఉండికూడా నా పెళ్లికి వేయి ఆటంకాలు!

నాలాంటి, నీలాంటి, విజయలాంటి అమ్మాయిలు వాళ్ల పెళ్లి సమస్యలు.. ఇవన్నీ చూస్తుంటే మనలాంటి అభాగ్యులు ఈ దేశంలో ఇంకెంత మంది ఉన్నారోకదా అనిపించింది.

"అలాగని అందరినీ ఉద్ధరించటం నీవల్ల నవుతుందా" అని మన ఫ్రెండ్సు నిలదీశారు. అందరినీ ఉద్ధరించటం వీలుకాకపోవచ్చు కానీ పెళ్లి అంటేనే ముఖ్యంగా ఆడపిల్ల పెళ్లంటేనే ఓ యాగంలా మారుతున్న ఈ రోజుల్లో నా వంతు కృషి చేయాలనిపించింది. ఆ ఆలోచన ఫలితమే ఈ వృత్తి.

ఇకపోతే ఈ వృత్తిలోనూ కొన్ని సాధక బాధకాలు ఉన్నాయి. ప్రేమించుకొన్న వారికి పెళ్లిళ్లు చేయిస్తామని ప్రకటన ఇచ్చాము. ఆ తర్వాత చాలామంది ప్రేమికులు మా దగ్గరకొచ్చి మా సహాయం కోరారు. ఓ తమాషా ఏమిటంటే కనిపెంచిన తల్లిదండ్రులకు నేనో అబ్బాయిని ప్రేమించాననో, నేనో అమ్మాయిని ప్రేమించాననో చెప్పటానికి ధైర్యం ఉండదు. ముక్కూ మొహం తెలియని మా దగ్గరకొచ్చి అంటే పాణిగ్రహణం ఆఫీసుకొచ్చి

"మేం ప్రేమించుకొన్నాం... మా పెద్దవాళ్లనొప్పించి మా పెళ్లి జరిపించండి. వాళ్లకు తెలియకపోయినా పర్వాలేదు మేం మేజర్లం పెళ్లి చెయ్యండి. మిగతా తంతులన్నీ మేం మానేజ్ చేసుకుంటాం. మేం పెళ్లి చేసుకోవటం మా వాళ్లకిష్టమే. కాకపోతే కట్నం కావాలంటున్నారు. అది మాకిష్టంలేదు. కట్న ప్రసక్తి లేకుండా మా పెళ్లి జరిపించండి" లాంటి మాటలు చెపుతున్నారు.

ప్రేమించుకొన్న జంటలు రకరకాల సమస్యలతో ధైర్యంగా మా దగ్గరకొస్తున్నారు. వారివారి సమస్యలు పరిష్కారం చేసి పెళ్లిళ్లు చేయించి పంపిస్తున్నాము. కాకపోతే పాణిగ్రహణం ఆఫీసుకు ప్రేమించుకొన్న వారికంటే మిగతా అంటే కులాంతర వివాహాలు ఇంకా రకరకాల పెళ్లిళ్ల సమస్యలతో మాదగ్గరికొచ్చే వారే ఎక్కువగా ఉన్నారు.

"అందరూ అనుకున్నట్టు నేను మురళిని పెళ్లి చేసుకుని ఎక్కడో ఓ మూల సంసారం పెట్టి ఉంటే నాకింతమంది జీవితాలను చదివే అవకాశం ఉండేదంటావా?

"వీళ్ల సమస్యలు పరిష్కరించి పెళ్లితో వారి జీవిత గమనాన్ని మార్చగలగటం థ్రిల్లింగ్‌గా ఉంది. నిజంగా ఈ వృత్తిలో ప్రతిరోజూ జీవిస్తున్నాను.

"ఇదీ నా పరిస్థితి. మీ అమ్మానాన్నల పర్మిషన్ తీసుకుని ఇక్కడికొచ్చెయ్యి. మన పెళ్లి సమస్య మనకు భూతంలా కనిపించి

భయపెడుతున్న ఈ సమయంలో ఎందరో అభాగ్యుల, అమాయకపు ఆడపిల్లల పెళ్లి, ప్రేమ సమస్యలు కళ్లారా చూసి చెవులారా వింటుంటే అసలు మనదీ ఓ సమస్యేనా? వాళ్ల బాధల ముందు మన బాధలెంత? అనిపిస్తుంది. మనం సన్నగా కనిపించాలంటే లావుపాటివారి పక్కన నడవాలన్న జోక్ గుర్తుకొస్తుంటుంది నాకు. నన్ను నేను మర్చిపోయే ఈ వృత్తి నీకూ తృప్తిని, మనశ్శాంతినిస్తుందని ఖచ్చితంగా చెప్పగలను. నా మీద నమ్మకముంటే ఇక్కడికి వచ్చేసెయ్యి. ఉంటాను నీ ఫ్రెండు రాజేశ్వరి."

★ ★ ★

"ఆ ఫోటోలో ఉన్నది మా అబ్బాయి. ఒక్కగానొక్క కొడుకు. ఆ అబ్బాయికి మంచి, అందమైన వధువును చూడాలి" అన్నాడు వీరభద్రరావు రాజేశ్వరికి ఎదురుగ్గా ఉన్న కుర్చీలో కూర్చుని.

రాజేశ్వరి అతనిచ్చిన ఫోటోవైపు తదేకంగా చూసింది. ఆ ఫోటోలో ఉన్న యువకుడు చాలా అందంగా ఉన్నాడు. సాధారణంగా పాణిగ్రహణం ఆఫీసుకొచ్చేవారంతా అమ్మాయిలకు వరుడు కావాలనే తల్లిదండ్రులే ఎక్కువ. అలాంటిది వధువు కావాలంటూ అందులోనూ ఇంత అందమైన యువకుడి తండ్రి వచ్చాడంటే ఆశ్చర్యమనిపించింది. పైగా ఈ వీరభద్రరావు కారులో వచ్చాడు. అంటే బాగా స్థితిమంతులని తెలుస్తూనే ఉంది. అయినా పూర్తి వివరాలు ఇప్పటికిప్పుడే అడగటం బావుండదనిపించి విజయవైపు చూపించి "ఆ అమ్మాయికి మీ అబ్బాయి వివరాలు, కులం, గోత్రం వగైరాలన్నీ చెప్పి వెళ్లండి. వారానికోసారి వచ్చి కనిపించి వెళ్లండి" అంది క్లుప్తంగా రాజి.

"చూడమ్మా! నా భార్య, నేను కులాంతర వివాహం చేసుకున్నాము. మాదసలు ఈ జిల్లాకాదు. ఇక్కడ నా బంధువులు కానీ, నా భార్య తరపు బంధువులు కానీ లేరు. ఈ జిల్లాలో స్థిరపడ్డాము కాబట్టి ఇక్కడి అమ్మాయినే కోడలిగా తెచ్చుకోవాలనుకున్నాము. మా అబ్బాయి కూడా మాలాగే ప్రేమించి పెళ్లి చేసుకుని ఉంటే మాకసలు సమస్య ఉండేదికాదు. ఊళ్లో మీలాగా పెళ్లిళ్లు జరిపే వివాహ వేదికలు చాలా ఉన్నా మీ దగ్గరికే ఎందుకొచ్చానంటే మీరు జరిపిన పెళ్లిళ్లన్నీ సక్సెస్ అయ్యాయి. ఈడు జోడు ఉన్న సంబంధాలు వెతికి మరీ చేస్తున్నారని ఆమధ్య మా ఫ్రెండొకడు పొగిడాడు. అందువల్లే మిమ్మల్ని ఆశ్రయించాను. నాకాబోయే కోడలు గొప్ప స్థితిమంతురాలు కాకపోయినా పర్వాలేదు. పూరిగుడిసెలో అమ్మాయి అయినా చాలు. కులపట్టింపు, కట్నం ప్రసక్తి లేదు. గుణగణాలు మంచివైతే చాలు" అంటున్న ఆ పెద్దాయన్ని అందరూ సంభ్రమాశ్చర్యాలతో చూశారు.

"పాణిగ్రహణం ఆఫీసుకు ఇన్ని రోజులకు మీలాంటి వారు రావటం ఇదే మొదటిసారి"

"మన దేశంలో మగపిల్లల తల్లిదండ్రులంతా ఇలా ఆలోచిస్తే ఎంత బావుండేది?"

"ఈ నిర్ణయం మీదా? మీ అబ్బాయిదా?"

ఇలా ఆఫీసు స్టాఫంతా పెద్దాయన మీద తలో ప్రశ్నా, ప్రశంసలూ గుప్పించారు. అన్నిటికీ చిరునవ్వుతోనే సమాధానమిచ్చారు ఆయన.

"నా నిర్ణయమే మా అబ్బాయి నిర్ణయమూను"

"మీ ఇంటికి రాబోయే కోడలు అదృష్టవంతురాలండీ" అంది రమ.

"అమ్మాయిలూ మీరేమీ అనుకోనంటే ఓ మాట. మీలో ఎవరైనా నా ఇంటికి కోడలుగా వస్తారా?"

"మీకా ఛాన్సు లేదులెండి. ఇక్కడున్న అమ్మాయిలందరికీ పెళ్లిళ్లు ఫిక్స్ అయ్యాయి. ఇక మీరు వెళ్లిరండి" అంది సీరియస్‌గా రాజి.

వారం తర్వాత గోవర్ధని, రాజేశ్వరి, విజయ, రమ ఓ చోట కూర్చుని వీరభద్ర రావు గురించి మాట్లాడుకున్నారు.

"ఆదర్శ పురుషుడిలా ఎంత పోజిచ్చాడు, ఏం డైలాగ్స్ కొట్టాడు. నేను నిజంగా నమ్మేశాను సుమా!" అంది రమ.

"ఇంతకీ ఏం జరిగింది" విజయ అడిగింది.

"ఆ వీరభద్రరావు కుమారరత్నం ఒక పెళ్లాన్ని హత్య చేశాడుట. ఇంకో పెళ్లానికి విడాకులిచ్చాడుట. వాడి మీద బోలెడు కేసులుట. డబ్బులిచ్చి మాఫీ చేయించుకున్నాడుట. మళ్లీ పెళ్లి చేసుకుందామంటే ఎవరూ అమ్మాయినివ్వటానికి ముందుకు రాలేదుట. ఈ విషయాలన్నీ ఆడాళ్లం మనకు తెలిసుండవని ఓ రాయి విసిరాడు. గోవర్ధని మొత్తం కూపీ లాగింది. అతనికి గడ్డిపెట్టి పంపించాం" అంది రాజి.

★ ★ ★

"ఏమిటమ్మా ఇలా వచ్చావు?" అడిగింది రాజేశ్వరి హాస్టల్ దగ్గరికొచ్చిన తల్లిని చూసి.

"ఏమిటే ఆ ప్రశ్న! రాకూడదా?" అంది కమలమ్మ.

"కూర్చోమ్మా!" అంటూ మంచంమీదున్న దుప్పటి సరిచేసింది.

కమలమ్మ గదంతా పరికించి చూస్తూ మంచంమీద కూర్చుంది. రాజేశ్వరి ఫ్లాస్కులోంచి టీ కప్పులో పోసి తల్లి కందిస్తూ, "ఇక్కడికి రావటానికి మీ ఆయన పర్మిషన్ ఇచ్చాడా?" అంది నవ్వుతూ.

"తండ్రిని పట్టుకుని ఏమిటే ఆ మాటలు?" మందలింపుగా అంది కమలమ్మ.

"కన్నకూతురిని తండ్రి ఇంట్లోంచి వెళ్లిపొమ్మనటంకంటే తప్పుగా అనిపిస్తున్నాయా అమ్మా నా మాటలు?"

"మాటకిమాట జవాబివ్వటం ఇంతకుముందుకంటే ఇంకా బాగా నేర్చుకున్నావు. ఎన్నాళ్లిలా ఒంటరిగా ఉంటావు. తండ్రి ఏదో కోపంలో అంటే అన్నంత పనీచేస్తావుటే! ఇంటికెడదాంరా?"

"ఇంటికొచ్చే ప్రసక్తిలేదు. ఒంటరిగా ఎన్నాళ్లైనా ఉంటాను. అయినా ఆ ఇంట్లో నాకేం పనిలేదు"

"అవునే! ఇంటిలోనూ, ఇంట్లోవారితోనూ ఇంకేంపనుంది నీకు. చిన్నప్పటినుంచి కష్టపడి పెంచి పెద్దచేసి విద్యాబుద్ధులు చెప్పించి నీకాళ్లమీద నీవు నిలబడేలా చేశాము. రెక్కలొచ్చాయి. ఇంక గూడుతోపనేముంది చెప్పు. కన్న నేరానికి బిడ్డలను పల్లెత్తుమాట అనకూడదు. ఆ హక్కులేదు మాకు కదూ! ఇంతకుముందు మగపిల్లలు విశ్వాసంలేనివాళ్ళు. పెళ్లాలు రాగానే తల్లిదండ్రులను లెక్కచెయ్యరు అని అందరూ అంటూ ఉంటే కాబోలుననుకున్నా. కానీ ఆడపిల్లలు కూడా, అందునా పెళ్లికూడా కాకుండానే ఇంత క్షోభ పెడతారని ఊహించలేదు. అసలే నీపెళ్లి మాకో సమస్య అయింది. మళ్లీ నువ్విలా ఇల్లు వదలివచ్చి... అందరినోళ్లలోపడి... మమ్మల్నింకా బజారుకీడుస్తావా? అసలు నిన్ను గురించి నువ్వేమనుకుంటున్నావు. రోజులెలా ఉంటున్నాయి. ఒంటరిగా బ్రతుకుదామనే? సినిమాలో హీరోయిన్ ననుకుంటున్నావా? ఆడది అన్నికాలాలలోనూ మగతోడు లేకుండా బ్రతగ్గలదా?"

"అమ్మా! ఆపు, ఆపు. నువు కన్నావు, పెంచావు అన్నీసరే! అమ్మా! యుక్తవయసు వచ్చాక నాకూ ఓ మనసుంటుందని, ఓ వ్యక్తిత్వముంటుందని నీకు తెలియదా? తెలుసు, కానీ ఒప్పుకోవు. నీ వ్యక్తిత్వాన్ని నాన్న అధికార పీఠానికి బలి ఇచ్చేశావు కాబట్టి, నీకు రాజీధోరణి రక్తంలో కలిసిపోయింది. నీకిపుడు తిరుగుబాటు రక్తమార్పిడిచేయలేను.

"ఒకే ఇంట్లో ఉంటూ కూడా మనిషికీ మనిషికీ పూడ్చలేని అగాథాలు. అపురూ

పంగా చూసుకుంటున్నదైనా, అందంగా మలచుకున్నదైనా మనకు ఇబ్బందిగా మారినప్పుడు, మనం దాన్ని సహించలేనప్పుడు, దాన్ని దూరంచేయటమో, మనం దూరంగా పారిపోవటమో మంచిజీవిత విధానమని నేను నమ్ముతున్నాను. అందుకే ఇల్లు వదలివచ్చేశాను. నిన్ను చూస్తే నాకు జాలేస్తుందమ్మా"

"ఎందుకట"

"అబ్బే! ఏంలేదులే! నాకు సంబంధంలేని విషయాలు నాకెందుకు? ఇంతకీ నీవిప్పుడెందుకొచ్చావు? "

"అన్నయ్యకు పెళ్లికుదిరింది"

"అలాగా! సంతోషం. అమ్మాయి నాన్న తరపు బంధువుల్లో బాపతేనా? "

"అవును"

"నా ఊహ కరెక్టేనన్నమాట"

"నీ ఊహలూ, ఆలోచనలూ పక్కకు పెట్టి ఇంటికొచ్చెయ్యి. నాన్నగారు, నీక్కూడా సంబంధాలు చూస్తున్నారు"

"సారీ అమ్మా! నేను రాలేను. నాపెళ్లి గురించి రిస్కు తీసుకోవద్దు. నేనిప్పుడప్పుడే పెళ్లిచేసుకోదల్చుకోలేదు"

"ఏం! ఎందుకొద్దు! ఇంకా ఏం ఉద్ధరించాలి? " కోపంగా అంది.

"అమ్మా! నువ్విక బయలుదేరు. చీకటి పడుతోంది" నవ్వుతూ అంది రాజి.

"ఇక ముసుగులో గుద్దులాటవద్దు. ఇంతవరకూ నీ జీవిత విధానం గురించి నీవే చెబుతావేమోనని ఎదురుచూశాను. తల్లిగా నిన్ను నిలదీసి అడిగే హక్కు ఉందని అనుకుంటూ అడుగుతున్నాను. ఇంతకీ ఆ పాణిగ్రహణం ఆఫీసేమిటి? ప్రేమికులకు ఎలా పెళ్లిచేసుకోవాలో వారికి తెలీదా? 'ఇంత బతుకూ బ్రతికి చివరికి పెళ్లిళ్ల పేరమ్మ ఉద్యోగం, నీ కూతురు చేస్తోందా? ' అంటూ మీ నాన్నగారిని, నన్ను... బంధువులు... స్నేహితులు... ఎద్దేవా చేసి మాట్లాడుతుంటే తలెత్తుకోలేక చస్తున్నాం. ముందు దాన్ని ఇంటికి తీసుకురా. ముక్కు తాడేస్తే తప్ప మాట వినదు' అంటూ నాన్నగారు రంకెలు వేస్తున్నారు. పద ఇంటికి వెళదాం" అంది కమలమ్మ రాజేశ్వరి చెయ్యి పట్టి లాగుతూ.

ఆమె చెయ్యి సున్నితంగా విడిపించుకొని, "మన ఆలోచనలు... కాదు... మీ... ముఖ్యంగా పెద్ద వాళ్ల ఆలోచనలు మారుతున్న కాలంతోపాటు ఎప్పటికప్పుడు మార్చుకుంటూ ఉంటే ఆరోగ్యానికి మంచిది. మీ పెద్దరికాన్ని, సంప్రదాయాల్ని చిన్న చూపు చూడాలన్న ఉద్దేశ్యం నాకులేదు. కానీ ఏ మేరకు వాటిని గౌరవించాలి అన్న విషయం మాత్రం నాకు తెలుసు. మీరు ఏర్పరచుకున్న భావాలతో మాత్రం నేను ఏకీభవించలేను. నా జీవితం... నా ఇష్టం... అని కఠిన పదజాలంతో మిమ్మల్ని నొప్పించేంత దూరం నన్ను తీసుకురావద్దని ప్రార్థిస్తున్నాను. ఇక నువ్వు బయల్దేరు. నాకు పనుంది బైటకెళ్లాలి" అంది లేచి నిలబడుతూ రాజి.

బ్రమాన్పడిపోయి చూసి... కన్నీళ్లు వత్తుకుంటూ అక్కడినించి నెమ్మదిగా నిష్క్రమించింది కమలమ్మ.

★ ★ ★

పాణిగ్రహణం ఆఫీసుకు ఓ ఇరవైఏళ్ల అమ్మాయి చంకలో ఏడాదిపాపను ఎత్తుకునివచ్చింది. ఆమెను స్టాఫంతా ప్రశ్నార్థకంగా చూశారు. విజయకైతే చిర్రెత్తుకొచ్చింది. రాజేశ్వరివైపు గుర్రుగా చూసింది. ఆ చూపు "చంకలో నున్న పిల్లకు వరుడిని వెతకమంటూ వచ్చిందేమో చూడు" అన్నట్టుంది.

విజయ రాజేశ్వరితో ప్రతిరోజూ పోట్లాడుతూ ఉంటుంది. "పేరు గొప్ప ఊరు దిబ్బ అన్నట్టయింది మన సంగతి. అసలు మనమేమని ప్రకటనలిచ్చుకున్నాం. ప్రేమించుకుని, పెళ్లిచేసుకోలేక అవస్థలు పడే వాళ్లకి పెళ్లిళ్లు చేస్తామనికదా ఇచ్చాం. ఆ

ప్రకటన... దాని అర్థం గాలికి కొట్టుకుని పోయాయి. ఆమధ్యనోసారి మీ అమ్మగారొచ్చి 'ప్రేమించుకొన్నవాళ్లకి పెళ్లిచేసుకోవటం తెలీదా? మళ్లీ నువ్వు షూటింగు జరిపి పెళ్లిచెయ్యాలా?' అందన్నావు గుర్తుందా? ఆమె చెప్పింది అక్షరాలా నిజం. మన దగ్గరికి ప్రేమించుకొన్నవాళ్లు అస్సలు రావటంలేదు. నూటికి పదిమంది వస్తే గొప్ప. ఈ ప్రేమగోల పక్కకు పెట్టి, నలుగురితోపాటు నారాయణా అంటూ ఏ కులంవారికి ఆ కులంవారితో పెళ్లిళ్లు అంటూ కొత్తగా ప్రకటనలిద్దాం ఎలాగూ మనం చేస్తున్నది అలాంటి పెళ్లిళ్లేకాబట్టి... దానికి సంబంధించిన బోర్డు ఉంటే తృప్తి అయినా మిగులుతుంది" అనేది కోపంగా.

"నీకిపుడు ఏంనష్టమొచ్చింది?" అడిగేది రాజి.

"దాని బాధంతా ఒకటే. ప్రేమించుకుని పెళ్లికోసం మన దగ్గరికొచ్చినవాళ్లని ఎలా ప్రేమించుకొన్నారు. మీ ప్రేమకు స్ఫూర్తి ఎవరు? మీ ప్రేమ ట్రాజెడీ అవడానికి కారకులెవరు? ఇలా ఇంటర్వ్యూ చెయ్యాలనుకుని ఉబలాట పడిఉంటుంది. అలావీలు కాక మనదగ్గరికి మామూలు పెళ్లిళ్ల పేరయ్యాల దగ్గర కొచ్చినట్టు... ఇంకా రకరకాల మనస్తత్వం గలవాళ్లు రావటంతో తిక్కరేగుతోంది. అనుకున్నదొకటి, అయినదొకటి అంటూ తెగ బాధ పడుతోంది" అనేది రమ ఉడికిస్తూ.

"కూర్చోండి" అంది రాజేశ్వరి.

"నాపేరు ఝాన్సీ" అంటూ బిడ్డను ఒళ్లో కూర్చోబెట్టుకుని తనూ కూర్చుంది.

"మంచిపేరు, చెప్పండి"

"నేను పెళ్లిచేసుకోవాలనుకున్నాను" అంది ఝాన్సీ.

"అలాగా! మీ వివరాలు చెప్పండి" అంది రాజి.

ఝాన్సీ పేలవంగా నవ్వుతూ "నాదగ్గర డబ్బులేదు. కట్నం ఇచ్చుకోలేను. మీ కమీషను కూడా ఇచ్చుకోలేను. ఓ కాన్వెంటులో చిన్నపాటి జీతంతో బ్రతుకుతున్నాను. సాటి స్త్రీలకు మీరు చేయూతనిచ్చి వారి జీవితాలను నిలబెడుతున్నారని తెలుసుకుని మిమ్మల్ని ఆశ్రయించాను"

"అవన్నీసరే! ఈ పాప ఎవరు? బంధువులమ్మాయా?" విజయ ప్రశ్నించింది.

"కాదు! నా కూతురు"

ఈ జవాబుతో అందరూ ఉలిక్కిపడ్డారు.

"పాప తండ్రిపోయారా?" రాజేశ్వరి అంది.

"రెండు సంవత్సరాలక్రితం నేను రేప్‌కు గురయ్యాను. ఫలితమే ఈ పాప. అప్పట్లో అబార్షన్‌కు కూడా వీలుకాని పరిస్థితిలో, నా ఆరోగ్యం ఉండటంతో పాపకు జన్మనివ్వక తప్పలేదు. నా తల్లిదండ్రులు పేదవారు. నాకు న్యాయం జరగటం కోసం పోలీసులను, కోర్టులను ఆశ్రయించినా ఫలితం లేకపోయింది. అంతో ఇంతో డబ్బు పోగొట్టుకున్నాము. తల్లిదండ్రులు ఆ సంఘటనతో కుంగిపోయి ఒకరివెంట ఒకరు చనిపోయి నన్ను, నా కూతురిని ఒంటరివాళ్ళని చేశారు. కానీ రేప్‌కు గురి అయిన స్త్రీ సమాజం చూసే చూపులకు, వేసే ప్రశ్నలకు తట్టుకోలేదు. ఉన్న ఊరు వదిలి ఈ ఊరుకి వచ్చి ఉద్యోగం చేసుకుంటూ బ్రతుకుతున్నాను. ఈ ఒంటరి జీవితం నన్ను బాగా భయపెడుతోంది. అందుకే పెళ్లిచేసుకోవాలనుకుంటున్నాను.

ఇంకో విషయం... నాకు జరిగిన అన్యాయం గురించి నేను దాచిపెట్టాలనుకోవటంలేదు. నా గురించి అంతా తెలిపి, సహృదయంతో, ఆదర్శభావాలతో నన్ను, తన జీవితంలోకి ఆహ్వానించే వ్యక్తినే పెళ్లిచేసుకోవాలనుకుంటున్నాను. 'ఈ రోజుల్లో అలాంటివారెక్కడున్నారు?' అని మీరంటారేమో. నవయువకుడు, అందగాడు కావాలని నేను ఆశించటంలేదు. మనిషి ఎలా ఉన్నా మనసు మంచిదైతే చాలు. నా యీ

పెళ్లి మీ పాణిగ్రహణం స్టాఫ్‌వల్ల తప్పకుండా జరుగుతుందని ఆశించి వచ్చాను" అంది ఝాన్సీ.

అందరూ కళ్లు విప్పార్చి ప్రశంసగా ఝాన్సీవైపు చూశారు.

జీవితవిధానంలో స్త్రీ ధోరణి రోజురోజుకీ ప్రశంసాత్మకంగా మారుతోంది. దీనికి కారణం పురుషాధిక్యత, పురుషాహంకారమే. ఒకప్పుడు స్త్రీ తీసుకునే నిర్ణయానికి పురుషుడు ప్రాణంపోస్తేనే అమలుజరిగేది. ఇపుడాదశ మారింది. స్వతంత్ర నిర్ణయానికి నడుంకట్టింది.

హక్కులకోసం, బాధ్యతలకోసం తనదైన జీవితం కోసం, నిరంతరం ఆలోచిస్తోంది. ప్రశ్నిస్తోంది. పోరాటం సలుపుతూనేవుంది. తన జీవితంలో మార్పుకోసం ఆరాటపడుతూనే ఉంది.

"మీ నిర్ణయాన్ని మేము అభినందిస్తున్నాము. ఏదో అన్యాయం జరిగిందని జీవితాంతం కుమిలిపోతూ, జీవితాన్నించి పిరికితనంగా పారిపోయే చాలామంది స్త్రీలకు మీరు ఆదర్శం. మా శాయశక్తులా ప్రయత్నించి మీకు వరుడిని వెతికి పెళ్లిజరిపిస్తాము. అడ్రసు ఇచ్చివెళ్లండి" అంది రాజేశ్వరి.

ఆ మర్నాడే పాణిగ్రహణం అడ్రసు ఇస్తూ పేపర్లో ప్రకటన వేయించింది.

"వరుడు కావలెను. భర్త పోయి ఒక పాపకు తల్లి అయిన, అందం, చదువూ ఉన్న యువతికి ఆదర్శభావాలుగల వరుడు కావలెను. సంప్రదించవలసిన చిరునామా, కేరాఫ్: పాణిగ్రహణం.

★ ★ ★

మరో వారంరోజులకు పాణిగ్రహణం ఆఫీసుకు ముప్ఫయ్యేళ్ల అందమైన యువకుడు వచ్చాడు. అందరికళ్లూ, మనసూ సంశయాత్మకంగా మారాయి. "ఈ ప్రబుద్ధుడు మన తలకాయలను తినటానికొచ్చినట్టున్నాడు" అంది రమ విజయతో గుసగుసగా.

"ష్! అరవకు. వినబడుతుంది" సున్నితంగా కసిరింది విజయ.

"కూర్చోండి" అంటూ సీటు చూపించింది రాజేశ్వరి.

"థ్యాంక్స్! నా పేరు కళ్యాణ్!" అంటూ తననుతాను పరిచయం చేసుకుంటూ కూర్చున్నాడు.

"చెప్పండి" అంది చిరునవ్వుతో రాజి.

"ఝాన్సీ అనే అమ్మాయి గురించి పేపర్లో ప్రకటన చదివి, స్పందించి ఇలా వచ్చాను" అన్నాడతను.

"అలాగా! ఆ అమ్మాయికి వరుడు మీ ఎరికలో ఎవరైనా ఉన్నారా? " అంది రాజేశ్వరి.

"నాకింకా పెళ్లికాలేదు. నేను ఆ అమ్మాయిని పెళ్లిచేసుకోవాలనుకుంటున్నాను"

"మీరా అమ్మాయిని చూశారా? "

"చూడక్కర్లేదు. ఆమె గురించి వివరాలూ నాకనవసరం. ఆమెను తప్పకుండా పెళ్లిచేసుకుంటాను. కానీ ఒక్కషరతు మీద"

"షరతా? ఏమిటది? " అంది రాజి. స్టాఫంతా అతనిమీద ఎవరికితోచిన ఆలోచనలతో వాళ్లుండి, అతను చెప్పబోయే విషయంకోసం, చెవులు రిక్కించారు.

"నాకో చెల్లి ఉంది. ఆమె అంటే నాకు ప్రాణం. మా ఇద్దరికీ అమ్మా నాన్నలేరు. మూడు తరాలకు సరిపడ ఆస్తి ఉంది. ఆమె ఏది కోరితే అది చేశాను. నాకు మనశ్శాంతి కరువైంది" అతని మాటలు తడబడి, గొంతు గాద్గదికంగా మారిపోవడంతో మాటలు ఆపేసి, కనుకొలకుల్లో నీరు తుడుచుకున్నాడు.

రాజేశ్వరి ఓ గ్లాసు మంచినీళ్లందించి 'తాగండి' అంది. నీళ్లు తాగి చేతిరుమాలుతో మొహం తుడుచుకున్నాడు.

మళ్లీ ఏదో మాట్లాడబోతుండగా "మీరు ముందు రిలాక్సవ్వండి. నిదానంగా చెప్పండి. మాశక్తి వంచనలేకుండా

సహాయం చేస్తాము" అంది.

"మా చెల్లి పేరు జ్యోతి. డిగ్రీ చదివేటపుడు సునీల్ అనే అబ్బాయి ప్రేమలో పడింది. అతను అందగాడు, బుద్ధిమంతుడు. నా చెల్లి అతని గురించి వివరించినప్పుడు జ్యోతిని అతనికిచ్చి పెళ్లిచేయటానికి నాకే అభ్యంతరమూ కనిపించలేదు. కులాలు వేరైనప్పటికీ మాకున్న ఆస్తిపాస్తుల కారణంగా సునీల్ తల్లిదండ్రులు ఒప్పుకున్నారు. చాలా ఆర్భాటంగా పెళ్లిచేశాము. ఒక సంవత్సరంపాటు అన్యోన్యంగా కాపురం చేశారు.

మా చెల్లి అదృష్టం బాగాలేక యాక్సిడెంట్‌లో సునీల్ పోయాడు. సునీల్ చనిపోయేనాటికి జ్యోతి అయిదు నెలల గర్భవతి. భర్త ఎడబాటుతో మానసికంగా దెబ్బతిని, ఓ రకమైన స్తబ్ధతతో పిచ్చిదైంది. బెంగుళూరు, మద్రాసు, హైదరాబాదు ఇలా ఎన్ని ఊళ్లు తిరిగినా లాభం లేకపోయింది. ఆ స్తబ్ధత, ఆమె ప్రసవించాక పసివాడి ఏడుపు వల్ల మాత్రమే విడిపోయింది. నా సంతోషానికి అవధుల్లేకుండా పోయింది. నా చెల్లి మళ్లీ మామూలు మనిషయింది. అంతే చాలనుకున్నాను.

ఏ జన్మలో ఏ పాపం చేశామో ఆ పసికందు కూడా మరో మూడు నెలలకు దూరమయ్యాడు. జ్యోతి పరిస్థితి మళ్లీ యథాప్రకారమైంది. అన్నంతినదు, నిద్రపోదు, మాట్లాడదు. చీకట్లో తప్ప వెలుతురులోనికి రాదు. మళ్లీ డాక్టర్లకు చూపించాను. డాక్టర్లు అప్పుడే పుట్టిన పిల్లలను, అంతేవయసుగల పిల్లలను జ్యోతి వడిలోకందించారు. జ్యోతి ఎవ్వరినీ ముట్టుకోదు. పైగా భయపడి కేకలు వేస్తూ పారిపోతుంది. చివరికి డాక్టర్లు "ఈమెకు మళ్లీ పెళ్లిచెయ్యండి. ఆమె నవమాసాలూ మోసి బిడ్డనుకంటే తప్ప ఈ మానసిక వ్యాధి దూరంకాదు" అని నిర్ధారించారు.

"మా చెల్లికి భర్తను వెదికిపెట్టండి. ప్లీజ్, అతను అందగాడు, ఉద్యోగస్థుడు కానక్కరలేదు. నా చెల్లికి తోడూనీడయితే చాలు. నా యావదాస్తిని అతనికి రాసిస్తాను" అంటూ ధారాపాతంగా వర్షిస్తున్న కన్నీళ్లను తుడుచుకున్నాడు కల్యాణ్.

అందరి హృదయాల్లూ బరువెక్కాయి. ఒక వయసు రాగానే ఎవరి స్వార్థం వారు చూసుకుని, అనురాగాలు, ఆత్మీయతలు దూరం అవుతున్న ఈ రోజుల్లో తోడబుట్టిన దాని జీవితం నిలపటం కోసం ఆస్తి, అందం ఉన్న ఈ యువకుడు.... ఓ బిడ్డ తల్లిని.... కనీసం రూపురేఖలైనా చూడకుండా పెళ్లిచేసుకోవడానికి ముందుకొస్తున్నాడంటే.... 'హేట్సాఫ్' అనుకున్నారు అంతా మనసులోనే.

చాలాసేపు నిశ్శబ్దం తర్వాత ముందుగా రాజీ మాట్లాడింది.

"మీ చెల్లికి పెళ్లిచేయాలన్న మీ ఆలోచన బాగుంది. మీ చెల్లికి మా శాయశక్తులా వరుడిని వెతుకుతాము. ఈలోగా మీరు ఝాన్సీని చూసి, ఆమె గతం గురించి తెలుసుకుని, ఇద్దరూ ఓ అభిప్రాయానికొస్తే బావుంటుంది" అంది.

"నేను ఝాన్సీని చూడవలసిన పనిలేదు. ఆమె తరపున మీరు ప్రకటన ఇచ్చారు కాబట్టి, నా షరతు మీకు తెలుపవలసి వచ్చింది. మీరు తప్పకుండా మా చెల్లికి వరుడిని వెతకగలరన్న నమ్మకం నాలో కలిగి మీ దగ్గరకొచ్చాను. ఇకపోతే ఝాన్సీ గురించి, గతం గురించి అన్నారు. ఈ దేశంలో ఏ ఆడపిల్ల దురదృష్టానికైనా కారకుడు, మగవాడే...వాడిలో పురుషాధిక్యత, అహంకారం.... ఇంతకుమించి ఇంకేముంటుంది? ఆమె కూడా నా చెల్లిలాగే తోడులేని స్త్రీ. కాకపోతే ఆమె జీవితం ఇంకో పంథాలో నడిచివుంటుంది. ఏది ఏమైనా ఆమెకు తోడు నేనుంటానని మాట ఇస్తున్నాను" అన్నాడు కల్యాణ్.

"అదిసరే! నేను చెప్పేది కూడా కాస్త

వినండి. ఘూన్సీ రేప్‌కి గురయిన స్త్రీ. ఈ నిజం మీకిపుడు తెలిస్తేనే మంచిది. పేపరు ప్రకటనలో ఆ విషయం ప్రస్తావించడం బాగుండదని తెలపలేదు" కల్యాణ్ ముఖక వళికలు గమనిస్తూ మాట్లాడుతోంది రాజి.

"సాధారణంగా మగవాడు చిన్నప్పటి నుంచీ... అంటే చదవడం వచ్చినప్పటి నుంచీ చదివిన థియరీలు... వయసులో జరిపిన రాసక్రీడా విశేషాలు... ఎంతటి హీరోయిజాన్ని వెలగబెట్టిందీ.... తను సాధించిన ఘనకార్యాలుగా తొంభయి యేళ్లు వచ్చేవరకూ కూడా విక్రమార్క కథ ల్లాగా గర్వంగా పదిమందికి చెప్పుకుని ఆనందిస్తాడు. అదే భార్యవరకూ వస్తే ఆమెకు ఊహ తెలిసినప్పటినుంచీ... మగ వాడితో పరిచయాలుండకూడదు. గడప దాటి ఉండకూడదు. మొట్టమొదటి స్పర్శ తనదే అయి వుండాలి అన్న ఆలోచనలే అతనికి తృప్తినిస్తాయి.

"అంతకుమించి వాస్తవాలు జీర్ణించుకునే శక్తి చాలామంది మగవారికుండదు. అదీ మన సామాజిక పరిస్థితి. కాబట్టి జాగ్ర త్తగా, ఆలోచించి నిర్ణయం తీసుకుంటే మంచిది. ఈరోజున్న ఆదర్శభావాలు జన్మ ముగిసేవరకూ నిలుపుకుంటే మంచిది. లేక పోతే... భవిష్యత్తులో మీ పిల్లలు.... వారి భవిష్యత్తు దెబ్బతింటుంది" అంది ఆవేద నగా.

మీ పిల్లలు అంటున్నప్పుడు రాజీకి ఆమె తల్లితండ్రులు... పోట్లాటలు... తన జీవితం... ఓ క్షణం రీలులా తిరిగి బాధపె ట్టడంతో.... గొంతు పూడుకుపోయింది.

"మీ అభిప్రాయంతో ఏకీభవిస్తాను. మీరే అంటున్నారు కదా చాలామందిలా కాకుండా ఏ కొద్దిమందికో వాస్తవాలు జీర్ణించుకునే శక్తి ఉంటుందని. ఆ కొద్దిమందిలో నేనూ ఒకడిని. బహుశా నా చెల్లి జీవితమే నన్ను అలా మార్చి ఉండవచ్చు లేకుంటే... అంతా సవ్యంగా ఉంటే... జీవితాలు అర్థంకాక... ఆ చాలామందిలా అసలు సిసలైన మగా డిలా ఉండేవాడినేమో"

మనసులో ఏదీ దాచుకోకుండా మాట్లాడు తున్న కల్యాణ్‌ని అందరూ మనసులో ప్రశంసించారు.

"త్వరలో మీకు కబురు చేస్తాను. మీరు వెళ్లిరండి" అంది రాజేశ్వరి చేతులు జోడిస్తూ.



జ్యోతి గురించి పేపరు ప్రకటన ఇచ్చింది రాజి. ఓ నెల రోజులకు సన్నగా, పీలగా ఉన్న ఓ యువకుడు వచ్చాడు పాణి గ్రహణం ఆఫీసుకు.

"నా పేరు చౌదరి. నిరుద్యోగిని. జ్యోతిని గూర్చి పేపరు ప్రకటన చూసి వచ్చాను." అన్నాడు తననుతాను పరిచయం చేసు కుంటూ.

"అలాగా! సంతోషం! కూర్చోండి" అంది రాజి.

"జ్యోతిని గూర్చి పూర్తి వివరాలు చెప్పండి" అన్నాడతను.

ఆమె పెళ్లి.... ప్రసవం... మానసిక పరి స్థితి... డాక్టర్ల సలహా... ఆమె ఆస్తిపాస్తుల వివరాలు... కల్యాణ్ గురించి మొత్తం చెప్పేసింది రాజి.

"ఇలాంటిదేదో ఉంటుందనే అనుకున్నాను. ఇకపోతే నా గురించి వినండి. నేను గ్రాడ్యుయేట్ ని. నిరుద్యోగిని. నా మీద ఆశలు పెట్టుకుని మా అమ్మానాన్నా, ఇద్దరు చెల్లెళ్లు బతుకుతున్నారు. నాన్న రిటైరయ్యారు. చెల్లెళ్లు పెళ్లికెదిగారు. అమ్మ ఆరోగ్యం బాగాలేదు. నాన్న పెన్షన్ డబ్బులు తినడానికే సరిపోవడంలేదు. చెల్లెళ్ల పెళ్లి బాధ్యత ఉంది. ఇండియాలో ఉన్న దరిద్రమంతా మా ఇంట్లోనే తాండవిస్తోంది.

"ఎంత ప్రయత్నించినా నాకు మంచి ఉద్యోగం దొరకలేదు. ప్రయివేటు కంపెనీల్లో తక్కువ జీతానికి చేరినా పర్మనెంటుగా ఉండదు. ఈ పరిస్థితుల్లో జ్యోతి గురించి ప్రకటన చూశాను. ఆమెకు తోడుగా వుంటాను.

"పెళ్లి చేసుకుని ఆమె జీవితాన్ని నిలబెడతాను. ఇవి ఉట్టిమాటలు, నిలకడలేని హామీలు ఎంతమాత్రం కావు. ఇకపోతే మీరంతా నన్ను త్యాగమూర్తిగానో.... ఇంకేదో.... ఆదర్శమూర్తిగానో... ఊహించుకుంటే పొరపాటవుతుంది. నా యీ నిర్ణయంలో పూర్తిగా నా స్వార్థం ఉంది.

"జ్యోతి అన్నయ్య నాకు ఉద్యోగంకానీ... జీవనోపాధిగానీ... మా కుటుంబం ఏ ఇబ్బందీ లేకుండా బతికే తెరువుగానీ చూపిస్తాడనే ఆశతో నేనామెను పెళ్లి చేసుకుందామనుకుంటున్నాను. నాకీ సౌకర్యం మీ ద్వారా జరిపించండి. పెళ్లికి నేను రెడీ.... త్వరలో కబురు చేస్తారని ఆశిస్తున్నాను. శలవు" అంటూ వెళ్లిపోయాడు చౌదరి.

మరో పదిహేనురోజులకు పాణిగ్రహణం ఆఫీసులో కల్యాణ్‌కు ఝాన్సీతో, చౌదరికి జ్యోతితో... యస్.ఐ గోవర్ధని, లాయరు హాసిని సమక్షంలో హిందూ సాంప్రదాయం ప్రకారం... నిరాడంబరంగా పెళ్లి జరిగిపోయింది.

పాణిగ్రహణం ఆఫీసు స్టాఫ్ అందరికీ మంచి చీరలు గిఫ్ట్‌గా ఇచ్చాడు కల్యాణ్. ఆఫీసుకు కావలసిన ఫర్నిచర్ కోసం పది వేల రూపాయలు ఇచ్చాడు. కమీషను కూడా భారీ మొత్తం లో చెల్లించి సంతృప్తి పరిచాడు.

కల్యాణ్ చౌదరికి ఉద్యోగ వసతి కల్పించాడు. అంతేకాక చౌదరి చెల్లెళ్ల పెళ్లిళ్లకి కూడా తనకు చేతనైనంత సహాయం చేస్తానని హామీ ఇచ్చాడు.

"మీ ద్వారా నలుగురి జీవితాలు ఒడ్డున పడ్డాయి. మీ రుణం ఎన్ని జన్మలెత్తినా తీర్చుకోలేము!" అన్నాడు కల్యాణ్.

"ఇందులో మేం చేసింది తక్కువ. మీ... మీ ఆదర్శభావాలే మీ జీవితాలని నిలబెట్టాయి. స్త్రీలు భర్త చనిపోతేనో, అత్యాచారానికి గురవుతేనో... ఆమెనలా వెలివేసినట్లు వదిలేయక, ఆమెకో స్థానం కల్పించి, చేయూతనిచ్చే ఆదర్శభావాలు మీ చుట్టూ ఉన్నవారిలో కూడా పెంపొందించండి.

"ఇకపోతే ఈ పెళ్లితో ఈ కథ ముగిసిందని, ఒడ్డున పడ్డామని అనుకోవద్దు. అసలు జీవితం మీకు ఇకముందే ఉంటుంది. పేదరాసి పెద్దమ్మలా ఈ అమ్మాయి ఆరిందా మాటలు చెబుతుందేమిటా అనుకోవద్దు. వయసుని మించిన అనుభవాలు చవి చూశాను కాబట్టి చెబుతున్నాను.

"మీ ఈ వివాహం గురించి మీ చుట్టూ ఉన్న సమాజం ప్రస్తుతం ఆశ్చర్యంతో ముక్కున వేలేసుకుంటుంది. కసితో వీలైతే మీ ఎదుటపడి ప్రశ్నిస్తుంది. ఆరా తీస్తుంది. అంతటితో తృప్తి పడదు. ఆ కసితో... మీ పిల్లల భవిష్యత్తును కూడా కాటేయటానికి సంశయించదు. అసలు తగాదా, మీ మనసుల్లో అలజడి ప్రారంభమయ్యేది అప్పుడే.

"ఇప్పటినుంచే రాబోయే ప్రతి సీన్ కూ మెంటల్ గా ప్రిపేరవ్వండి. ప్రశ్నించే సమాజానికి తగిన రీతిలో... అంటే ఇంకోసారి

నోరెత్తకుండా జవాబివ్వండి.

"వైవాహిక జీవితంలోని కమిట్‌మెంట్‌ని అర్థంచేసుకుని కాపురం చెయ్యండి. భార్యాభర్తలిద్దరిదీ ఒకే పరిధి ఉంటే మంచిది. మన వర్గం, మనమతం, మనకులం, మన జాతి, అని తరతరాలనుండి దోపిడీ వ్యవస్థ చేస్తున్న కుట్రలకు దాంపత్య జీవితాన్ని బలి చేయకండి.

"నా బంధువులు, నీ బంధువులు అనే చవకబారు ఆలోచనలు దరిచేరనిచ్చి పిల్లల భవిష్యత్తు మీద బురద చల్లకండి. మంచి భార్యాభర్తలుగా, మంచి తల్లితండ్రులుగా మిగిలిపోండి. అప్పుడే ఈ పాణిగ్రహణం స్టాఫ్ రుణం తీర్చినవారవుతారు" అంటూ కన్నీళ్లతో చేతులు జోడించిన రాజేశ్వరిని మంత్రముగ్ధులై చూస్తుండిపోయారందరూ.

★ ★ ★

"నాన్నా! నాకో రెండు వేలు అర్జంటుగా కావాలి" అడిగాడు చందూ.

"ఏమిటీ! రెండువేలా? చెట్లకు కాశాయనుకుంటున్నావా? " కోపంగా అన్నాడు నారాయణరావు.

"అదేంటో! ఈ సైంటిస్టులు, మేధావులూ అన్నీ కనిపెడుతున్నారు. కానీ చెట్లకి డబ్బులు కాయించలేకపోతున్నారు." తల గోక్కుంటూ పెదవి విరుస్తూ అన్నాడు చందూ.

"వాళ్లకి తీరుబడి లేక ఆపని చెయ్యలేకపోయారు. తమరు బేకారు ఇన్‌స్పెక్టరు కదా! పెరట్లో కాళీ స్థళంలో ప్రయత్నించి చూడకూడదూ? అసలు విషయం చెప్పు. రెండువేలెందుకు? "

"నేనో అమ్మాయిని ప్రేమించాను. ఏమిటలా చూస్తున్నారు? ప్రేమించడం తప్పా? అమ్మను మీరు ప్రేమించలేదా? "

"అమ్మాయిని ప్రేమించడానికి, రెండువేల రూపాయలకి ఏమిటి సంబంధం? "

"అదా? అదంతా ఓ పెద్ద స్టోరీ. వారం రోజులుగా ఓ అమ్మాయిని ప్రేమించి వెంటబడుతున్నాను. ఆ అమ్మాయి కనీసం కన్నెత్తి కూడా చూడటంలేదు. ఆ అమ్మాయి ఇంటిముందు మొన్న రాత్రి వర్షంలో తడుస్తూ నిలుచున్నాను. సినిమాలోలాగా 'ఐ లవ్ యూ' అంటుందనుకుంటే పిచ్చాసుపత్రికి ఫోను చేసి పట్టిచ్చింది.

"అక్కడినుంచి తప్పించుకుని రావడానికి తల ప్రాణం తోకకొచ్చిందనుకో. ఇరవైనాలుగు గంటల్లోగా ఆ అమ్మాయి చేత 'ఐ లవ్ యూ' అనిపిస్తానని ఫ్రెండ్స్‌తో పందెం కాశాను. వాళ్లింటిముందు డేరా వేసుకుని నిరాహారదీక్ష చేయాలనుకున్నాను. దాని ఖర్చు బాపతు రెండువేలవుతుంది. ఆ డబ్బు అమరప్రేమికుడివి నీవుకాక నాకింకెవరిస్తారు నాన్నా!

"నీవు కూడా ఒకప్పుడు అమ్మకోసం టెంట్ వేశావు కదా! ప్రేమలో ఉన్న బాధ నీకు తెలియదా? ప్చ్ ఏమిటో... ఈకాలం ఆడపిల్లలు చాలా తెలివి మీరిపోతున్నారు. మీ రోజుల్లోలాగా ఠకీమని పడిపోయే ఆడపిల్లలు చూద్దామంటే లేరు సుమండీ. అన్నట్టు ఫోన్ చెయ్యాలి" అంటూ హడావిడిగా ఫోన్ దగ్గరకి పరుగెత్తి నంబరు డయల్ చేశాడు.

చందూ హడావిడి, అతని మాటల ధోరణి చూసి పళ్లు పటపటలాడిస్తూ నిలబడ్డాడు నారాయణరావు.

"హలో! రాజా! నువ్వేనా? ఏరా! షామియానా రెడీయేనా? పూల దండలు తెప్పించావా? ఏమిటీ పూలదండలెందుకా! సీనంతా వివరించి చెప్పాలా? నువ్వు టిప్పుసుల్తాను కాలంలో పుట్టాల్సినవాడివి.

"సరే చెబుతా విను. నా లవ్వర్ ఇంటి ముందు డేరా వేయించి అందులో నేను పూలదండ వేసుకుని నొసట కుంకుమ నామం పీకి కూర్చుంటాను. నా చుట్టూ మీరంతా ఓ పదిమంది కూర్చుంటారు. మీ అందరి చేతుల్లో 'ప్రేమ వర్ధిల్లాలి' బోర్డు

లుంటాయి.

"మైకులోంచి పాటలు... ఆ... ఏం పాటలా? ... ఆమాత్రం తెలీదుట్రా? తెలుగు సినిమాలో విరహగీతాలెన్ని లేవూ? ప్రేమ ఎంత మధురం.. ప్రియురాలు అంత కఠినం... కుడిఎడమైతే పొరపాటు లేదోయ్... మల్లియలారా మాలికలారా... మనసుగతి ఇంతే... ఇలా ఓ పది పాటలు వరుసగా వేస్తే బాల్కనీలో ఉండే నా లవ్వర్ కంట తడి పెడితే షామియానా తడిచి పోతుంది. దబ్బున కిందికి దిగి వచ్చి 'ఐ లవ్ యూ' అనేస్తుంది.

"అన్నట్టు ఓ గుండు సూది రెడీగా పెట్టుంచు. దానితో నా బొటనవేలు గుచ్చుకుని ఆ రక్తంతో ఆ అమ్మాయికి నొసట నామం పెట్టాలి. అంతే! వెంటనే ఆ అమ్మాయి తన చీర చింపి నా చేతికి కట్టు కడుతుంది. అబ్బా! నీకన్నీ అనుమానాలే. పంజాబీ డ్రస్‌తో వస్తే తన దగ్గరున్న చేతిరుమాలుతో కడుతుంది. ఏమిటీ! ఈరోజుల్లో అమ్మాయిలు చేతిగుడ్డను కూడా జులాయిగాళ్ల కోసం వేస్ట్ చెయ్యరా? ఆడాళ్ల సంగతి నీకేం తెలుసురా సన్నాసీ. మైనంలా కరిగిపోతారు.

"అర్థమైందా? ఇంక అరేంజ్‌మెంట్స్ చూడు. డబ్బా? తెస్తాగా. ఇంకెవరు? మానాన్న ఇస్తాడు. మా నాన్న అలనాటి-అమర ప్రేమికుడురా కన్నా. ప్రేమలోని లోటుపాట్లు, బాధలు వగైరాలన్నీ పూర్తిగా అనుభవించి తల పండినవాడు. ఆయన స్ఫూర్తితోనే నా యీ ముందడుగు. అంతగా ఇవ్వనని మొండికేశాడనుకో, ఇంట్లో రెండువేలు విలువ చేసే ఏదో వస్తువు అమ్మేస్తాను. ఉంటారా! బై!"

ఫోన్ పెట్టేసి ఇటుతిరిగి చూసిన చందూకి గుడ్లురుముతూ కనిపించాడు తండ్రి నారాయణరావు.

"ఏంట్రా వెధవా! చిల్లరవేషాలేస్తున్నావా? దీన్నిప్రేమంటార్రా వెధవా? ఆ పిల్ల తండ్రో, అన్నో చూశాడంటే మక్కెలిరగదన్ని జైల్లో తోయిస్తారు"

"తోయించనీ! ప్రేమకోసమై జైల్లో పడెనే పాపం పసివాడు అని పాడుకుంటా! ఇంకో గంటలో వస్తాను గానీ డబ్బు రెడీగా వుంచండి"

'నా జీవితమూ నీకంకితమూ, నీవే నాకు ఆదర్శమూ' అంటూ పాట పాడుతూ బయటకెళ్లిపోతున్న కొడుకుని చూసి బి.పి. పెంచుకున్నాడు నారాయణరావు.

తండ్రితో జరిగిన వాగ్యుద్ధమంతా యాక్షన్ చేసి మరీ చెప్పాడు విజయతో చందూ.

"పెద్దవాళ్లనలా ఏడిపించవచ్చా? అస్తమానూ ఆయన మీద పడి ఏడవటమెందుకు? స్వంతంగా ఉద్యోగం వెతుక్కోవచ్చుగా? " అంది విజయ.

"ఏమిటీ! ఈ మహానుభావుడా ఉద్యోగం వెతుక్కునేది. నువ్వు కష్టపడి ఉద్యోగం ఇప్పించినా, మూడంటే మూడు రోజులు చెయ్యకుండా పారిపోయి వచ్చేస్తాడు తెలుసా? " అంది రాజేశ్వరి వాళ్లిద్దరి ముందూ కుర్చీ లాక్కుని కూర్చుంటూ.

"అంటే ఇంతకుముందు నువ్వేదయినా ఉద్యోగం ఇప్పించావా? " ప్రశ్నించింది విజయ.

"ఆహా! ఈ కళాకారుడికి అంతో ఇంతో డిజైన్స్, పెయింటింగ్, అదీ ఇదీ తెలుసని సినిమా వాల్‌పోస్టర్స్ ప్రింటింగ్ ప్రెస్‌లో ఉద్యోగం ఇప్పించాను నా పలుకుబడితో వారం రోజులకి ఉద్యోగం ఊడిపోవడం అటుంచి, ఇలాంటివాడికి రికమెండేషను చేసి ఉద్యోగం ఇప్పిస్తావా? అంటూ వాళ్లు నా ఇంటిమీదకి దండెత్తి వచ్చారు"

"ఇంతకీ ఏం చేశారు? " ప్రశ్నించింది విజయ.

"ఎదురుగ్గానే ఉన్నాడుగా అడుగు"

చందూవైపు ప్రశ్నార్థకంగా చూసింది విజయ.

# ఆణిముత్యాలు

★ మొండితనంతో కూడిన సద్గుణంకంటే, సర్దుబాటుతో కూడిన దుర్గుణమే మిన్న.

–మోలియర్

★ విజయానికి ఆత్మవిశ్వాసమే ముఖ్యం.

–విలియమ్ హాత్‌బిట్

★ ప్రజాభిప్రాయం దన్నుగా వున్నపుడే చట్టం సమర్థవంతంగా అమలు జరుగుతుంది.

–వెండెల్ ఫిలిప్స్

★ స్వాంతన చేకూర్చే మాటలను నేర్పుగా పలకటమే మనిషికి తెలిసిన పురాతన వైద్యం.

–లూయిస్ నైజర్

★ తక్కువ చేసేవారే ఎక్కువ చేస్తామని ఆర్భాటం చేస్తారు.

–లియో మాగ్నెట్

★ భారతదేశబలం నైతిక విలువల్లోనే వుంది. కానీ ఆయుధాల్లో కాదు.

–సల్మాన్ ఖుర్షీద్

★ పుష్పాలు వికసింపలేనిచోట మనుషులూ జీవించలేరు.

–నెపోలియన్

★ భయం అన్నివేళలా అవశ్యంగా అజ్ఞానంనుంచే జనిస్తుంది.

–ఎమర్సన్

★ అంతఃసంఘర్షణ జరిగినపుడే మనిషి మరింత ఉన్నతుడుగా రాటుదేలుతాడు.

–బ్రౌనింగ్

★ బలహీన మనస్కుల మతమే మూఢవిశ్వాసం.

–ఎడ్మండ్ బర్క్

★ స్వేచ్ఛగా వుండు, దేనికీ కట్టుబడకుండా వుండు. నీవెంట నీవేమీ తీసుకువెళ్ళలేవు. మరణం చెప్పేది ఇదే.

–జిడ్డు కృష్ణమూర్తి

★ శ్రద్ధగా వినడం నేర్చుకుంటే నిష్ఠూరాలాడే వారినుంచి కూడా లాభం పొందవచ్చు

–ప్లూటార్క్

★ పొరపాటు మానవ సహజం. దాన్ని ఎదుటి వాడి నెత్తిన రుద్దచూడటం రాజకీయం.

–బిల్‌వాఘన్

★ శిల్పం కరుడుగట్టిన సంగీతం.

–మేడమ్ డిస్టేల్

★ చేసే పనులనుబట్టికాదు, ఆ పనులను చేసే తీరునుబట్టి మనిషికి విలువకట్టాలి.

–స్వామివివేకానంద

సేకరణ: బి. నందీశ్వరరెడ్డి

"ఆ! ఏం లేదండీ. వాల్‌పోస్టర్ మీద విడుదల రోజే పెద్ద అక్షరాలతో నూరవ రోజు అని రాయించి దానికింద చిన్న అక్షరాలతో మరో తొంభైతొమ్మిది రోజులకు అని రాయించాను. దాంతో సినిమా కలెక్షన్స్ బాగా పెరుగుతాయనుకున్నాను. అది చూసి మొదటివారమంతా ప్రజలు పెద్దగా రాసిన నూరవరోజు మాత్రమే చూసి "అరే ఇన్ని రోజులనుంచీ ఈ సినిమా ఆడుతున్నా మనం మిస్సయ్యామే" అనుకుని ఎగబడి చూశారు.

"వారం తర్వాత జ్ఞానోదయమయి కింద నున్న అక్షరాలను చూసి చెత్త సినిమాకి ఇంత బిల్డప్ ఇస్తావా? అంటూ టాకీసుల ముందు గలాటా చేశారు. వాళ్లొచ్చి నా మీదపడి ఉద్యోగం పీకేశారు. అంతే! అయినా పెట్టుబడి లేని వ్యాపారమూ... లంచం ఇవ్వని ఉద్యోగమూ వేస్టండీ! అందుకేకదా మా నాన్నని ఓ రెండు లక్షలివ్వు, మంచి బిజినెస్ చేసి లక్షలు గడిస్తానంటే నమ్మి ఇవ్వడు. ఆయనలా నన్ను సతాయిస్తాడు. నేనలా సాధిస్తూనే ఉంటాను." అన్నాడు చందూ.

"విన్నావుగా! హీరోగారి నిర్వాకం. పద పద టైమవుతోంది" అంది రాజి విజయతో.

నిట్టూరుస్తూ లేచి నిలబడింది విజయ.

★ ★ ★

"నా పేరు శంకర్రావు" అంటూ తన్ను తాను పరిచయం చేసుకుని కుర్చీలో కూర్చున్నాడాయన.

పాణిగ్రహణం స్టాఫంతా ఆయన్ని పరిశీలనగా చూశారు. యాభైఏళ్లు దాటి ఉంటాయి. జుట్టు తెల్లబడింది. మంచి ఎత్తు, లావుతో ముఖం కూడా ఆకర్షణీయంగా ఉంది.

"చెప్పండి" అంది చిరునవ్వుతో రాజేశ్వరి.

"నేను పెళ్లిచేసుకోవాలనుకుంటున్నాను" అన్నాడాయన.

ఉలిక్కిపడ్డారు స్టాఫంతా. తమపనితాము చేసుకుంటూనే అతన్నో కంట గమనిస్తూ చెవులు రిక్కించారు.

రాజేశ్వరి కూడా ఉలిక్కిపడ్డట్టయి తనను తాను సర్దుకుని " అలాగా" అంది తెచ్చిపెట్టుకున్న నవ్వుతో.

విజయకు వళ్ళుమండింది. ఏదో పనున్నట్టు రాజేశ్వరి పక్కగా వచ్చి నిలబడి శంకర్రావుకేసి చూస్తూ "చూడండిసార్! మేం ఎక్కువగా ప్రేమ వివాహాలకే ప్రాధాన్యత ఇచ్చి జరిపిస్తున్నాము" అంది.

"తెలుసమ్మా! ముందు మీరు ఆ బోర్డే వేసుకున్నప్పటికీ మీ ప్రమేయం లేకుండానే అన్ని రకాల పెళ్లిళ్లు ఈ పాణిగ్రహణం ఆఫీసులో జరుగుతున్నాయనీ, అందులోనూ ఆదర్శ వివాహాలు ఎక్కువగా జరిపిస్తున్నారనీ తెలుసుకుని వచ్చాను. ఎందరో నాయకులు అరవై పైబడింతర్వాత పెళ్లిచేసుకోగా లేనిది నేను చేసుకుంటే తప్పేమిటమ్మా. నా వయసిపుడు యాభైమూడు, రిటైర్‌మెంటుకింకా ఐదేళ్లుంది. అంటే రూల్సు ప్రకారం నేనింకా ముసలాడిని కాలేదనేకదా దాని అర్థం"

"సరే సరే! విషయం చెప్పండి. ఒక్క మాట, మీవయసువారిని చేసుకుందుకు అమ్మాయిలు సిద్ధపడకపోవచ్చు. మా ప్రయత్నం మేం చేస్తాం" అంది రాజి.

"మీరే ఓ పేపరు ప్రకటన ఇవ్వలేకపోయారా? " అంది విజయ కాస్త విసుగు ధ్వనిస్తూ. 'సిగ్గులేకపోతేసరి ఈ వయసులో పెళ్లిట పెళ్లి. మగబుద్ధి పోనిచ్చుకున్నాడు కాదు' అని గొణుక్కుంటున్న విజయను కళ్లతోనే వారించింది రాజేశ్వరి.

"నా అడ్రసిచ్చి ప్రకటన ఇస్తే అందరూ ఇంటిముందు క్యూ కడతారు. అది నాకిష్టం లేదు. మీ ద్వారా అయితేనే అన్నివిధాలా బావుంటుందని నా ఉద్దేశ్యం"

"మీ భార్యగారు..." అంది రాజి.

"నా పెళ్లయి ఇరవై అయిదు సంవత్సరాలయింది. పెళ్లయిన అయిదు సంవత్సరాల

లోపే ఇద్దరు ఆడపిల్లలకు జన్మనిచ్చి నాభార్య చనిపోయింది. మళ్లీ పెళ్లిచేసు కుంటే ఆ వచ్చినావిడ నా కూతుళ్లను సరిగా చూస్తుందో లేదోనన్న అనుమానంతో పెళ్లి చేసుకోకుండా, నా పిల్లలను పెంచి పెద్దచేసి చదువులు చెప్పించి మంచి కట్నాలిచ్చి పెళ్లిళ్లు చేశాను. పిల్లలకు దూరంగా ఉండ లేక ఉన్న ఊళ్లోనే సంబంధాలు చూసి చేశాను. ప్రతిరోజూ ఇద్దరు కూతుళ్లనూ చూసివస్తూంటాను. ఉదయం ఒక కూతురు, సాయంకాలం ఒక కూతురు నాకు క్యారియర్ పంపిస్తారు. నా అంత అదృష్టవంతుడు లేడనుకుంటున్న సమ యంలో నాకో సమస్య వచ్చిపడింది.

ఇపుడు నేనుంటున్న ఇల్లు దాదాపు పది లక్షల విలువచేస్తుంది. ఆ ఇల్లు నా తదనం తరం ఎలాగూ కూతుళ్లిద్దరికీ చెందుతుంది అనుకున్నాను. కానీ అల్లుళ్లు మాత్రం "తద నంతరం అంటే ఎన్నాళ్లని ఆయన చావు కోసం ఎదురుచూడ్డం? దుక్కలాగున్నాడు. ఇంకా ఇరవై ఏళ్లు గ్యారంటీగా బతుకుతాడు. అంతవరకు లొట్టలేసుకుంటూ ఉండటం మావల్లకాదు. కాబట్టి ఆ ఇంటిని అమ్మి చెరి సగం ఇవ్వమని చెప్పండంటూ కూతుళ్లను నామీదకు తోలారు. అంతేకాదు ఎలాగూ క్యారియర్ పంపిస్తున్నాంకదా జీతం డబ్బులు కూడా చెరిసగం ప్రతినెలా ఇవ్వ మని అడగమన్నారుట.

"కూతుళ్లకు నామీద ప్రేమాభిమానాలున్నప్ప టికీ భర్తల మాట కాదనలేక నా దగ్గరకొచ్చి కన్నీళ్లు పెట్టుకుని తమ బాధ వెళ్లబోసుకుం టున్నారు. అల్లుళ్లను కొడుకుల్లాగా చూసు కుని వారు కోరిందల్లా సమకూర్చాను. వారి ఆశకు అంతులేకుండా ఈవిధంగా ప్రవర్తిం చటంతో నాకు వళ్లు మండింది. చాలారో జులు ఆలోచించాను. ఏదిఏమైనప్పటికీ నా ఆస్తి వారికి పూర్తిగా చెందనివ్వదలచుకో లేదు.

"అన్నట్టు మరిచాను. నా కూతుళ్లిద్దరూ గవర్నమెంటు జాబ్స్‌చేస్తున్నారు. వాళ్లకూ భర్తల చర్యలు సరిపడటంలేదు 'నీతదనం తరం ఏ అనాథాశ్రమానికో ఈ ఆస్తి చెందేలా వ్రాయి' అన్నారు. లేదా అనాథాశ్ర మంనించి ఓ పదేళ్లకుర్రాడిని తెచ్చిపెంచుకో మన్నారు. ఆ సలహాలేవీ నాకు నచ్చలేదు. ఈ ముసలితనంలో నాకోతోడు కావాలని పించింది. నాక్కాబోయే వధువు కన్య కాన క్కరలేదు. పిల్లలున్న వితంతువైనాసరే! నాకు తోడుండి నా మంచిచెడ్డలు చూసే మంచి మనిషైతేచాలు.

"నా యీ ఆస్తిని కూతుళ్లకు అల్లుళ్లకు మాత్రం ఇవ్వదలచుకోలేదు. నా ఆలోచ నను నా కూతుళ్ల ముందుంచాను. వారూ సంతోషించారు. మీ పాణిగ్రహణం ఆఫీసు అడ్రసు కూడా వారే చెప్పి నన్నిక్కడికి పంపించారు. ఇదీ నా పరిస్థితి" అంటూ ముగించారు శంకర్రావు.

"త్వరలోనే మీకు కబురు పంపిస్తాను" అంది రాజి మీరిక వెళ్లిరండి అన్నట్టుగా. శంకర్రావు వెళ్లిపోయాడు.

"రాను రానూ మన ఆఫీసు పరిస్థితి మరీ అధ్వాన్నంగా తయారవుతోంది" అంది విజయ.

"ఏమైందిప్పుడు? "

"ఈ ముసలాడు ఏవేవో కథలు చెబుతు న్నాడు. నేను మాత్రం నమ్మను. ఈ వయ సులో పెళ్లెందుకు? ఆస్తిని అల్లుళ్లకివ్వటం ఇష్టంలేకపోతే ఏ అనాథాశ్రమానికో రాసేసి, తనూ ఓవృద్ధాశ్రమంలో చేరితే పోలా? పెళ్లిచేసుకుని రికార్డు సృష్టించాలా? చచ్చే దాకా మగాడిననిపించుకోవాలని తాపత్ర యంకాకపోతే? " ఈసడించుకుంది విజయ.

"అతన్ని గూర్చి మరీ అంత విపరీతా ర్థాలు తీయక్కర్లేదనిపిస్తోంది. ఎందుకంటే వధువు గూర్చి పిల్లలున్న వితంతువైనా ఫర్వాలేదు నాకు తోడు కావాలి అంటున్నా డంటే అతని మనసులో పెళ్లికి అర్థం కేవలం శారీరక సుఖం కాదని అర్థమౌ తోంది. చూద్దాం" అంది రాజి.

"మా ఇంటిదగ్గర ఓ వితంతువుంది. ఆమె వయసు దాదాపు నలభై ఏళ్లుంటాయి. ఒక కూతురు, కొడుకు ఉన్నారు. పుట్టింట్లో నానా అగచాట్లు పడుతోంది. ఆమెను కదిపి చూడమంటారా? " అంది సుశీల రాజేశ్వరితో.

"అలాగే అడిగిచూడు. మనమూ పేపరు ప్రకటన కూడా ఇద్దాం" అంది రాజి.

మరుసటివారం సుశీలను రాజి అడిగింది, "మీ ఇంటిదగ్గరున్నావిడను కలిశావా? " అంటూ.

"అడిగాను. ఆవిడ ఒప్పుకోలేదు."

"అదేం! ఆవిడ పుట్టింట్లో కష్టాలు పడుతోందన్నావుకదా. శంకర్రావుగారికి ఆస్తి ఉంది. డబ్బు, ఉద్యోగం ఉన్నాయి. బతుకు సుఖంగా ఉంటుందని చెప్పలేకపోయావా? "

"చెప్పాను. బతుకు సుఖంగా ఉంటుంది కానీ మనశ్శాంతి ఉండదు. ఎందుకంటే నా పిల్లలు వారి తండ్రిప్రేమను చవిచూశారు. బాగా... అంటే పన్నెండేళ్ల వయసులో ఆయన పోయారు. వారి మనసులో తండ్రి రూపం హత్తుకుపోయింది. ఇపుడు నేను పెళ్లిచేసుకుంటే తండ్రి స్థానంలో మరో మనిషిని వాళ్లు చూడలేరు. తండ్రి స్థానం అతనికివ్వరు సరికదా నామీద కూడా ఏమాత్రం గౌరవం వారికుండదు. నాపిల్లలకు తండ్రి దూరమయ్యాడు. డబ్బుకోసమో, తోడుకోసమో జీవితం సాఫీగా సాగటంకోసమో నేనీ నిర్ణయం తీసుకుని అతన్ని పెళ్లాడితే పిల్లలకు నేను శాశ్వతంగా దూరమవుతాను. అది నేను భరించలేను. దానికంటే ఒక పూట తిని బాధలనుభవిస్తున్న ఈ కష్టాలే మేలు అంది" అంటూ చెప్పింది సుశీల.

స్త్రీలు ఆలోచించినంతదూరంగా, నిశితంగా పురుషులు ఆలోచించరేమో అనుకుంటూ ఆలోచనలోపడింది రాజేశ్వరి.

★ ★ ★

మరో నెలరోజుల్లో ఓ నలభై అయిదేళ్ల వితంతువు ఫాణిగ్రహణం, ఆఫీసుకు వచ్చింది.

"నాపేరు శ్యామలమ్మ. మీరిచ్చిన పేపరు ప్రకటన చూసివచ్చాను" అంది.

"అలాగా! కూర్చోండి" అంది రాజి.

"నాకు ఒక కొడుకు, కూతురు ఉన్నారు. నా భర్త చనిపోయి దాదాపు పదిహేనేళ్లయింది. కొడుకును, కూతురిని బాగా చదివించి పెళ్లిళ్లు చేశాను. నాకంటూ ఏమాత్రం ఆస్తికానీ, ఇల్లుకానీ మిగుల్చుకోలేదు. అంతా నాపిల్లలే కదా అని ధారపోశాను. ఇపుడు కొడుకు కోడలి మాటలు విని నాకు ఓ ముద్ద అన్నం పెట్టడానికి, వాడింట్లో ఓ మూల పడుకోనివ్వటానికి కూడా ఇష్టపడడంలేదు. ఏదయినా నోరు చేసుకుంటే 'వెళ్లి ఏ అనాథాశ్రమంలోనైనా చేరు' అని మొహంమీదే చెప్పేస్తున్నాడు. కూతురి సంగతి సరేసరి. ఆమె అత్తమామల మధ్య నేనుండటం బావుండదనీ, 'నీ స్థానం కొడుకుదగ్గరే... నాదగ్గర కొచ్చి నా సంసారంలో చిచ్చుపెట్టద్దు' అని తెగేసి చెప్పింది. ఏంచెయ్యాలా? ఎలా బతకాలా? అసలు బతకటానికి నాకు అర్హత ఉందా లేదా అని తర్జనభర్జన పడుతున్న సమయంలో మీరిచ్చిన పేపరు ప్రకటన చదివాను. నేనెవ్వరికీ పనికిరానని క్రుంగిపోతున్న నాకు... నేను కూడా పనికివస్తానన్నట్టు... ఆశాజనకంగా కనిపించిందీ ప్రకటన. నాకు శంకర్రావుగారి ఆస్తితో అంతస్థుతో పనలేదు.

"ఈ జీవనసంధ్యలో మనసు విప్పి చెప్పుకోటానికి, బాధలు పంచుకోవటానికి...కనీసం మాట్లాడటానికి కూడా మనిషి కరువైన నాకు తోడుంటేచాలు. ఆయన నన్నుచూసి, నా కథ విని, నన్ను పెళ్లిచేసుకోవటానికి వప్పుకుంటే నా రెండు కోరికలు తీరతాయి. ఒకటి నా కక్ష తీరుతుంది. రెండు నాకు తోడు దొరుకుతుంది. కక్ష ఎవరిమీద అంటారా? నా పిల్లలమీద. ఈ వయసులో స్త్రీ ఎంత మర్యాదగా పెళ్లిచేసుకున్నా... ఎన్ని పుకార్లు లేవదీస్తారో, తెలి

యనిదికాదు. పుకార్లు విని నా పిల్లలు తల వంచుకు కుంగిపోవాలి. నాక్కావలసింది అదే. అలా నాకక్ష తీరుతుందన్నమాట" అంది కన్నీళ్లు తుడుచుకుంటూ శ్యామ లమ్మ.

ఆమె మాటలు విన్న వారందరి మన సులు బరువెక్కాయి.

వారం తిరగకముందే శంకర్రావు, శ్యామ లమ్మలకు పరిచయం ఏర్పరచటం, ఆ వెంటనే వాళ్లిద్దరికీ పాణిగ్రహణం ఆఫీసు లోనే నిరాడంబరంగా దండలపెళ్లి రిజిస్ట్రార్ సమక్షంలో జరగటం పూర్తయింది.

★ ★ ★

"ఇంకా నీ యాగం పూర్తికావటానికి ఎన్నేళ్లు పడుతుంది?" పార్కులో పచ్చగడ్డి మీద చతికిల బడుతూ అడిగాడు మురళి రాజేశ్వరిని.

"మా ఉద్యోగానికి యాగం అని పేరు పెట్టావా?"

"నేను తెలుగులో పూర్. నేనేదైనా తప్పు మాట్లాడానా? పోనీ మామూలు భాషలో మాట్లాడతాను. ఇంకా ఎన్ని పెళ్లిళ్లు చేశాక మన పెళ్లవుతుందో చెబుతావా?"

"అలాంటి టార్గెట్ నేనేం పెట్టుకోలేదు. మన పెళ్లయ్యాక కూడా ఈ ఉద్యోగం ఇలా చేస్తూనే ఉంటాను. నాకీ ఉద్యోగం... అంటే ప్రతి ఒక్క పెళ్లినీ ఛాలెంజ్‌గా తీసు కుంటున్నాను కాబట్టి చాలా సంతృప్తిని స్తోంది" అంది రాజి.

"అలాగే చేద్దూగాని నేవద్దంటానా? అమ్మ నా పెళ్లికి తొందరపెడుతోంది."

"ఇంకో నాలుగు నెలలాగుదాం. ఎందు కంటే ఈలోగా చక్రవర్తి సంగతి కూడా తేలి పోతుందికదా! ఏమిటి మొహం అలా పెట్టావు. అతడు అనారోగ్యం మనిషి. అమాయకుడు కూడాను. మన అదృష్టం కొద్దీ శశికళ మెడలో తాళికట్టాడు. ఆ అమ్మాయిని చక్రవర్తి తనంతతానే తన భార్య అని మనస్ఫూర్తిగా నమ్మాలి. ఆమెను వదులుకోలేని పరిస్థితి రావాలి. అప్పుడు మనకు లైన్ క్లియర్ అవుతుంది"

"ఏమిటి అంత తతంగం జరుగుతుందం టావా? ఆమధ్య ఎప్పుడో నీ దగ్గరకొచ్చి రెండువందల పేజీల నోట్సునిండా ఐ లవ్ యూ రాజి అని రాసి తెచ్చిచ్చాడన్నావు"

"అవును. అప్పటినుంచి నేనింకా జాగ్ర త్తగా ఉంటున్నాను. శశికళమీద అతని ధ్యాసను మళ్లిస్తున్నాను"

"ఎలా?"

"ఎలా ఏముందీ. ఆమెమీద నెగెటివ్‌గా మాట్లాడ్డమే?"

"నాకర్థంకాలేదు"

"అర్థంకాలేదా? అయితే విను. ఆమధ్య నోసారి నా దగ్గరకొచ్చి ఈరోజు శశికళ మా యింటికి వచ్చి నా కాళ్ళకు దణ్ణం పెట్టింది అన్నాడు. ఎందుకని అనడిగితే అదేదో నోములుట. భర్త కాళ్ళకు దణ్ణం పెట్టాలిట కదా!" అన్నాడు.

"గాడిదగుడ్డు. మొగుడూ లేదు మొద్దులూ లేదు నేనయితే చస్తే మొగుడి కాళ్ళకు దణ్ణం పెట్టను. మొగుడికి కొమ్ము లొచ్చాయా" అన్నాను.

ఇంకోరోజు ఏదో స్వీటు తెచ్చిందట. ఇంకోరోజు గుత్తివంకాయ కూర తెచ్చిందట. వంట అద్భుతంగా చేస్తుందిట. ఇలా వారా నికోరోజు నా దగ్గరకొచ్చి పెళ్ళాంగురించి పొగడటం నేను తీసిపారేసి మాట్లాడి ముఖం చిన్నబుచ్చుకునేలా చేసి పంపటం చేశాను. వారానికోసారి వచ్చే మనిషి ఇరవై రోజులకు, ఆ తర్వాత నెలరోజులకు టైమింగ్స్ మార్చాడు. అసలు నా దగ్గరకు రాకుండా వచ్చేరోజు తప్పకుండా వస్తుంది. అన్నట్టు అతనింటిదగ్గర ఓ సి.ఐ.డి.ని కుది ర్చాను. శశికళ, చక్రవర్తి అప్పుడప్పుడు సిని మాకు, పార్కుకు, షాపింగ్‌కు ఎవరూ చూడలేదనుకుని వెళుతున్నారుట. వాళ్ళమ్మ అంటే మా మేనత్త మాత్రం ఇంకా నామీదే

ఆశలు పెట్టుకుని నాన్నతో మంతనాలు చేస్తూనే ఉందిట. అదీ సంగతి"

"ఇంతకీ శశికళ ఎలాంటి అమ్మాయి? " అడిగాడు మురళి.

"మంచి అమ్మాయి. తెలివైనది కూడా. సంవత్సరం గడువులోగా భర్తను పూర్తిగా వశపరుచుకోవాలని నడుం కట్టుకొన్న భారతనారి"

నవ్వుకున్నారిద్దరూ.

"అయితే ఇక మన పెళ్ళి వాయిదాలెందు కేస్తున్నావు? మూడు నెలల తర్వాతయినా నీ మనసు మారుతుందా? లేక నన్నింకా పరీక్షించదలచావా? చిన్నప్పటినుంచి ఫ్రెండ్‌షిప్ అన్నమాటేగానీ నీవెప్పటికప్పుడు నాకు పూర్తికాని పజిల్‌లాగా కనిపిస్తుంటావు సుమా" అన్నాడు మురళి సీరియస్‌గా.

"పాతికేళ్ళు నా అన్నవాళ్ళమధ్య పెరిగి పెళ్ళి పేరుతో గబుక్కున నీ వాళ్ళ మధ్యకు వచ్చెయ్యాలి. ఎంతో స్వేచ్ఛను కోల్పోవాలి. అణిగిమణిగి ఉండాలి. కానీ మగవాడికి మాత్రం పెళ్ళి పేరుతో ప్రత్యేకమైన కమాండ్ పెరుగుతుంది. నాకిదెలా తెలుసంటే... దానిక్కారణం మా యింటి వాతావరణం. అంతేకాదు. ఈ దేశంలో ప్రతి ఇంట్లోనూ ఈ కమాండింగ్‌ను మనం గమనిస్తూనే ఉంటాం. అఫ్‌కోర్స్... యావద్భారతం అలాగే ఉండదనుకో. అందుకే నా వాళ్ళ మనస్తత్వాలనుంచి, ఆచారాలనుంచి, కులమతాలనుంచి నేనెలా బయటకొస్తానో, నీవూ అలాగే నీ వాళ్ళ మనస్తత్వాలనుంచి, ఆచారాలనుంచి, కులమతాలనుంచి బయటకు రావాలి. జంటగానే కాపురం చేయాలి. ఇద్దరికీ స్వేచ్ఛ ఉండాలి. బాధ్యతలూ సమానంగా పంచుకోవాలి"

"ఇదేనా నీ సమస్య? " నవ్వుతూ అడిగాడు మురళి.

"అవును. కానీ ఇది పురుష ద్వేషసమస్య కాదని నీవు అర్థం చేసుకోవాలి. కేవలం స్త్రీల వ్యక్తిత్వ నిర్ధారణ సమస్య. దీన్ని సహృదయంతో చర్చించి మనుగడ సాగిస్తే మనిద్దరికీ మంచిది. కాదంటావా? "

"చూడురాజీ, నీవేమిటో, నీ ప్రపంచం ఏమిటో నాకు చిన్నప్పటినుంచీ తెలుసు. మన పెళ్ళివల్ల నీ స్వేచ్ఛకూ, నీ యొక్క 'యాక్టివిటీస్'కూ భంగం కలగదని హామీ ఇస్తున్నాను. ప్రతి వ్యక్తికీ తనదైన ఓ ప్రపంచం ఉంటుంది. అందులోకి భర్త అయినా సరే చొరబడకూడదు అన్నది నా పాలసీ. అలాగే భార్యకూడానూ. కానీ మనిద్దరం కలసి ఉన్నపుడు మాత్రం మనదైన ప్రపంచాన్ని అందంగా పటిష్టంగా నిర్మించుకుందాం. మంచి భార్య అంటే మంచి ఫ్రెండు. అలాగే మంచి భర్త అంటే మంచి ఫ్రెండ్. ఏమిటలా చూస్తున్నావు. పెళ్ళికాక ముందు పార్కుల్లో చెట్లకింద, ఉత్తరాల్లో, ప్రేమలేఖల్లో, ఇలాంటి కబుర్లు చెప్పి పెళ్ళవగానే కాలరెగరేసే సంకుచిత మగాళ్ళెందరులేరు? వీడూ అలాంటి కోవకు చెందడు కదా. అనుకుంటున్నావా? "

"అబ్బేలేదు... లేదు..." అంటూ నవ్వేసింది రాజేశ్వరి.

"పద, నిన్ను హాస్టల్ దగ్గర దింపి వెళతాను" అంటూ లేచి రాజేశ్వరికి చెయ్యి అందించాడు మురళి.

★ ★ ★

ఆరోజు పాణిగ్రహణం ఆఫీస్‌కు నిండా పదిహేనేళ్ళు కూడా లేని ఓ అమ్మాయి, మీసాలు కూడా పూర్తిగా మొలవని ఓ పద్దెనిమిదేళ్ళ అబ్బాయీ వచ్చారు. వాళ్ళవేపు స్టాఫంతా ఆశ్చర్యంగా చూశారు.

"ఎవరికోసం వచ్చారు? ఏ పనిమీద వచ్చారు? " అడిగింది రాజేశ్వరి.

"మేమిద్దరం ప్రేమించుకున్నాం. మీరు మా పెళ్ళి చేస్తారని వచ్చాం" అన్నాడబ్బాయి.

ఉలిక్కిపడ్డారంతా. ముందుగా రాజేశ్వరి

తెరుకుంది.

"మీ నాన్నగారేం పనిచేస్తారు? " అనడిగింది ఆ అబ్బాయిని.

"నాపేరు సుధీర్. మా నాన్నపేరు నాగ రాజారావు. మా నాన్న ఇన్‌కంటాక్స్ ఆఫీసర్. మా అమ్మ కూడా లెక్చరర్‌గా ఉద్యోగం చేస్తోంది. నేను టెన్త్ ఫెయిలయ్యాను. ఈ అమ్మాయి మా ఎదురింట్లో ఉంటుంది. పేరు రాణి. వాళ్ళ నాన్న పేరు మోసిన కంట్రాక్టరు. ఒక్కత్తే కూతురు. చాలా ఆస్తి ఉంది. మేమిద్దరం నెలరోజుల్నుంచి ప్రేమించుకుంటున్నాం. పెళ్ళి చేసుకోవాలనుకున్నాం" ముగించాడు సుధీర్.

"అలాగా, మంచిది. కానీ పెళ్ళి చేసుకుంటే ఏ ఉద్యోగం లేని నీవు ఆ అమ్మాయిని ఎలా పోషిస్తావు? "

"నాకు ఉద్యోగం లేకుంటే ఏం. మా నాన్న, అమ్మ సంపాదిస్తున్నారు కదా"

"మరి అయితే మీరిద్దరు ప్రేమించుకున్న విషయం మీ అమ్మానాన్నలకు తెలుసా? "

"వాళ్ళకు తెలుసుంటే పెళ్ళిచెయ్యమని మీ దగ్గరికెందుకొస్తాం? "

"ఓ... ఐ యామ్‌సారీ! ఈ అమ్మాయి తల్లిదండ్రులకు కూడా తెలియదన్నమాటే కదా? మీవాళ్ళు, వాళ్ళమ్మావాళ్ళూ ఇద్దరినీ వెళ్ళగొడితే ఎలా బతుకుతారు? ప్రేమతో కడుపునింపుకుంటారా? "

"మేం పెళ్ళి చేసుకుంటే వాళ్ళు వెళ్ళగొడతారని తెలుసు. అందుకే మా ఇంట్లోంచి నేను డబ్బు, నగలు దొంగతనంగా ఎత్తుకొస్తాను. రాణీ కూడా వాళ్ళింట్లోనుంచి డబ్బు, నగలూ ఎత్తుకొస్తుంది. ఓ మూడు నెలలు జల్సాగా తినటానికి, తిరగడానికి దాదాపుగా సరిపోతాయి. ఈలోగా వాళ్ళ కోపతాపాలు తగ్గిపోయి ఇంట్లోకి రమ్మనకుండా ఉండరు కదా. అదన్నమాట సంగతి" అంటూ గర్వంగా చెప్పాడు సుధీర్.

"చూడు సుధీర్! నీ ప్లాను సంగతి తర్వాత. మీరింకా మేజర్స్ కాలేదు. అలాంటివారికి మేం పెళ్ళిళ్ళు చెయ్యం" అంటూ నిష్కర్షగా చెప్పింది రాజేశ్వరి. రుసరుసలాడుతూ వెళ్ళిపోయారిద్దరూ.

"మనం వాళ్ళ తల్లిదండ్రులకు తెలియపరుద్దామా? " అంది రమ.

"ప్రేమట, ప్రేమ. ఛీ... ఛీ... ఇంత చిన్నవయసులో అసలు వీళ్ళకిలాంటి ఆలోచనలు ఎలా వస్తాయో ఏమిటో? " విజయ పళ్ళు నూరింది.

"అంతా సినిమాల ప్రభావం. ప్రేమ ప్రాధాన్యంగా సినిమా కథలు రూపొందించి యువతను పెడదోవ పట్టిస్తున్నారు? " సుశీల అంది.

"అసలు నిజమైన ప్రేమకు అడ్రసు లేకుండా పోతోంది"

తలోరకంగా వ్యాఖ్యానాలు చేసుకుంటుంటే చిరునవ్వుతో అందరినీ చూస్తుండిపోయింది రాజేశ్వరి.

"ఆ పిల్లప్రేమికులకు గోవర్ధని ద్వారా నాలుగు తగిలించి, వాళ్ల వాళ్లకు చెప్పి కొంపలో ఓ మూల పడేసుకోండి. లేకుంటే ఇంట్లో డబ్బూ, దస్కం కాస్తా ఎత్తుకుపోతారని చెప్పి ఉంటే బాగుండేదికదా! మరీ అంత పట్టనట్టుగా మీరు మేజర్స్ కారు, మేం పెళ్లి చెయ్యం అని చెప్పి పంపటం నాకేం నచ్చలేదు" అంటూ తన అభిప్రాయాన్ని నిర్మొహమాటంగా స్టాఫ్ ముందర చెప్పేసింది సుశీల.

"అలాగేం! ప్రేమ పెళ్లిళ్లు చేస్తామని బోర్డు వేసుకుంటే... మామూలు పెళ్లిళ్ల, ఆదర్శ పెళ్ళిళ్లు, ముసలాళ్ల పెళ్లిళ్లు చేయాల్సి వస్తోంది. ప్రేమ పెళ్లిళ్ల ప్రసక్తి లేకుండా మనం కూడా అందరిలాగా అన్ని కులాలవారికి పెళ్లిళ్లు చేస్తామని ఉంటే ఈ ప్రేమికుల గోల ఉండేది కాదు. సరే! ఏదో చేస్తున్నాం జరిగిపోతోంది అనుకుంటుంటే మరీ పదేళ్లు దాటిన కుర్రాళ్లు మాకూ ప్రేమ ఉంది. పెళ్లి చెయ్యండి అని వస్తుంటే తట్టుకోగలమా? మీరు మేజరు కాలేదని చెప్పి వెళ్లగొట్టక నీవు చెప్పిన తతంగమంతా చేయాలంటే

మనం ఈ బోర్డు తీసేసి ఏ సంఘ సంస్క ర్తల బోర్డో పెట్టుకోవాలి" అంది విజయ.

"మీరిద్దరూ అనుకుంటున్నట్టు నేను 'కామ్'గా మాత్రం లేను. సుశీల చెప్పినట్టు మరీ పోలీసులతో బెదిరింపు కార్యక్రమాలు చేస్తే మంచిది కాదు. మీది ప్రేమ కాదు వ్యామోహం అని చెప్పినా అర్థం కాని చిన్న తనం. వారిని దండించాలన్నా, బుద్ధి చెప్పా లన్నా వారి వారి తల్లిదండ్రులైతేనే మంచి దని నాకు తోచింది. ఇద్దరి అడ్రసులు కను క్కుని ఇద్దరి ఇళ్లకు మీ అబ్బాయిని... మీ అమ్మాయిని ఓ కంట కనిపెట్టండి. అంటూ ఓ ఆకాశరామన్న ఉత్తరం రాసి పడేశాను. నా ఆలోచన ప్రకారం వాళ్లిద్దరూ, తల్లిదం డ్రుల కంట్రోల్లో ఉంటారని అనుకుంటు న్నాను" అంది రాజేశ్వరి.

"ఆలోచన లేకుండా రాజీ ఏపనీ చెయ్యదు. నీవంతు కర్తవ్యం నువ్వు నెరవే ర్చావు. ఆ తర్వాత వారి అదృష్టం. ఎలా గైనా బ్రతకనీ. అన్నట్టు మా అమ్మనించి ఉత్తరం వచ్చింది చదువు" అంటూ ఇచ్చింది రమ.

"మీ అమ్మ ధైర్యంగా నీకు ఉత్తరం రాసిందా? ఆశ్చర్యంగా ఉందే? ఏం రాసిం దేమిటి? "

"ఇదిగో చదువు"

"రమకు అమ్మ వ్రాయునది,

నీవు ఇల్లు వదిలి వెళ్ళిపోతుంటే... తాత్కాలికావేశంలో నిర్ణయం తీసుకున్నా వని... తప్పకుండా తిరిగొస్తావని అనుకు న్నాను... నీ నిర్ణయం సరి అయినదని ఇప్పుడు మనస్ఫూర్తిగా చెబుతున్నాను. ప్రేమించటం నేరం. అందులోనూ కులాం తర వివాహం తప్పు అనుకునే సమాజంలో నా పద్దెనిమిదోఏట అడుగుపెట్టాను. మీ నాన్నగారి అడుగుల్లో నడచి నడచి ఆయన లాగే మారిపోయి అప్పుడే ముప్ఫయి సంవ త్సరాలవుతోంది. ఇన్నేళ్లకి నీ వల్ల ఇంట్లో ఓ యుద్ధం... ప్రశ్నించి ఎదురుతిరిగే గొంతు... నా వ్యక్తిత్వం నాదంటూ, ఎలు గెత్తి చెబుతున్న నిన్ను చూసి మొదట్లో ఇబ్బంది పడ్డా... నీ జీవితాన్ని నడుపుకునే రథసారధివి నీవే కావటం చూసి ముచ్చట పడ్డాను. నా ఆలోచనలూ... నా మనసూ నీవైపే చూస్తున్నాయి. కానీ ధైర్యంగా మీ నాన్నగారికి ఎదురు నిలువలేకున్నాను. అల వాటుగా తాపట్టిన కుందేటికి మూడే కాళ్లన్న వారి దారిని, సిద్ధాంతాన్ని మార్చలేను. ఆయ న్నలా బతకనీ! కానీ ఒకటి మాత్రం చెబుతు న్నాను. జీవితంలో నిర్ణయం తీసుకోవటం కంటే, ఆ నిర్ణయాలు సరి అయినవేనని నీ మనస్సాక్షిగా నమ్మటం ముఖ్యం. లేకుంటే తప్పు చేశానేమోననే ఆలోచనతో మనశ్శాం తిని పోగొట్టుకుంటావు. నీ తెగువకు, నిర్ణ యానికి విలువ లేకుండా మాత్రం చేసుకో వద్దు. మంచి తోడును వెతుక్కుంటావని నమ్ముతున్నాను. ఈ పిచ్చి అమ్మ కూతురు పంపే శుభలేఖ కోసం బతికుంటుందని మాత్రం మరచిపోకు. మీ అమ్మ!"

రాజేశ్వరికి కళ్లల్లో నీళ్లు తిరిగాయి. మన సంతా బాధగా తయారయింది. ఈ అమ్మ లెంత సున్నిత మనస్కులు. రాయిలా కని పిస్తూనే పిల్లలమీద ప్రేమకోసం ఇట్టే కరిగి పోతుంటారు.

"ఏమిటలా అయిపోయావు... మా అమ్మది అదోరకం చాదస్తంలెద్దూ" అంది రమ.

"చాదస్తం కాదు రమా! ఈ కాస్త ఉత్త రంలో నలభైఅయిదేళ్ల ఆమె జీవితం ఇరవై అయిదేళ్ల నీ జీవితం మిళితమై ప్రతిబింబి స్తోంది. నాటి అమ్మల ఆలోచనలు, నేటి అమ్మాయిల దృక్పథంతో కలిసిపోయి కొత్త ఊపిరి పోసుకుంటున్నాయి. ఈ మాత్రం బలం చాలు మనలాంటివాళ్ళకి" అంది రాజేశ్వరి తృప్తిగా.

ముందుగదిలో ఏదో గలాటా వినిపించ టంతో రాజేశ్వరి, రమ ఇవతలి గదిలోకొ చ్చారు. అయిదు నిముషాల్లో ఆ గలాటా

సారాంశం అందరికీ అర్థమైపోయింది.

ఆరు నెలల క్రితం ఓ అమ్మాయి తండ్రి కూతురికి వరుడు కావాలంటూ వచ్చి బయోడేటా వివరాలు ఇచ్చివెళ్ళాడు. అమ్మాయికేలోటు లేకపోవడంతో పైసా కట్నం లేకుండా మంచి వరుడిని పాణిగ్రహణం స్టాఫ్ వెతికిపెట్టారు. అమ్మాయి తండ్రి డబ్బున్న ఆసామీ అయి ఉండి కూడా, పెళ్లి ఆర్భాటంగా చేయకుండా చడీచప్పుడు లేకుండా తిరుపతి వెళ్ళి పెళ్లిచేసి అటునించి అటే కూతురుని అత్తారింటికి పంపాడు. అది వాళ్ల ఆచారం కాబోలనుకున్నారంతా. మంచి వరుడినికానీ, మంచి వధువును కానీ వెతికి జతచేసి... పెళ్లి చేయగానే పాణిగ్రహణం బాధ్యత ముగుస్తుంది. అలాగే ఈ పెళ్లి విషయంలో కూడా తమ బాధ్యత ముగియగానే ఇక ఆ విషయం దాదాపు మర్చిపోయారు. ఇకపోతే ఆ అమ్మాయికి ఓ ఫ్లాష్‌బ్యాక్ ఉందని తర్వాత తెలిసింది. ఆ అమ్మాయి పెళ్లి కాకమునుపు ఎవరో అబ్బాయిని ప్రేమించింది. ఆ విషయం తల్లిదండ్రులకు తెలియటం రెడ్‌హ్యాండెడ్‌గా పట్టుపడటంతో తప్పు ఆ అబ్బాయిమీద నెట్టివేసి తననల్లరి పెడుతున్నాడని ప్లేటు మార్చింది. అమ్మాయి తల్లిదండ్రులు ఆ అబ్బాయిని చితకబాదించి అవమానాల పాలు చేయటంతో అతను ఉరిపోసుకుని చచ్చాడు.

ఆ గతమంతా దాచి అమ్మాయి పెళ్లి పాణిగ్రహణం సహాయంతో చేశాడా తండ్రి. అంతా కుదుటపడిందనుకుంటే చనిపోయిన అబ్బాయి స్నేహితులు పెళ్లయిన ఈ అమ్మాయిపై పగబట్టారు. తమ స్నేహితుని చావుకి కారణమైన ఆ అమ్మాయిని సవ్యంగా కాపురం చేసుకోనివ్వకూడదని ప్రతిజ్ఞ పూనారు. ఆ అమ్మాయి, అత్తవారింటి అడ్రసు కనుక్కుని రోజుకొకటి లవ్‌లెటరు ఛండాలమైన భాషలో రాసి పోస్టు చేశారు. ఆ ఉత్తరాలు కొన్ని ఆ అమ్మాయి మామగారి చేతిలో పడ్డాయి. ఆ పెద్దాయన ఇపుడొచ్చి పాణిగ్రహణం ముందు చిందులు తొక్కుతున్నాడు.

"అంతా ఆడవాళ్ళే పెళ్ళిళ్లు కుదురుస్తున్నారు. ఎంతో మర్యాదస్తులతో కుదురుస్తారనుకుంటే, చెడిపోయిన వాళ్ళతో సంబంధాలు కుదురుస్తున్నారా? మేమేమిటి? మా వంశమేమిటి? ఆ పిల్ల తండ్రి మీకు డబ్బు ఎర చూపేసరికి, ఆ పిల్ల గత భాగవతమంతా దాచి, అన్నెం పున్నెం ఎరుగని మావాడికిచ్చి కట్టబెడతారా? మీకు పెళ్లిళ్లు కాకుంటే ఊరిమీద పడండి. అంతేకానీ, ఇలా వేశ్యలను సంసారులుగా మార్చే ప్రక్రియ మానండి" అంటూ నోటికొచ్చినట్టు మాట్లాడసాగాడు.

వీధిలో వెళ్లేవారంతా పనులు మానుకుని నిలబడి చోద్యం చూస్తున్నారు. పాణిగ్రహణం స్టాఫ్‌కు తలకొట్టేసినంతపనయింది. అతని నోరు మూయించటానికి ఎంత ప్రయత్నించినా సాధ్యం కాలేదు. అనునయ వాక్యాలకు లొంగకపోవటంతో రాజేశ్వరి తిరగబడినట్టు మాట్లాడింది.

"ఏమిటండీ! మీ వరస. అమ్మాయిని చూపించి జతకలిపాం. అంతవరకే మా బాధ్యత. లక్షలిచ్చినా మేము తప్పుమార్గాల్లో వెళ్ళం. ఆ అమ్మాయినే చేసుకోమని కాళ్ళా వేళ్ళా పడ్డామా? చూడగానే ఎగిరిగంతేసి కట్నం కూడా వద్దన్నారుకదా! అసలు మీమీద నాకిప్పుడు అనుమానమొస్తోంది. కట్నం ఎందుకు వద్దన్నారో నాకర్థమైంది. పైసకు పనికిరాడు అనుకున్నవాడు కూడా మగపుట్టుకే పెద్ద క్వాలిఫికేషన్ అయినట్టు కట్నం అడిగేవాళ్లున్న ఈ రోజుల్లో మీరు కట్నం వద్దని పెళ్లి చేసుకున్నారంటే మీ అబ్బాయిలో ఏదో లోపం ఉండిఉంటుంది. ఆ లోపం జనంముందు కవర్ కావాలన్న ఉద్దేశంతో పెళ్లి అయిందనిపించారు. ఇప్పుడు అసలు నిజం బయటపడుతుందని అమ్మాయిమీద పుకార్లు,

లెటర్లు అంటున్నారు. ఏదో ఒకరకంగా ఆ పిల్లను ఇంటినించి తరిమేసి వదిలించుకుందామని మీ ప్లాను. అసలు ఆ లెటర్లు మీరే వ్రాసి పోస్టు చేస్తున్నారేమో ఎవరికి తెలుసు. మా యస్.ఐ.ని పంపి ఆరాతీయించి మా వకీలు ద్వారా దర్యాప్తు జరిపిస్తాం" అంది కోపంగా. మనసులో మాత్రం అబ్బాయి గురించి లేనిపోని విషయాలు మాట్లాడవలసివచ్చినందుకు బాధపడింది.

"చూడమ్మా! తెలివిగా మాట్లాడుతున్నాననుకోవద్దు. పోలీసులు, కేసులు మా ఇంటా వంటా లేవు. నువ్వనుకుంటున్నట్టు మా అబ్బాయిలో ఏ లోపమూ లేదు. ఉన్న లోపమంతా అమ్మాయిలోనే"

"చూడండి! కేసులు, పోలీసులు అంటే ఇష్టం లేదన్నట్టు మాట్లాడుతున్నారు కాబట్టి చెబుతున్నాను. మీరు కాస్త నిదానంగా, సామరస్యంగా ఆలోచించండి. అమ్మాయిలో లోపం అని ఎందుకనుకుంటారు? ఈ రోజుల్లో ప్రతిమనిషీ కక్ష సాధింపు చర్యలోనే ఆనందం ఎక్కువగా అనుభవిస్తున్నాడు.

మీరు అవతలివైపునించి ఆలోచించండి. ఆ అమ్మాయి తండ్రిమీద పగతోనో, లేక వారి బంధువులకు ఆ అమ్మాయి కోడలయ్యే అవకాశం లేకపోవటమో అదీగాకుంటే ఏ కాలేజీ కుర్రాడికో ఆమె ప్రేమ దక్కలేదన్న కోపంతోనో... ఆమెను బజారుపాలు చేయాలని కంకణం కట్టుకుని ఇలా ఆకాశరామన్న ఉత్తరాలు రాస్తూండవచ్చు మీరవన్నీ నమ్మి బంగారంలాంటి కోడల్ని బజారుకీడిస్తే అన్ని విధాలా నష్టపోయేది మీరే

"మీ అబ్బాయికి మాత్రం మళ్లీ పెళ్లి అవుతుందంటారా? నింద అన్నది ఆడపిల్లకే కాదు, మగవాడిని కూడా వెంటపడి బాధిస్తుంది. ఆకాశరామన్న ఉత్తరాలెన్నాళ్లొస్తాయి? ఇకనుంచి వాటిని చదవకుండా వెంటనే చింపేయండి. మనశ్శాంతిగా వుండండి" అంది రాజేశ్వరి.

పెద్దాయన మెత్తబడి సణుక్కుంటూ వెళ్లిపోయాడు. ఆ అమ్మాయి తండ్రి వచ్చి రాజేశ్వరి చేతులు పట్టుకుని "నా కూతురు జీవితాన్ని నిలిపావు తల్లీ" అంటూ కళ్లనీళ్లు పెట్టుకున్నాడు.

"మీ కూతురులాంటివారు నూటికి ఒకరుంటే చాలు ఆడవాళ్ల పరువు మంటగలపడానికి. ఎవరి జీవితాలతోనైనా మనం ఆడుకుంటే మన జీవితాలు కూడా అలాంటి ఆటలకే తప్పకుండా బలి అవుతాయి. ఈ విషయం మీ కూతురుకి చెప్పి ఆమె కాపురాన్ని సవ్యంగా చేసుకోమనండి" అంది రాజేశ్వరి కఠినంగా.

ఆ అమ్మాయి తండ్రి వంచిన తల ఎత్తకుండా మెట్లు దిగి వెళ్లిపోయాడు. పాణిగ్రహణం స్టాఫంతా హమ్మయ్య అని ఊపిరి పీల్చుకున్నారు.



"లోపలికి రావచ్చాండీ!" ఓ యువతి గట్టిగొంతుతో పాణిగ్రహణం ఆఫీసు ముందు నిలబడి అడిగింది.

వయసు ఇరవై ఉంటాయి. మంచి ఎత్తు, లావుగా ఉంది. నల్లగా ఉన్నా కళ గల

మొహం. చూడగానే మొరటు అమ్మాయి అనిపించేలా ఉంది. వేషధారణ చూడగానే కూలీ నాలీ చేసుకునే అమ్మాయిలా ఉంది.

"ఏంటమ్మా! ఏమిటి నీ సమస్య! కూర్చో" అంది రాజేశ్వరి.

"నాకు మీరు పెళ్లి సేత్తారా? " అడిగిందా అమ్మాయి.

"తప్పకుండా! నీ పేరేంటి? " నవ్వుతూ అడిగింది రాజి.

"లచ్చిందేవి"

"నీకు అమ్మా నాన్న లేరా? "

"అయ్యోరామా! ఉన్నారు తల్లీ. ఓ తమ్ముడు కూడా ఉన్నాడు. మా అయ్య సిన్న సిన్న కాంట్రాక్ట పనులు సేత్తాడు. తమ్ముడు సదూకుంటున్నాడు. మా ఇంటి దగ్గర నా యీడు పిల్లలందరు కలిసి ఊరి బయట ఉన్న ఓ ఫ్యాక్టరీలో కూలిపనికి పోతుంటిమి. మా యజమాని శానా మంచోడు. ఆయనకు వళ్లు బాగా లేనపుడంతా ఆయన కొడుకు కిట్టబాబుగారు వచ్చేవారు. ఆ బాబు మిగతా అందరికన్నా నాతో బాగా మాట్లాడేవాడు. నాకూ ఆయనంటే ఇష్టం ఉండేది. ఆరునెల్లు నేస్తం చేసినాను. నాకు చీరలు, రవికలు కొనిపెట్టి నన్ను లొంగదీసుకున్నాడు. పెళ్లి సేసుకుందామని అడిగాను. తనకింతకుముందే పెళ్లయిందనీ, అయితే పర్మినెంటుగా నన్ను తనతో ఉండమనీ, వాళ్ళింటి పక్కన నాకో పాక వేసిస్తానని చెప్పాడు. నేను ససేమిరా అదేమీ వద్దు నన్ను పెళ్లి చేసుకొమ్మని బతిమిలాడాను. అది మాత్రం కుదరదన్నాడు. నాకు చాలా కోపం వచ్చింది. నన్ను అన్యాయం సేశావని అరిసి గోల చేత్తానన్నాను.

అందుకు వాడేమన్నాడో తెలుసా? "నువ్వు అరిచిగోల చేసినా ఎవ్వరూ నమ్మరు. ముత్యంలాంటి పెళ్లాం నాకుండగా, పేడపురుగులాంటి నీతో సంబంధం పెట్టుకున్నానంటే ఎవరూ నమ్మరు. మా గడపలో చీపురులాంటిదానివి. మా ఇంటికోడలి స్థానంలో రంగుల కలలు కంటావేం. నోరు మూసుకుని పడుండు. నిన్నెవరూ పెళ్లి చేసుకోరు. ఎందుకంటే నీతోపాటు పనికొచ్చే అమ్మాయిలకు మన సంగతి తెలుసు. నీవు పెళ్లి ప్రయత్నాలు చేస్తున్న విషయం తెలుసుకుని అడ్డుపుల్ల వేస్తాను జాగ్రత్త!" అంటూ బెదిరించాడు.

నాకు దిక్కు తెలవలేదు. ఎలాగైనా వీడిని దెబ్బకొట్టాలనుకున్నాను. పెళ్లి చేసుకుని నా తడాకా చూపించాలనుకున్నాను. ఎవడినో పెళ్లి చేసుకుంటే వాడికేం నష్టం జరగదు. అందుకు బాగా ఆలోచించా! వాడి తమ్ముడు వాడికంటే రెండేండ్లు సిన్నోడు. మతిస్థిమితం సరిగా లేనోడు. మునుపు ఎవరో పిల్లను ప్రేమించాడంట. కనిపించిన ఆడపిల్లలందర్నీ పట్టుకుని నన్ను పెళ్లి సేసుకుంటవా తాళి కడతా అంటూ ఎంట పడుతుంటడు. ఆడిని సూసి ఆడపిల్లలు భయపడుతుంటరు. వాడిని నేను పెండ్లి చేసుకుని వాళ్లకు బుద్ధి సెప్పాలనుకున్నాను" అంది ముగిస్తూ లక్ష్మిదేవి.

"వాడెవడో మోసం చేశాడని కక్షతో పిచ్చివాడిని చేసుకుంటే నష్టపోయేదెవరు? వాడిక్కాదు పిచ్చి నీకు? " అంది విజయ.

"ఇప్పటికే పూర్తిగా నష్టపడినాను. ఇంగ నాకు మావాళ్లు పెండ్లి సెయ్యరు. మా వాడంతా ఈ ఇసయం తెల్సిపోయింది. ఉంటే వాడికి ఉంపుడుగత్తెగా ఉండాల. లేకుంటే సావాల. బతకనియ్యరుగాక బతకనియ్యరు ఈ జనం. కానీ నాకు సావాలని లేదు. సచ్చి ఏం సాదిస్తా? బతికి వాన్ని సాదిస్తా. పేడపురుగునుకదా. వానింట్లోనే కాపురం సేసి వాటా పంచుకుంటా. పతి దినం వాడి గుండెలమీద కుంపటి ఎలిగిత్తా. సాచ్చెం లేకుండా పెండ్లి జరగకూడదని మీ దగ్గరకొచ్చిన మీ దాసిని. మీ సెల్లెలనుకొని నాకు పెండ్లి జెయ్యండి. ఆ తిక్కోడిని పట్టుకొస్తా" అంది లక్ష్మిదేవి.

"ఇంకోసారి బాగా ఆలోచించుకో లక్ష్మీదేవీ" అంది రాజేశ్వరి.

"ఇంగేం లేదమ్మా ఒకనాడు కాదు రెన్నాళ్లు కాదు. నెలదినాల్నించి తలపగిలేంత ఆలోసించినా. మీ గురించి ఇన్నాను. కట్టాల్లో ఉండేటోల్లందరికి పెండ్లిండ్లు చేసి పున్నెం గట్టుకుంటున్నారంటగా. మీ దగ్గర ఆడపోలీసోల్లేకాక, వకీలమ్మ కూడా ఉందంటగదా. మీరంతా నాకు అండగా ఉండి నా పెండ్లి సెయ్యండి. మిగతా కత నేను నడిపిత్తా" అంది.

"సరే! మమ్మల్ని ఆలోచించుకోనీ, ఈ పెళ్లివల్ల మాకు ఏ రిస్కు లేదనుకుంటే తప్పకుండా చేస్తాం. రెండురోజుల తర్వాత కనిపించు"అంది రాజేశ్వరి.

నమస్కారం పెట్టి వెళ్ళి వెళ్ళిపోయింది లక్ష్మీదేవి.

వారం తిరక్కముందే లక్ష్మీదేవికి, మతిస్థిమితంలేని రంగబాబుకు పాణిగ్రహణం ఆఫీసులో యస్.ఐ., లాయరు, స్టాఫ్ సమక్షంలో నిరాడంబరంగా పెళ్లి జరిపించారు. వారి పెళ్లి ఫొటో పేపర్లో వేయించి అనివార్య కారణాలవల్ల పెళ్లికి పిలవలేకపోయామనీ, దంపతులను ఆశీర్వదించాలని కోరుతూ ప్రకటన ఇచ్చారు. కొత్త కోడలిగా పిచ్చిమొగుడి చేతిని పట్టుకుని బంగాళాలో అడుగుపెట్టింది లక్ష్మీదేవి. అది చూసి శివమెత్తిన కిట్టబాబు, అతడి తండ్రి పాణిగ్రహణం ఆఫీసుకు వచ్చి రంకెలేశారు.

"మీ చిన్నకొడుకు, లక్ష్మీదేవి ప్రేమించుకొన్నారు, పెళ్లిచేసుకున్నారు. ఇప్పుడేం కొంప మునిగిందని అరుస్తున్నారు. అతనికి పిచ్చి కుదరాలంటే పెళ్లి కావాలి. పెళ్లి కావాలంటే పిచ్చోడని పిల్లనివ్వరు. ఇప్పుడు వాళ్లిద్దరు ఇష్టపడ్డారు. పెళ్లయింది. అంతా మీ మంచికే అనుకొని నిశ్శబ్దంగా ఉంటే మంచిది. అరిచి ఆరడి చేసుకుంటామంటే మాకేం భయంలేదు. మేం రెడీ!" అంది రాజేశ్వరి.

ఆమె మాటలు విని ముసలాయన నిశ్శబ్దంగా ఉన్నా కిట్టబాబు మాత్రం రంకెలేస్తూనే ఉన్నాడు.

"మీకంత బాధ ఎందుకు? లక్ష్మీదేవిని కోడలిగా చూడలేమనుకుంటే వారి వాటా వారికి పంచి ఇవ్వండి అంతేగా" అంది రాజేశ్వరి. తేలుకుట్టిన దొంగలా ఊc ఆc అనకుండా ఇంటిదారి పట్టాడు కిట్టబాబు.

★ ★ ★

నారాయణరావు హాల్లో ఓ మూల కింద కూర్చుని చిన్న అద్దం ఎదురుగా పెట్టుకుని తాపీగా గెడ్డం గీసుకుంటున్నాడు. పక్కనే ట్రాన్సిస్టరులోంచి పాటలు వినిపిస్తున్నాయి.

హడావిడిగా బయటనుంచి వచ్చిన చందూ "నాన్నా షేవింగ్ సెట్టు త్వరగా ఇవ్వు. నేనూ గెడ్డం గీసుకోవాలి అర్జంట్" అంటూ తొందరపెట్టాడు.

"ఏమిటంత అర్జంటు, సంతకాలు పెట్టే ఆఫీసరుద్యోగం వెలగబెట్టే పోజులు కొట్టకు. నాకు వళ్ళు మండుతుంది" కసిరినట్టు అన్నాడు నారాయణరావు.

"సంతకాలు పెట్టే ఉద్యోగం ఉంటే తప్ప గెడ్డం గీసుకోకూడదా? అరవై ఏళ్ళకు కాస్త అటూ ఇటూగా ఉన్న నువ్వే తెల్లారి లేవగానే అద్దం ముందేసుకుని గంటసేపు గెడ్డం గీక్కుని, గంటసేపు అన్ని యాంగిల్స్‌లో మొహాన్ని చూసుకుని మురిసిపోతావు. నీ అనుభవంలో సగం వయసులేని నేను మాత్రం మాసిపోయి బికారిలాగా ఉండాలా? పైగా సంతకాలు పెట్టే ఉద్యోగముందా? అని గేలి చేస్తావా? సంతకాలు పెట్టే ఉద్యోగం ఈరోజు కాకుంటే రేపు దొరుకుతుంది. కానీ, ప్రేమించే ప్రియురాలు మాత్రం ఈరోజే ఇప్పుడే దొరకాలి. లేకుంటే బతికి వేస్ట్. అందుకే గెడ్డం గీసుకుని ట్రిమ్‌గా తయారయి బీట్లు కొట్టాలి. లేడీస్ కాలేజీ వదిలే టైం అయ్యింది" అన్నాడు చందూ గడ్డానికి క్రీం రాసుకుంటూ.

"సిగ్గు లేదుట్రా నీకు. అసలు నీకు

తండ్రంటే భయం, భక్తి ఉన్నాయా? తండ్రి ఎదురుగ్గా ఎలా మాట్లాడాలన్న ఇంగిత జ్ఞానం కూడా లేదు. దమ్మిడీకి రికాణా లేని బికారిగాడివి. నీకు బీట్లు... ప్రియురాలూనా? నా కడుపున చెడబుట్టావుకదరా?"

"నేను కరెక్టుగానే పుట్టాను నాన్నా. ఒక్కసారి నీ ఫ్లాష్‌బ్యాక్ గుర్తుచేసుకో. 1974లో నువ్వు అమ్మ చదివే కాలేజీ గేటుదగ్గర చేతిలో గొడుగు ఉండి కూడా వర్షంలో తడుస్తూ నిలబడి అమ్మ రాగానే గొడుగు విప్పలేదూ? ఓరోజు అమ్మ కనిపించలేదని, ఆ రోజంతా అన్నం మానేసి దిగులుగా కూర్చుంటే 'ఏరా కన్నా! అన్నం మానేశావు ఎవరినైనా ప్రేమించావా?' అని మీ నానమ్మ అడగలేదూ"

"ఆపు... వెధవా... ఆపు" బుసలు కొట్టాడు నారాయణరావు.

"ఆవు చేలో మేస్తే దూడ గట్టున మేస్తుందా నాన్నా? ప్రేమకోసమే జీవిస్తాను. ప్రేమకోసమే మరణిస్తాను. నీ జీవితమే నాకు ఆదర్శం నాన్నా" దీనంగా మొహం పెట్టి అన్నాడు చందూ.

"ఏమిట్రా ఆ ప్రేలాపన. అసలు ప్రేమంటే తెలుసా నీకు. ఊరకుక్కలా ఆడపిల్లల కాలేజీ గేటు దగ్గర బీట్లు కొట్టటాన్ని ప్రేమంటారుట్రా వెధవా?"

"అలాగా నాన్నా. మరయితే దేన్ని ప్రేమంటారో చెప్పునాన్నా? ప్రేమకు నిర్వచనం చెప్పునాన్నా. రాత్రి ఎనిమిదింటికి రేడియోలో తెలుగు పాటలొస్తాయి. ఇక్కడ నేను వింటూంటాను కాబట్టి అవే పాటలు నీవూ మీ ఇంట్లో విను అని ఉత్తరంలో రాయటాన్ని ప్రేమంటారా? మీ నాన్న నీ పేరున బ్యాంకులో ఎంత డబ్బు వేశారు. అది నీవు మేజరయ్యేదాకా రాదేమోకదా అని అడగడాన్ని ప్రేమంటారా? లవ్వరుకు రాసిన లెటర్సు, లవ్వరు రాసిన లెటర్లు ఫ్రెండ్స్‌కు చూపించి ఎంజాయ్ చెయ్యటాన్ని ప్రేమంటారా? ..." అంటూ ఇంకా ఏదో మాట్లాడుతుండగానే షేవింగ్ సెట్టు బండ కేసి కొట్టి, "భ్రష్టుడా, వేపుకు తింటున్నావు కదరా" అంటున్న తండ్రిని చూసి,

'జన్మమెత్తితిరా. అనుభవించితిరా, బ్రతుకు సమరంలో...' అంటూ గట్టిగా పాడుతూ బయటకెళ్ళి పోయాడు చందూ.

ఆ సాయంత్రం పార్కులో ఐస్ క్రీం తింటూ విజయతో ఉదయం తాను తండ్రిని సాధించిన తీరు నవ్వుతూ చెప్పాడు.

"మీకు మీ నాన్నను సాధించే ఉద్యోగం తప్ప మరో ఉద్యోగం లేదా? లేక అవసరం లేదనుకున్నారా?" సీరియస్‌గా అడిగింది విజయ.

"నా స్థితిలో మీరుంటే తెలిసేది! మా నాన్న ప్రేమకథను గేలి చెయ్యాలన్నకోరిక లేదు నాకు. నా ఉద్యోగం గురించి... నా బతుకు గురించి ఆలోచించడు కదా. ఇదేమయినా శ్రీకృష్ణదేవరాయల కాలమా? పాండిత్యం చూసి, ముత్యాలు, రత్నాలతో, రాచమర్యాదలు చేసి ఆస్థానంలో కొలువు ఇవ్వడానికి, లంచం లేనిది పని జరగదాయె. పెట్టుబడి లేకుండా బిజినెస్ చేయాలంటాడు. లంచం ఇవ్వకుండా ఉద్యోగం సంపాదించాలంటాడు. ఈ రెండు పనులూ ఈ జన్మకు నావల్లకావు! నాకు చేతనైనది ఆయన్ని సాధించటమొక్కటే" అన్నాడు చందూ.

"ఆయన జీవితంలో తప్పే చేశాడో ఒప్పే చేశాడో... మీ అమ్మ మోసపోయినా కక్ష తీర్చుకుంటున్నా, ఏది ఏమైనా వారి జీవితాల్లో డెబ్బై శాతం గడిచిపోయింది. వాళ్ళను సాధిస్తూ మీరెంత టైం వేస్టు చేస్తున్నారో తెలుస్తోందా మీకు. పోయినకాలం తిరిగొస్తుందా? ఇది మాత్రం నచ్చలేదు నాకు. మీరు తెలివిలేని వారు మాత్రం కాదు. మీ నాన్నగారన్నట్టు లంచం లేకుండా ఉద్యోగమూ సంపాదించవచ్చు పెట్టుబడి లేకుండా బిజినెస్సూ చెయ్యొచ్చు

మనసుపెట్టి చేస్తే అన్నీ సక్సెస్ అవుతాయి. మీరు ఇంకొకరికి ఆదర్శప్రాయంగా బతకాలి. అంతేకానీ ఇపుడు మీరు నడిచిన దారిలో మీ పిల్లలు... నడవకూడదంటే... ఇలా సాధింపులు వేధింపులకు మీరు గురి కాకుండా జీవితాన్ని దిద్దుకోండి. ఒక స్నేహితురాలిగా ఇంతకంటే ఎక్కువ చెప్పలేను" అంటూ అక్కడినుంచి లేచి వెళ్ళిపోయింది విజయ సీరియస్‌గా.

విజయ వెళ్ళిపోయాక కూడా చాలాసేపు అలాగే కూర్చుని ఆలోచిస్తుండిపోయాడు చందూ!

★ ★ ★

"మీరు నా పెళ్ళి చేయగలరా? " అంటూ పాణిగ్రహణం ఆఫీసుకొచ్చి అడిగాడో యువకుడు.

"మొదటి పెళ్ళే అయితే తప్పకుండా చెయ్యగలం" అంది విజయ.

"జులాయిగాళ్ళందరికీ ఈ పాణిగ్రహణం ఆఫీసు క్లబ్బులాగానో, పార్కులాగానో కనిపిస్తోంది. ప్రతి వెధవా వచ్చి నా పెళ్ళి చేస్తారా? అనడుగుతాడు. అందులోనూ ఈ మహాతల్లి 'ప్రేమపెళ్ళిళ్ళు', గాడిద గుడ్డు అంటూ ప్రకటనలిచ్చిందా? పదేళ్ల కుర్రాడూ ప్రేమించాను పెళ్ళి చేయండనటమే... కాటికి కాళ్ళు చాపుకున్న ముసలాడూ ప్రేమించాను పెళ్ళి చెయ్యండి అంటూ రావటమే... వీళ్ళందరినీ చూస్తుంటే అసలు నిజమైన ప్రేమ ఎక్కడ దాక్కుందో అసలు ఉందో లేదో అనిపిస్తోంది. అసలు ఆడాళ్ళు ఏం పని చేసినా ఈ మగాళ్లకు చులకన" అంటూ ప్రతిరోజూ విజయ స్టాఫ్ ముందర నిరసన ప్రకటిస్తుంటుంది.

కానీ, మిగతా స్టాఫందరూ ఈ వృత్తిని ఇంటరెస్టింగ్‌గానూ, ఛాలెంజ్‌గానూ తీసుకుంటారు. విజయమాత్రం ఏమాత్రం నిర్లక్ష్యంగాకానీ, చులకనగా కానీ మాట్లాడే కస్టమర్స్ వస్తే భరించలేదు. కోపంగా జవాబులిస్తుంటుంది.

విజయను ఎప్పటికప్పుడు వారిస్తుంటుంది రాజేశ్వరి. "ఏ ఉద్యోగంలోనైనా రిస్కులు తప్పవు. అందులోనూ ఆడవాళ్ళు ఇలాంటి అసాధారణ వృత్తులు చేపడితే, మగవాళ్ళు... కొంతమంది మగవాళ్ళు ప్రోత్సహిస్తే మరి కొంతమంది నిరుత్సాహపరచటమో, గేలి చేయటమో చేస్తుంటారు. అవన్నీ పట్టించుకుంటే మనం వృత్తిలో మనలేం!

అసలు మనం ఎన్నుకున్న వృత్తిమీద మనకే గౌరవం లేకుండా, అనుక్షణం ఈసడించుకుని చేస్తుంటే, ఇతరులు గౌరవిస్తారా? నీకంత ఇష్టంలేని పని ఎవరు చెయ్యమన్నారు? ఇంకో జాబ్ వెతుక్కుని వెళ్ళచ్చుగా? " అంటూ చాలాసార్లు కోపగించుకుంది. కొన్నిసార్లు సర్ది చెబుతూ ఉంటుంది.

"వెళ్ళేదాన్నే! ఈ వృత్తిలో మనకు మనమే బాస్. ఇలా స్వతంత్రంగా బతకడం అలవాటయింది. అదీగాక డబ్బు ఇబ్బందుల్లేవు" అంటూ మళ్ళీ రాజీకొచ్చేది విజయ.

ఆ వచ్చిన యువకుడిని నఖశిఖపర్యంతం చూస్తూ "ఇలా కూర్చోండి! మీరేమిటి? " అనడిగింది రాజేశ్వరి.

"నాపేరు భక్తవత్సలం. నేనో అమ్మాయిని ప్రేమించాను. పెళ్ళి చేసుకోవాలనుకుంటున్నాను"

"అలాగా! ఆ అమ్మాయినీ తీసుకురాలేకపోయారా? చూసేవాళ్ళంకదా"

"ఆమెను నేనే ఇంతవరకూ చూడలేదు"

స్టాఫందరూ అతని సమాధానం విని ఉలిక్కిపడ్డారు.

"విషయం ఏమిటో వివరంగా చెప్పండి" సీరియస్‌గా అంది విజయ, వీడెవడో టైంపాస్‌కోసం ఇక్కడికొచ్చాడు అని మనసులో అనుకుంటూ.

విజయను కళ్ళతోనే వారించింది రాజీ.

"నేను నిజంగానే చెబుతున్నాను. నేనో అమ్మాయిని ప్రేమించాను. కానీ ఇంతవ

రకూ చూడలేదు. నేను డిగ్రీ పాసయ్యాను. ప్రస్తుతం ఖాళీగా ఉంటూ ఉద్యోగ ప్రయత్నంలో ఉన్నాను. ఓ మూడునెలల క్రితం ఏదో మేగజైన్ తిరగేస్తుంటే అందులో కలం స్నేహం చేసేవారి అడ్రసులు రాశారు. అందులో 'సౌందర్య' అనే అమ్మాయి పేరు, అభిరుచులు నాకు బాగా నచ్చాయి. వెంటనే అడ్రసు తెలుపుతూ ఉత్తరం రాశాను. అంతే... వారం తిరక్కముందే రిప్లై వచ్చింది. వెంటనే నేనూ రాశాను. ఆవిధంగా మా మధ్య ఉత్తరాల పరంపర కొనసాగింది. చివరికి ఆ ఉత్తరాల సారాంశంగా తేలిందేమిటంటే మేమిద్దరం ఒకరినొకరు ప్రేమించుకుంటున్నాం అని. ఇంతవరకూ ఆమెను నేను చూడలేదు. ఆమె ఫోటో పంపిస్తానంది. నేనే వద్దన్నాను"

"అదేమిటి? ఎందుకు వద్దన్నారు? మీకామెను చూడాలనిపించలేదా? " అడిగింది రాజి.

"లేదు. ప్రేమలేఖ సినిమాలో క్లైమాక్స్‌లో హీరోహీరోయిన్లు ఒకరినొకరు చూసుకుంటారుకదా. నా ప్రేమకథలో మంగళసూత్రం కట్టింతర్వాత తప్ప చూడకూడదనుకున్నాను"

"ఇలాంటి చచ్చుప్రేమకథేదో అయ్యుంటుందనే ఎక్స్‌పెక్ట్ చేశా" గుసగుసగా సుశీలతో అంది విజయ.

"మీ సంగతి సరే! సౌందర్యగారు మిమ్మల్ని చూడాలనుకోలేదా? "

"అదే కదా మరి ప్రేమంటే. ఆమె కూడా నన్ను చూడాలనుకోవడంలేదు. మా ఇద్దరి ఆలోచనలూ, అభిరుచులూ కలిసిపోయాయి కాబట్టే మామధ్య పవిత్రప్రేమ పుట్టింది. పెళ్ళి ఏర్పాట్లన్నీ చేశాక ఉత్తరం రాస్తే తను వచ్చేస్తానంది. అందుకే మీ దగ్గరకొచ్చాను"

"ఇంతకీ మేం చెయ్యాల్సిన పనేమిటి? " అడిగింది విజయ విసురుగా.

"నేనా అమ్మాయి అడ్రసు ఇస్తాను. పెళ్ళి ఏర్పాట్లు పూర్తయ్యాయని మీ పాణిగ్రహణం తరఫు ఉత్తరం ఆమెకు చేరితే నమ్మకం ఏర్పడుతుంది"

"అంటే ఆమెకు మీమీద నమ్మకంలేదా? "

"నమ్మకం ఉన్నప్పటికీ పెళ్ళి విషయం కాబట్టి మధ్యవర్తులు, పెళ్ళిపెద్దలు అవసరంకదా!"

"సరే! అడ్రసిచ్చి వెళ్ళండి. ఆమెనుంచి ఉత్తరం రాగానే మీకు కబురంపిస్తాం" అంది రాజేశ్వరి.

ఆ తర్వాత వారం రోజులకు సౌందర్య నుంచి ఉత్తరం వచ్చింది. అది చదివి పాణిగ్రహణం స్టాఫందరూ పొట్టలు పగిలేట్టు నవ్వారు. ఆ ఉత్తరం ఇలా ఉంది.

"పాణిగ్రహణం స్టాఫ్‌కి నమస్కారాలు. మీ ఉత్తరం చేరింది. నా పేరు సౌందర్రాజన్, నా వయసు 22. కలం స్నేహం కొరకు నేను నా అడ్రసు పత్రిక్కి పంపాను. కానీ అందులో అచ్చు పొరపాటువల్ల నా పేరు సౌందర్య అని ముద్రించారు. పత్రికకు నేను ఆ అచ్చుపొరపాటు గురించి వ్రాసేలోగానే భక్తవత్సలంగారినుంచి ఉత్తరం వచ్చింది. నేనో అందమైన అమ్మాయినని ఊహించుకుని ఆయన రాసిన ఉత్తరం చూసి మ్రాన్పడిపోయాను. నాకు ఆ కలంస్నేహం అలాగే కొనసాగించాలని కోరిక కలిగింది. నాకు ఆయన రాసే ప్రతి ఉత్తరం, నేను ఆయనకు రాసే ప్రతి ఉత్తరం ముందు స్నేహంగా, ఆ తర్వాత... తర్వాత ప్రేమగా మారటం ఇదంతా థ్రిల్లింగ్‌గా ఉండేది. అలా ఎంజాయ్ చేస్తూ గడిపేశాను. ఇపుడా మహానుభావుడు ఏకంగా అదేదో సినిమా రికార్డును బద్దలు కొట్టే ప్రయోగం అంటూ... తాళి కట్టింతర్వాత నన్ను చూస్తాడుట. పెళ్ళి అంటాడు... పాణిగ్రహణం స్టాఫ్ అంటాడు. ఆయన రాతలు చూస్తుంటే నాకు ఇప్పుడు బాధనిపిస్తోంది. పెళ్ళిదాకా వస్తాడనుకోలేదు. కలం స్నేహం కదా

ఎప్పుడో ఓసారి అసలు నిజం చెబితే అతనూ నవ్వుకుంటాడనుకున్నా కానీ ఇలా పిచ్చి ముదిరి పాకాన పడుతుందనుకోలేదు!

ఏది ఏమైనా ఎవరి పిచ్చికెవరు బాధ్యులు చెప్పండి. సరే పెళ్ళి ఏర్పాట్లు చెయ్యండి. పెట్టే బేడాతో వచ్చేస్తానని రాశాను. మిమ్మల్ని సంప్రదించినట్టున్నాడు. మీ నుంచి ఉత్తరం వచ్చింది. ఇకపోతే నాకు బొంబాయిలో ఉద్యోగం వచ్చింది. ఈ రోజే ఇల్లు ఖాళీ చేసి వెళ్ళిపోతున్నాను. ఆ పిచ్చి ప్రబుద్ధుడికి మీరైనా చెప్పండి. సినిమా స్ఫూర్తితో తాళి కట్టింతర్వాత తప్ప అమ్మాయిని చూడను అని ఇతననుకుంటున్నట్టు, ఈకాలం ఆడపి ల్లలు గుడ్డిగా తల వంచుకుని తాళి కట్టించు కోరని వివరంగా నచ్చచెప్పండి. బైదిబై అతని కలం స్నేహంవల్ల నాకు టైంపాస్ మరియు ఎంజాయ్‌మెంట్ దొరికినందుకు నేనతనికి థ్యాంక్స్ చెబుతున్నానని చెప్పండి. ఇకపోతే మా పెళ్ళికి మధ్యవర్తిత్వం వహించటానికొ చ్చిన మీరు మా యిద్దరిమధ్యనున్న చిక్కుస మస్యకు మధ్యవర్తిత్వం వహించాల్సి వచ్చినం దుకు మీకు మొదట సారీ, ఆ తరువాత థ్యాంక్స్, చివర్లో నమస్కారాలతో ముగిస్తూ,

సౌందర్య అలియాస్ సౌందర్రాజన్

"ఈ ఉత్తరం భక్తవత్సలం చదివి అప్‌సెట్ అవుతాడేమో" అంది రాజేశ్వరి.

"అప్‌సెట్ కాకుంటే ఇన్‌సెట్ అవనీ, మనకేం. మంచిపని జరిగింది. లేకుంటే ప్రేమలేఖ సినిమా అట, కొత్తతరహా ప్రేమట, గాడిద గుడ్డుట. వెధవ్వేషాలు కాదూ! నాకుమాత్రం భలే సంతోషంగా ఉంది" అంది విజయ.

"అతనిక్కడికొచ్చి ఈ ఉత్తరం చూసి, ఫీలింగ్స్ మారుతుంటే, మనం నచ్చచెబు తుంటే... ఓ పెద్దసీన్ క్రియేట్ చెయ్యటమెం దుకు. అతని అడ్రసుకు ఈ ఉత్తరం పోస్టుచె య్యండి" అంది రమ.

"గుడ్ అయిడియా! ఆ పని చేద్దాం" అంది రాజేశ్వరి.

★ ★ ★

"అదేమిటండీ! ఆమధ్య మీ అబ్బాయికి సంబంధం వెతికిపెట్టాం. అమ్మాయి నచ్చింది. త్వరలోనే ముహూర్తాలు పెట్టు కుంటాం. మాకూ కబురు పంపుతామ న్నారు...?" అంది రాజేశ్వరి యాభైఏళ్ళ పరంధామయ్యగారిని కూర్చోమని చెబు తూనే!

"లేదమ్మా! ఆ సంబంధం మాకు అచ్చిరా లేదు. వద్దనుకున్నాం"

"అచ్చిరాలేదా? అంటే?"

"ఆరోజు అమ్మాయిని చూశాం. మా అబ్బాయికీ నచ్చింది. కట్నం కూడా మాకు సంతృప్తిపరిచే విధంగా ఇస్తామన్నారు. అన్నీ సవ్యంగా ఉన్నాయి ఈరోజే మంచి రోజు కూడా అని పెద్దలు చెప్పడంతో తాంబూలాలు పుచ్చేసుకున్నాం. మంచిసం బంధం కుదిర్చారుకదా, పాణిగ్రహణం స్టాఫ్‌కు మంచి సంభావన ముట్టచెబుదా మని కూడా అనుకున్నాం. కానీ తాంబూ లాలు తీసుకుని ఇంటికి వెళ్ళినరోజే మా బావమరిది కూతురుకు తేలు కుట్టిందని ఫోనొచ్చింది. దాంతో ఇంట్లో ఆడవాళ్ళు... మా నాన్నగారు... ఇలా తేలు కుట్టడం, అపశకునం, ఈ పెళ్ళిసంబంధం... కాన్సిల్ చెయ్యండంటూ గోల చేస్తున్నారు. ఉన్న విషయం తెలుపుతూ ఇప్పుడే ఉత్తరం రాసి ఇలా వచ్చాను. మా అబ్బాయికి ఇంకో సంబంధం చూడండి" అన్నాడాయన తేలిగ్గా.

రాజేశ్వరికి కోపం నసాళానికంటింది. విజయముఖం కోపంతో జేవురించింది. స్టాఫందరికీ ఆ పెద్దాయనమీద విపరీతంగా కోపం వచ్చింది.

"తాంబూలాలు కూడా పుచ్చేసుకుని పెళ్ళి క్యాన్సిల్ అని ఎంత సులభంగా చెబుతు న్నాడో చూడు. ఇలాంటివారిని పీకపిసికి చంపినా పాపంరాదు" అంది విజయ రమతో.

"తేలు కుట్టింది మీ ఇంట్లోవారికి కాదు కదా! ఎక్కడో వేరే ఊళ్ళో ఉన్న మీ బావ మరిది కూతురుకు తేలుకుడితే మీ అబ్బాయి పెళ్ళికి అపశకునమెలా అవుతుంది చెప్పండి. తాంబూలాలు కూడా పుచ్చేసుకున్న తర్వాత ఇపుడు వద్దంటే ఆ అమ్మాయి భవిష్యత్ గురించి ఆలోచించారా? " అంది సాధ్యమైనంత సౌమ్యంగా రాజి.

"ఏ ఊళ్ళో ఉన్నా చెడువార్త చెడువార్తే కదమ్మా. అయినా ఇది నా ఒక్కడి నిర్ణయం కాదుకదా! ఇంట్లోవాళ్ళందరితో నేను ఏకీభవించకపోతే రేపేదైనా జరగరానిది జరిగితే అందరూ నన్ను దులుపుతారు. ఇకపోతే ఆ అమ్మాయి భవిష్యత్తంటారా? వాళ్ళకేం దండిగా డబ్బుంది. ఎలాగోలా పెళ్ళి చేసేస్తారు" అన్నాడాయన.

"మీ అబ్బాయి ఏమంటున్నాడు? ఇందుకు ఒప్పుకున్నాడా? "

"వాడేమంటాడు కుర్రకుంక. మొదట్లో కాస్త గంతులేశాడు కాదు, కూడదు ఆ పిల్లనే చేసుకుంటానంటూ. అందరం కలిసి నోరు మూయించాం" ఇకిలిస్తూ అన్నాడు.

"సరే, ఏదైనా సంబంధం వస్తే తెలియపరుస్తాం వెళ్ళిరండి" అంది రాజి కోపం అణచుకుంటూ.

"ఏమిటి తెలియపరచేది. చచ్చీచెడీ, గాలించి సంబంధం కుదురుస్తే తేలుకుట్టింది అంటూ ఇంకో సంబంధం అంటూ వచ్చాడు. ఈ సారి ఇంకో సంబంధం చూస్తే అమెరికాలో ఉన్న బంధువులకి చీమ కుట్టిందనో, గాజువాకలో బంధువుల్ని గాడిద తన్నిందనో సంబంధాలు కాన్సిల్ చేసుకుంటూ పోతుంటాడు. చిన్నచిన్న కారణాలతో బాగానే సంబంధాలు ఎగరగొడుతుంటాడు. మేం నీ కొడుక్కి సంబంధాలు చూడముగాక, చూడం. ఇంకోసారి ఈ ఛాయలకు రాకు" అరిచినట్టు అనేసింది విజయ.

"మీరేం ఊరికే... ఉచితంగా సంబంధాలు కుదురుస్తున్నారా. బోలెడు కమీషన్లు లాగటంలేదా? చేతకాకపోతే చేతకాదని చెప్పండి. అయినా అంట్లుతోముకుంటూ ఇంట్లో పడుండే ఆడాళ్లు పెళ్లిళ్ల పేరమ్మల వేషాలేస్తే సంబంధాలు కూడా ఏడ్చినట్టే ఉంటాయి" అంటూ నోటికొచ్చినట్టు పేలుతుంటే తలో మాట అని తరిమినంత పని చేశారు పాణిగ్రహణం స్టాఫు.

ఆ మరుసటిరోజు సదరు పరంధామయ్య కొడుకు పాణిగ్రహణం ఆఫీసుకొచ్చాడు. అతణ్ణి చూడగానే స్టాఫందరికీ కోపమొచ్చింది. విజయ ఏదో మాట్లాడబోతుండగా రాజి కళ్లతో వారించి "ఏమిటిలా వచ్చారు? " అంది సీరియస్‌గా.

"మీరు చాలా కోపంగా ఉన్నట్టున్నారు. నిన్న జరిగిందంతా మా నాన్న ద్వారా తెలిసింది. ఎవరికో తేలుకుడితే సంబంధం క్యాన్సిల్ అంటున్న మా నాన్నతోను, ఇంట్లో వారి వాదనతోను నేను ఏకీభవించలేకపోతున్నాను. తాంబూలాలు పుచ్చుకోవటమంటే సగం పెళ్లి జరిగినట్టేనని పెద్దలంటారు. తాంబూలాలు పుచ్చుకోగానే ఆ అమ్మాయి నా మనసులో భార్య స్థానం ఆక్రమించుకొంది. ఆమె మనసులో కూడా నన్ను భర్తగా ఎప్పుడో ముద్రించి ఉంటుంది. ఇపుడిలా వీళ్ల మూర్ఖత్వంవల్ల పెళ్లి క్యాన్సిల్ అయిందని తెలిస్తే ఆమె ఏదయినా అఘాయిత్యం చేసుకుంటే ఏమిటి చెయ్యటం? అందుకే అన్నీ ఆలోచించాను.

"మా నాన్న ముందు ఆయన మాట వింటున్నట్లు నటించి ఆయన పెళ్లివారికి రాసిన ఉత్తరం బాక్సులో వేసి రమ్మన్నా సరేనన్నాగానీ పోస్టు చెయ్యలేదు. ఈలోగా మా నాన్న మీతో పోట్లాడిన విషయం తెలుసుకున్నాను. ముందుగా ఆయన తరపున నేను మిమ్మల్ని క్షమాపణ కోరుతున్నాను. నాక్కాబోయే భార్యకు విషయం వివరించి చెప్పి ఇక్కడికి తీసుకొస్తాను. ఈ

పాణిగ్రహణం ఆఫీసులోనే నా పెళ్ళి జరగాలి" అన్నాడతను ముగిస్తూ.

"అలా జరిగితే మీ నాన్నగారు మళ్ళీ మా మీదకు దండెత్తి వస్తాడేమో" భయపడినట్టు అడిగింది సుశీల.

"ముందు పెళ్ళి జరిపించండి. మీ మీద ఎలాంటి వత్తిడి రాకుండా నేను చూసుకుంటాను" అన్నాడతను.

వారంలోగానే పరంధామయ్య కొడుకు పెళ్ళి నిర్విఘ్నంగా జరిగింది.

ఎలా నచ్చచెప్పాడో, ఏం చేశాడో తెలియదుకానీ పరంధామయ్య మాత్రం పాణిగ్రహణం ఛాయలకు కూడా రాలేదు.

తండ్రి మాటలకు తల ఒగ్గి ఓ అమ్మాయి జీవితం పాడుచేయకుండా ధైర్యంగా పెళ్ళి చేసుకున్న పరంధామయ్య కొడుకు గురించి పాణిగ్రహణం స్టాఫు చాలా రోజులు ప్రశంసిస్తూ మాట్లాడుకున్నారు.



"మీ నాన్నగారికి ట్రాన్స్‌ఫరయిందిట. నీకు తెలుసా?" అడిగాడు మురళి రాజేశ్వరిని.

"ట్రాన్స్‌ఫర్ కాలేదు. ట్రాన్స్‌ఫర్ చేయించుకుని వెళ్ళిపోయాడని తెలుసు"

"ఏమీ తెలీని దానిలా ఆఫీసే ప్రపంచం, ఆదర్శ వివాహాలే ధ్యేయంగా బతుకుతున్నట్టు కనిపిస్తావు. అన్ని సంగతులూ తెలుసుకుంటూంటావు" అన్నాడు మురళి నవ్వుతూ.

"ప్రపంచంలో మా నాన్నలాంటి వారుండరేమో! కూతురిమీద పగ సాధించటానికన్నట్టు మా అమ్మను నాకు దూరం చేస్తున్నాడు"

'ప్రపంచంలో ఇలాంటి కూతురు ఎవరికీ ఉండదు. మగరాయుడిలా ఇంట్లోంచి వెళ్ళిపోయింది చాలక అసాధారణ ఉద్యోగం చేసి అందరి నోళ్ళలో పడి నా పరువు మంటగలుపుతోంది' అని ఆయన అనుకుంటుంటారు. అందుకే ఊరు విడిచి వెళ్ళిపోయారు. మీ అమ్మ... కాదు మా అత్తయ్య ఊరు వెళ్ళేముందు మా ఇంటికొచ్చింది. నీ గురించి చాలా బెంగపెట్టుకుంది.

"ఒంటరిగా ఎలా ఉంటుందో ఏమిటో అంటూ ఒకటే దిగులు, కన్నీళ్ళు. అమ్మకు నేను సర్ది చెప్పి నీ పూచీ నేను తీసుకుని చేతిలో చెయ్యేసి ఒట్టేసేదాకా అలా కన్నీళ్ళు కారుస్తూనే ఉంది. వారానికో ఉత్తరం తప్పనిసరిగా నిన్ను రాయమని చెప్పమంది. ఊరెళ్ళగానే అడ్రసు ఇచ్చి ఉత్తరం రాస్తానంది" అన్నాడు మురళి.

కనుకొలకుల్లో నిలిచిన నీరు చీరకొంగుతో అద్దుకుంది రాజేశ్వరి.

"దేనికీ భయపడకుండా బతికే నువ్వేనా ఇలా కన్నీళ్ళు పెట్టుకునేది?"

"గృహిణిగా, తల్లిగా, వంటమనిషిగా తయారై తన అసలు స్వరూపాన్ని మరిచిపోయి అస్థిత్వాన్ని కోల్పోయే పరిస్థితి అమ్మకు తరచూ ఏర్పడుతూనే ఉంది. ఇలాంటి పరిస్థితిలో నాన్న అమ్మ మీద అధికారం చూపించి అణచివేయాలనుకోవటం అవివేకంకాదా? ఆమెను ప్రేమించి పెళ్ళి చేసుకొన్నాడంటే నాకు మాత్రం నమ్మశక్యం కాదు. ఈ రోజుల్లో స్త్రీలు దేన్నయినా భరిస్తారుకానీ భర్త అలక్ష్యాన్ని, నిర్లక్ష్యాన్ని

మాత్రం భరించలేరు. నా పదేళ్ల వయసు నించి నాన్న అమ్మకు అందిస్తున్నదే నిర్లక్ష్యం, కక్షసాధింపు, అణచివేత" ఆవేదనగా అంది రాజి.

"మీ నాన్నగారిని మరీ అంత తీసిపారేసి మాట్లాడతావేమిటి రాజీ! మీ అత్తయ్య మీ ఇల్లు చేరకముందు మీ ఇంట్లో ఏ గొడవలు లేవనే దానివి గుర్తుందా? ఆవిడ వచ్చాక సమస్యలు, పోట్లాటలు... తోడబుట్టినదాని మీద కోపం చూపించలేక మీ అమ్మమీద కోపం చూపించి ఉంటారు"

"ఏమిటీ! మా నాన్నను అంతలా వెనకేసుకొస్తున్నావ్. స్వజాతి అభిమానమా? ఇంట్లోకి ఓ కొత్త మనిషి వస్తే సమస్యలు, పోట్లాటలు దానికి వేరే ఇంకెవరూ కాకుండా భార్యే బలికావాలా? ఆమె రాక ముందు అన్యోన్యంగా ఉన్నారు. ఆమె వచ్చాక మా నాన్న రంగు బయటపడింది. మంచివాడి బుద్ధి మాంసం దగ్గర బయట పడుతుంది" అనే ముతక సామెతకు పూర్తి నిదర్శనం మా నాన్నే"

"దేవీ శ్రీరాజరాజేశ్వరీదేవీ! టాపిక్ మార్చు తల్లీ! నీ కోపంతో మన చుట్టూ పదడుగుల దూరం వరకూ వాతావరణం వేడెక్కి ఆవిర్లు వస్తున్నాయి. చూడు చూడు" అంటూ హాస్య ధోరణిలో మాట్లాడసాగాడు మురళి.

"హమ్మయ్య! నువ్విక్కడున్నావా? ఓ సారీ మురళిగారున్నారా? " అంటూ వెనుదిరిగి పోబోతున్న విజయను

"ఏయ్! ఆగు. ఇక్కడేదో రహస్యమంతనాలు జరుగుతున్నట్టు ఊహించుకుని ఏమిటా పరుగు. రా ఇలా కూర్చో" అంటూ చెయ్యి పట్టి లాగి కూర్చోపెట్టింది విజయను రాజి.

"ఏమండీ! విజయగారూ! మీ పెళ్లెప్పుడు? " ప్రశ్నించాడు మురళి.

"ఏమిటీ? పెళ్లా? నాకా? భలేవారే" అంది నవ్వుతూ.

"ఏమిటండీ ఈ అన్యాయం! మీ స్టాఫంతా దేశంలో అందరికీ పెళ్లిళ్లు చేస్తాం కానీ మేం మాత్రం కన్యలుగానే ఉండిపోతాం అని భీష్మ ప్రతిజ్ఞలాంటిదేమైనా చేశారా? "

"అలాంటిదేం లేదుకానీ స్టాఫ్‌లో ముఖ్యమైన వారికి ఇంకా సరియైన జోడీ దొరకలేదుకదా! అందరం ఒకేసారి పెళ్లిళ్లు చేసుకుని మిమ్మల్ని సర్‌ప్రయిజ్ చేస్తాం చూస్తుండండి" అంది విజయ నవ్వుతూ.

"మీ బాస్‌గారికి అంటే రాజేశ్వరికి జోడీ నేను, మీకు జోడి చందూ ఇకపోతే సుశీలకు ఆమధ్యనేదో సంబంధం మీరే కుదిర్చారనీ, త్వరలో పెళ్లవ్వచ్చనీ అన్నారు. రమ గురించైతే నాకు తెలీదుమరి. ఆ అమ్మాయికీ సంబంధాలు చూస్తున్నారా? "

"ఆమెకూ ఇంచుమించు కుదిరినట్టే! కానీ నాకు మాత్రం మీరనుకుంటున్నట్టు చందూ జోడికాదు" అంది విజయ తలవంచుకుని.

"అదేమిటండీ అలాగంటారు! మంచి వాడు, అందగాడు, ఆస్తిపరుడు"

"సంపాదనాపరుడు మాత్రంకాదు. అతన్ని చేసుకుంటే విజయ సంపాదించిపెడితే వాళ్ల నాన్నను సాధించుకు తిన్నట్టు దీన్ని సాధించుకు తింటాడు. నాకూ ఉన్నాడు ఓ మొగుడని చెప్పుకోడానికి తప్ప ఇంకెందుకూ పనికిరాడు" అంది రాజి మధ్యలో కల్పించుకుని కోపంగా.

"అదే! అదే! పూర్తిగా తెలుసుకోకుండా ఠకీ ఠకీమని మాట్లాడ్డం మాత్రమే నీకు తెలుసు అన్నాడు మురళి.

"ఏమిటండీ తెలుసుకునేది. రాజీ ఎప్పుడూ కరెక్టుగానే మాట్లాడుతుంది" అంది విజయ.

"మీరూ ఆవిడగారికి వంతపాడుతున్నారా? ఇంక డైలాగులు పొడిగించటం అంత బావుండదు, విషయంలోకొచ్చేస్తాను. చందూ కష్టపడి పనిచేసి డబ్బు సంపాదిస్తున్నాడండి. "మీ నాన్నను ఏడిపించి ఏడు

చెరువుల నీళ్లు తాగించే నీకు ఇంతమంచి బుద్ధి ఎప్పటినుంచి పుట్టిందిరా" అని నేనడిగితే ఇచ్చిచూడు. మనసిచ్చిచూడు అని పాటందుకుంటున్నాడు. ముందు నాకర్థం కాలేదు. ఆమధ్య విడుదలయిన సినిమాలో హీరోయిన్ ప్రేరణ ద్వారా హీరో ఉద్యోగం సంపాదించాడని స్టోరీ చెబితే విన్నాను. బాగానే ఉన్నట్టుందని ఆ సినిమా కూడా చూసి వచ్చాననుకోండి.

పోతే చందూ జీవితంలో హీరోయిన్ నాకు తెలిసి మీరేకదా! మీరే వాడికి ఘాటుగా, తిరగమోత పెట్టినట్టున్నారు. అంతే వ్యాపారంలో గుబాళిస్తున్నాడు. ఏమిటి నా మాటల మీద నమ్మకం లేదా? మీ కళ్లతో మీరే చూద్దురుగాని రండి! ఈ పార్కులోనే ఓ టీ స్టాల్ బ్రహ్మాండంగా నడుపుతున్నాడు రండి" అంటూ టీ స్టాల్ దగ్గరికి దారి తీశాడు.

ఆశ్చర్యపడుతూ విజయ, రాజి మురళిన నుసరించారు. పది అడుగుల దూరంలో నిలబడి ఉన్న చందూ వారిని గమనించే స్థితిలో లేడు. ఫుల్ బిజీగా ఉన్నాడు. అక్కడున్న వాళ్లందరికీ టీ కలిపి ఇస్తున్నాడు చందూ. అతనికి సాయంగా చేతికింద ఇద్దరు కుర్రాళ్లున్నారు. అక్కడున్న బోర్డు వైపు దృష్టి సారించింది విజయ.

కడుపులో వికారంగా ఉందా? ... నిమ్మటీ

జీర్ణం కాలేదా? ... అల్లంటీ

సువాసన కావాలా? ... యాలకు టీ

షుగరుందా? ... బ్లాక్ టీ

ఆకలి కావటంలేదా? ... పుదీనా టీ

ఆశ్చర్యంగా, సంభ్రమంగా ఆ బోర్డుని, చందూని, ఆ హోటల్ ని అలా చూస్తూ నిలబడిపోయింది విజయ. రాజేశ్వరి, మురళి మెల్లిగా అక్కడినుంచి జారుకున్నారు. జనం పలుచబడటంతో చందూ విజయని గమనించి దగ్గరికొచ్చాడు.

విజయ వెంటనే అక్కడున్న ఓ టేబిల్ ముందు కూర్చుంది. ఆమె ముందుకొచ్చి చేతులు కట్టుకుని నిలబడి "ఏం కావాలి మేడం" అన్నాడు వినయం నటిస్తూ.

"ఏయ్! మిస్టర్! ఓ గోంగూర టీ ఇవ్వు. ఏమిటలా మిడి గుడ్లేసుకు చూస్తావ్? పుదీనా టీ ఉన్నపుడు గోంగూర టీ ఉండ కూడదా? " అంది నవ్వు దాచుకుంటూ.

"అలాగే మేడం రేపటినించి మీకోసం ప్రత్యేకంగా రెండు కట్టల గోంగూరతో ఓ కప్పు టీ స్పెషల్ గా తయారుచేసి మరీ ఇస్తాను. ఈ రోజుకి ఉన్న దాంతో సర్దుకోండి"

"అదిసరే! మీకీ టీ స్టాల్ పెట్టాలన్న ఆలోచన ఎలా వచ్చింది? ఎందుకొచ్చింది? " అంది విజయ ప్రశ్నిస్తూ.

"ఏమిటి మీరు విలేకర్లా ఇలా ఇంటర్వ్యూ చేస్తున్నారు? "

"అలాగే అనుకొని సమాధానమివ్వండి"

"అయితే రాసుకోండి. కాదు ఇనుకోండి. నేనో అమ్మాయిని ప్రేమించాను. ప్రేమించగానే పనయిపోదుకదండీ! పెళ్లాడాలి. పెళ్లి చేసుకోవాలంటే సంపాదన ఉండాలా? గవర్నమెంటుద్యోగం కోసం కాచుక్కూర్చుంటే తల నెరిసిపోతుంది. దండిగా పెట్టుబడి పెట్టి బిజినెస్ లో దిగుదామంటే డబ్బుల్లేవు. ఇలా ఊరికే ఉంటే పళ్లూడి ముసలాడినవుతాను కానీ ప్రేమ ఫలించి పెళ్లికాదుకదా! ఇహ లాభంలేదనుకుని తక్కువ పెట్టుబడితో ఈ టీ స్టాల్ నడుపుకొంటున్నాను.

మీకో విషయం తెలుసా? సంపాదన లేని మగాడిని, సతాయించే మొగుడిని ఈ కాలం అమ్మాయిలు ప్రేమించరు. అన్నట్టు ఈ టీ స్టాల్ సంపాదనతో పెళ్లాం, పిల్లలు తృప్తిపడతారంటారా" అనడిగాడు చందూ విజయవైపు ఓరచూపులు చూస్తూ!

"ఈ కాలం అమ్మాయిలు కేవలం డబ్బు సంపాదనతో తృప్తిపడరండీ! చంచలస్వభావం లేకుండా అంటే వెలకో ఉద్యోగం మారకుండా ఒకే వృత్తిలో ప్రగతి సాధిస్తే

తన మొగుడంతటివాడు ఈ ప్రపంచంలోనే లేడని తృప్తిపడతారు. బహుశా మీరు ప్రేమించినమ్మాయి కూడా ఇలాగే ఆలోచి స్తుంటుందనుకుంటా" అంది ముసిముసిగా నవ్వుతూ విజయ.

"అంటే? "

"అంటే ఏముంది! కనీసం అయిదారేళ్లు మీరు ఈ టీస్టాల్‌ను వదిలిపెట్టకుండా నడి పితే నమ్మకం కుదురుతుందేమో"

"అలాగేం! జీవితాంతం వదలను. సరే గానీ, నాకు ఇహ టైంలేదు. మీరు వెళ్లిరండి"

"ఇచ్చిచూడు, మనసిచ్చిచూడు" పాట పాడుకుంటూ వెళ్లిపోతున్న చందూని నవ్వుతూ చూసింది విజయ.

★ ★ ★

"మీరు పెళ్లిళ్లు ఏవిధంగా చేస్తున్నారు? " కూర్చుంటూ అడిగాడు యాభై ఏళ్ల కుటుం బరావు.

"ఈ మహానుభావుడెవరో మన మెదడు నంజుకు తినటానికొచ్చినట్టున్నాడు" సుశీలకు మాత్రమే వినిపించేలా అంది విజయ.

"ష్! ఊరుకో! పెద్దాయన పాపం!" అంది సుశీల.

"అంటే? మీరడిగే ప్రశ్న నాకర్థం కాలేదు" అంది రాజేశ్వరి కుటుంబరావుతో.

"ఏం లేదు. నాకిద్దరు కూతుళ్లున్నారు. మా కులంలో అమ్మాయిల జాతకాలు, అబ్బాయిల జాతకాలతో ట్యాలీ అవుతే తప్ప పెళ్లిళ్లు చెయ్యం. మీరా పద్ధతి ప్రకారం చేస్తున్నారా? లేక అవన్నీ పక్కకు పెట్టి అమ్మాయికి అబ్బాయి, అబ్బాయికి అమ్మాయి నచ్చగానే కట్నాలు మాట్లాడేసు కుని అవీ నచ్చగానే పెళ్లిళ్లు కుదురుస్తు న్నారా? " అనడిగాడు.

"ఈ రోజుల్లో ఇంకా జాతకాల పిచ్చేమి టండీ! ఇప్పుడే ఏదో ఒక వంకతో ఆడపిల్లల పెళ్లిళ్లు కాకుండా ఆగిపోతున్నాయి. మళ్లీ ఈ జాతకాల ట్యాలీ కారణంతో కూడా బాధపడాలా? అయినా మీరడుగుతున్నారు కాబట్టి చెబుతున్నాను. ఇంతవరకు మా దగ్గరికి మీలాగా జాతకాలు అంటూ ఎవరూ రాలేదు. మేమూ పట్టించుకోలేదు. ఇంతకీ మీ సమస్య ఏమిటి? " అంది రాజి.

"నాకు ఇద్దరు కూతుళ్లున్నారమ్మా! పెద్ద పిల్ల మూలా నక్షత్రంలో పుట్టింది. చిన్నపిల్ల ఆశ్లేష నక్షత్రంలో పుట్టింది. పెద్దదానికి ఇరవై ఏడు సంవత్సరాలు. బి.ఇడి చేసి టీచరుగా ఉద్యోగం చేస్తోంది. చిన్నదానికి ఇరవై అయిదు సంవత్సరాలు. దానికి చదువు సరిగా అబ్బలేదు. టైలరింగ్ సెంటర్ నడుపుతోంది. ఇద్దరూ డబ్బు సంపాదిస్తున్నారు. డబ్బుకు లోటులేదు కాకపోతే పెళ్లిళ్లు కాకుండా అలా నిలబడిపో యారు"

"అదేం సంబంధాలు వెతకలేదా? "

"మీ అమ్మాయిలు అందంగా లేరా? "

"కట్నం దగ్గర పేచీలొస్తున్నాయా? "

తలో ప్రశ్న వేశారాయన్ని.

"అదేం కాదమ్మా! చెప్పానుగా మా కులంలో జాతకాలు సరిపోతేనే పెళ్లిళ్లవుతా యని. జాతకాలు కుదరటంలేదు. పెద్ద మ్మాయి మూలా నక్షత్రంలో పుట్టింది కాబట్టి మామగారికి గండం అని భయపడు తున్నారు. చిన్నమ్మాయి ఆశ్లేష నక్షత్రంలో పుట్టింది కాబట్టి అత్తగారికి గండం అని భయపడుతున్నారు. ఈ ఊళ్లో ఉన్న పెళ్లిళ్ల పేరయ్యలెవరూ అమ్మాయిలకు పెళ్లిళ్లు కుద ర్చలేకపోయారు. చివరి ప్రయత్నంగా మీకున్న మంచి పేరు విని మీ దగ్గరకొ చ్చాను" అన్నాడాయన.

"ముందుగా ఒక విషయం చెప్పండి! జాతకాల ప్రకారమే పెళ్లిళ్లు జరిపించాలని మీరనుకుంటున్నారా? " అడిగింది రాజి.

"మొదట్లో పెళ్లి ప్రయత్నాలు చేస్తున్న పుడు కులాచారం ప్రకారం అమ్మాయిల జాతకాలు అందరికీ తెలపటం జరిగింది. వరుడు దొరకటం మాట అటుంచి బంధు

వులందరికీ మా పిల్లల జాతకాలు తెలిసిపోయాయి. ఇపుడు నాకుగా నేను జాతకాల ప్రసక్తి తేకపోయినా లాభంలేకుండా పోతోంది" అన్నాడు కుటుంబరావు ఆవేదనగా.

"మీ అమ్మాయిల మనస్తత్వం ఏమిటి?"

"వాళ్లా? ఈ కులంలో పుట్టినందుకే విచారిస్తున్నారు. కుల ప్రసక్తిలేకుండా మంచివాడు, యోగ్యుడు అయితే చాలు అంటున్నారు. అసలిక్కడికి పంపించింది కూడా నా కూతుళ్లేనమ్మా! మీరెలా చేస్తారో ఏమో! నా కూతుళ్లకు పెళ్లిళ్లు జరగాలి. కాకపోతే కులం, ఆచారం, జాతకాలు జీర్ణించుకుపోయి నరాల్లో ప్రవహిస్తున్నాయేమో మరీ కులం తప్పి పెళ్లిళ్లు చేయాలంటే మనసొప్పటంలేదు. సాధ్యమైనంతవరకు మా కులంలోనే జాతకాల ప్రకారం పెద్దమ్మాయికి తండ్రిలేని వరుణ్ణి, చిన్నమ్మాయికి తల్లిలేని వరుణ్ణి వెతకండమ్మా. మీకు సంతృప్తిగా, సంభావన ఇచ్చుకుంటాను" అన్నాడాయన తన ధోరణి విడవనన్నట్టు.

"మా ప్రయత్నం మేం చేస్తాం. అన్నట్టు మీ అమ్మాయిలనోసారి ఇక్కడికి పంపించండి. ఎలా ఉన్నారో చూస్తాము" అంటూ కుటుంబరావును సాగనంపింది రాజేశ్వరి.

ఆ మరుసటి రోజు కుటుంబరావు కూతుళ్లిద్దరూ పాణిగ్రహణం ఆఫీసుకొచ్చారు.

పెద్దమ్మాయి పేరు శారద, చిన్నమ్మాయి పేరు నీరజ. మంచి ఎత్తు, రంగుతో అందంగా, ఆరోగ్యంగా ఉన్నారు.

"ఏమిటండీ! మమ్మల్ని రమ్మన్నారుట" నవ్వుతూ అడిగింది శారద.

"అబ్బే! ఏంలేదు. మీకూ జాతకాల పిచ్చి ఉందేమో కనుక్కుందామని" సీరియస్‌గా అంది రాజేశ్వరి.

"ఉంటుందని మీరనుకుంటున్నారా?" నవ్వుతూ అడిగింది నీరజ. ఆమె మాటకెవ్వరూ జవాబు చెప్పలేదు.

"అంతో ఇంతో చదువుకున్న మాకు అలాంటి మూఢనమ్మకాలు లేవు. కానీ మూఢనమ్మకాలే రక్తంలో ప్రవహిస్తున్నవారిని మార్చటానికి నడుం కట్టే ఓపికా, టైం మాకు లేవు. మా నాన్నగారు మా పెళ్ళిళ్ళు చేసే ప్రయత్నంలో ఆయనకు తెలియకుండానే మా పెళ్ళిళ్ళకు జాతకాల సమిధను అడ్డువేసి ఆపివేశారు. ఇప్పుడు విచారించి ప్రయోజనం లేదు. సరే! ఆయన సంగతలా ఉంచండి. మనమెంత అభివృద్ధిలో ఉన్నా తండ్రి చాటు బిడ్డలంకదా. అమాయకుల్లా... కనిపించాలి... కాదు... నటించాలి. కనుక నటిస్తున్నాం..."

"నటించటమా? అంటే?" శారద మాటలకు అడ్డు తగులుతూ అడిగింది రాజేశ్వరి.

"అసలు పాయింటులోకొస్తాను. నేను, నీరజ మాకు కాబోయే భర్తలను మేమే ఎన్నుకున్నాం. వారిద్దరూ మంచి ఉద్యోగం, పొజిషన్‌లో ఉన్నవారు"

"మరయితే ఇంకేం పెళ్ళి చేసుకోవచ్చు కదా"

"చేసుకోవచ్చు కానీ నాన్న ఒప్పుకోవాలి కదా. ఎటుతిరిగీ, ఆయన మా కులంలోనే, మా జాతకాలకు సరిపడవారినే చెయ్యాలి అంటాడు. వాళ్ళు దొరకరు. మా పెళ్ళిళ్ళు కాకపోయినా పర్వాలేదు కానీ కులాన్ని, ఆచారాన్ని వదులుకోడు. అందుకే ఆయన్ని మీ దగ్గరకు పంపాం. కానీ ఆయన మీ దగ్గర్నుంచి వచ్చాక ఈ అమ్మాయిలు తప్పకుండా మన కులంవాళ్ళని వెతికి మీకు పెళ్ళిళ్ళు చేస్తారు అంటాడే తప్ప ఏ కులం అబ్బాయి అయినా ఫర్వాలేదు మీకు పెళ్ళి చేస్తాను అని మాత్రం అనడు. అందుకే మేమొక నిశ్చయానికొచ్చాం"

"ఏమిటది?"

"మా కాబోయే భర్తలది ఎలాగూ ఈ జిల్లాకాదు. కొత్త బంధుత్వం అంటూ మీరే ఎలాగో చెప్పి పెళ్ళిచేయండి. సినిమాలోలాగా మేమే పెళ్ళి చేసుకువస్తే నాన్న హర్ట్ అవుతాడేమోనని భయం. నూరు

అబద్ధాలాడి అయినా ఓ పెళ్ళి చేయాలంటారు కదా. మా కోసం ఒక్క అబద్ధం ఆడలేరా? ప్లీజ్" అంది శారద కన్నీళ్ళతో!

"ట్రై చేస్తాను" అంది రాజేశ్వరి ఆలోచిస్తూ.

మొట్టమొదటిసారిగా పంచాంగ పురోహితుడి దగ్గరికెళ్ళింది రాజేశ్వరి. శారద, నీరజల కాబోయే భర్తల జాతకాలు, అమ్మాయిల జాతకాలకు సరిపడే విధంగా రాయించి అవి కుటుంబరావుకు చూపించింది.

పెళ్ళి సింపుల్‌గా జరగాలని అబ్బాయితరపు బంధువులంటున్నారని ఊళ్ళో ఉన్న ఓ గుడిలో పెళ్ళిళ్ళు జరిపించారు. పెళ్ళయ్యాక కుటుంబరావుకు జాతకాల విషయంతో సహా, కులంగురించీ, ఆచార వ్యవహారాల గురించి మొత్తం తెలిసిపోయి కాసేపు పాణిగ్రహణం ముందుకొచ్చి చిందులేశాడు. మళ్ళీ మెత్తబడి వెళ్ళిపోయాడు.

మొట్టమొదటిసారిగా అబద్ధాలాడి పెళ్ళిళ్ళు జరిపించినా పాణిగ్రహణం స్టాఫ్ ఏమాత్రం బాధపడలేదు. పైగా నాలుగు జీవితాలను నిలబెట్టామని సంతృప్తిగా ఊపిరి పీల్చుకున్నారు.

★ ★ ★

"కూర్చోవచ్చా?"

"కూర్చోండి. మీపేరు?" అంది రాజి ఆపాదమస్తకం పరిశీలిస్తూ.

"నాపేరు యల్.యల్. రావు. నేనో అమ్మాయిని ప్రేమించాను. మీరు నా పెళ్ళి చేయాలి" అన్నాడు ఆజ్ఞాపిస్తున్నట్టు.

"ఆ జులపాల జుట్టు చూడు సుశీలా, తినే తిండి అంతా జుట్టుకే పెట్టి పోషిస్తున్నాడు కాబోలు విడదీసి గొరిగిస్తే లావుపాటివి రెండు సవరాలొస్తాయి. నున్నగా దువ్వి రబ్బర్ బాండ్ వేశాడు చూడు. పూల చీరను కత్తిరించి కుట్టినట్టు ఆ షర్టూ, కళ్ళు జిగేల్‌మనిపించే ఆ పసుపురంగు ప్యాంటు, ముక్కుమీద్దకు [illegible]డే కళ్ళద్దాలు, పిచ్చుక గూడులాంటి గెడ్డం... బాబోయ్ ఈ సుందరాంగుడిని ప్రేమించిన గంధర్వ కన్య ఎవరో?" అంది విజయ గుసగుసగా.

"ఆవిడ ఇంకెంత ఫ్యాషన్ సుందరో"

గుసగుసలు వినిపిస్తున్నవైపు సీరియస్‌గా చూసింది రాజేశ్వరి.

"ఆ అమ్మాయి వివరాలు చెప్పండి. ఈ ఊరేనా?" అనడిగింది రావుని.

"ఏ ఊరో తెలీదు, ఎక్కడుంటుందో తెలీదు, ఎలా ఉంటుందో తెలీదు" అన్నాడతను.

"అయిపోయాం. మన కథ ఈరోజు మరో మలుపు తిరిగి అయిపోతున్నాం బాబోయ్" అంది రమ విజయతో గొణుగుతున్నట్టు.

అతని మాటలు విన్న రాజేశ్వరికి కోపం వచ్చింది. తమాయించుకుని "విషయం వివరంగా చెప్పండి. మేమిక్కడ ఉంటున్నది పెళ్ళి సంబంధాలు కుదర్చడానికి, పెళ్లిళ్ళు చేయడానికేగానీ పజిల్స్ పూర్తిచేయటానికి కాదు" అంది కాస్త సీరియస్‌గా.

"సారీ, సారీ... ఏదో 'టెన్షన్'లో ఉండి అలా మాట్లాడాను. మీకు కోపం వచ్చినట్టుంది. క్షమించండి. వివరంగా చెబుతాను.

"ప్రేమంటే ఓ బలమైన అనుభూతి. తెల్ల కాగితంలాంటి హృదయంపై మనసనే సిరాతో రాసి పాట పాడే భావాల గీతిక. ప్రేమంటే అడవిలోనో, వాగుల్లోనో, వంకల్లోనో పెరిగేదికాదు. రోడ్లో దొరికేది కాదు. హృదయంలో ఎప్పుడు ఎలా కలుగుతుందో ఎవరూ చెప్పటానికి వీలుగాని భాష ప్రేమంటే! తనను తాను సమర్పించుకోవడం, ప్రేమించిన వ్యక్తికోసం నిప్పుల్లోనైనా సరే దూకాలన్నంత తపన కలిగి ఉండటం, ప్రేమలోపడ్డ వారికి జీవితం ఓ రంగుల కలగా కనిపిస్తుంది. రెక్కలొచ్చిన పక్షిలా, వయసొచ్చిన మనసు రెక్కలు కట్టుకుని ప్రేమవైపు పరుగులు తీస్తుంది"

"ఆపండి. ప్రేమగురించి మీరు ఇక్కడ ఎవరికైనా నోట్సు చెబుతున్నారా?" కోపంగా అడిగింది రాజేశ్వరి.

"ఓ... సారీ... నా ధోరణిలో నేను సాగి పోయాను. నా ప్రేమ గుర్తుకు వస్తే నన్ను నేను మర్చిపోవడమే కాదు. పరిసరాలు కూడా మర్చిపోతాను. నిజానికి నాకు ప్రేమంటే తెలియదు. నేను ఈ ఊళ్ళో పి.జి. చేస్తున్నాను. నలుగురు ఫ్రెండ్స్‌మి కలిసి ఓ అద్దెగదిలో ఉంటున్నాం. ఓరోజు మా గదికి ఓ ఉత్తరం పోస్టులో వచ్చింది. ఆ ఉత్తరం మీద ఫ్రం అడ్రస్‌లేదు. నా పేరున వచ్చిన ఆ ఉత్తరం విప్పి చదివాను. అంతే. నా మనసు పురివిప్పిన నెమలిలా నాట్యం చేసింది. కోయిలలా పాడింది. అప్పటినుంచి నా మనసు మనసులో లేదు.

"నేను ఆ ఉత్తరం రాసిన అమ్మాయిని గాఢంగా ప్రేమిస్తున్నాను. అన్నట్టు మీకు 'గ్రాఫాలజీ' తెలుసా? అంటే చేతి రాతను బట్టి మనస్తత్వాన్ని అంచనా వేసే ప్రక్రియ. చూడండి ఈ ఉత్తరం చూడండి. ఈ ఉత్తరం చదివి నా ప్రేయసిని నాకు తెచ్చి పెట్టండి. ఆమె నాకోసం ఎంత పరితపిస్తు న్నదో చూడండి. ఉత్తరంలో ఆ కవిత్వం చూడండి. శ్రీకృష్ణదేవరాయల కాలంనాటి ఆస్థాన కవులు కూడా రాయలేనంతటి గొప్ప కవిత్వం! చూడండి"

ఒకదానికొకటి పొంతన లేకుండా మాట్లా డుతూ ఓ కవరు రాజేశ్వరి చేతిలో పెట్టాడ తను. ఆ కవరు, అందులో ఉన్న ఉత్తరం ఎన్నో వందలసార్లు చదివినట్లు బాగా నలి గిపోయి... మాసిపోయి ఉంది. రావువైపు పిచ్చివాడిని చూసినట్టు చూసింది రాజేశ్వరి.

"చదవండి ప్లీజ్" అన్నాడతను.

"ఉదయమే మంచి గిరాకీ దొరికింది. తుమ్మజిగురులాగా ఎక్కడ దొరికాడురా తండ్రీ" అని మనసులో అనుకుంటూ ఉత్తరం విప్పింది.

రమ, విజయ, సుశీల కూడా రాజేశ్వరి పక్కన వచ్చి నిలబడి ఉత్తరంలోకి తొంగి చూశారు. అందులో ఇలా రాసుంది.

"ఓ నా రాజా,

రావా రావా

నీకోసం నేనే పుట్టాను. నాకోసం నీవే పుట్టావు. తరంగంలాగా రావోయి. ప్రియా నన్నాదుకోవోయీ. నా కన్నులలో నీవు, నీ అడుగులలో నేను నాలో నీవు, నీలో నేనేలే... ఓ నారాజా... రావా... రావా...

ప్రియా! నిన్ను నేను ప్రేమిస్తున్నాను. ప్రతిరోజూ నిన్ను నేను చూస్తుంటాను. నేనె వరో కనుక్కుని నా యింటి అడ్రస్ కను క్కుంటే నీ ప్రేమ ఫలించినట్టు. అంతవ రకూ ఎన్ని యుగాలైనా నీకోసం అభిసారి కలా వేచి ఉంటాను.

నిన్నే వలచితినోయీ, కన్నుల్లో దాగితి నోయి,

వెన్నెల్లో వేచితినోయీ, నీకై అభిసారికనై ఓ ప్రియా...

ఇట్లు

నీ అభిసారిక"

అందరూ ఫక్కున నవ్వబోయి తమా యించుకున్నారు.

"చూశారా? ఎంత గొప్ప కవిత్వమో" అన్నాడు రావు.

"చూడండి. ఇది కవిత్వం కాదు. ముప్ఫయి సంవత్సరాలక్రిందటి తెలుగు సినిమాలో పాటలు, ఎవరో అల్లరి అమ్మాయి మిమ్మల్ని ఆటపట్టించడానికి ఇలాంటి ఉత్తరం రాసి తమాషా చూస్తోంది. దీన్ని చింపి పారేసి ముందు చదువు పూర్తిచేసుకుని మీ కాళ్ళమీద మీరు నిలబడే ఉద్యోగం చూసుకోండి. అప్సరస లాంటి అమ్మాయిని చూసి మేమే మీకు పెళ్ళి జరిపిస్తాం" అంది రాజి సౌమ్యంగా.

"ఏమిటీ... ఉత్తరం చింపేయాలా? ఈ ఉత్తరం ఆధారంగా నా ప్రియురాలిని వెతు క్కుంటాను"

"అది చాలా కష్టం రావుగారూ. మీరేదో

తెలుగు సినిమాలో స్టోరీలకు జీవితాన్ని అన్వయించుకుని పొరపాటు చేస్తున్నారు" అంది ఇంకా సర్దిచెప్పే ధోరణిలో.

"ఇంతకీ మీరు నాకు పెళ్ళి చేయగలరా? లేదా? అది చెప్పండి"

"పెళ్ళి చెయ్యగలం. కానీ ఉత్తరం రాసిన అమ్మాయితో వీలుకాదు"

"అలాంటప్పుడు ప్రేమించుకున్న వారికి పెళ్ళిళ్ళు చేస్తామని ఎందుకు ప్రకటించుకున్నారు?" మొండిగా వాదించసాగాడు రావు.

రాజేశ్వరికి అతన్నెలా వదిలించుకోవాలో అర్థంకావడంలేదు. విజయ ముందుకొచ్చింది. "చూడండి! మేము సి.ఐ.డిలం కాదు ఉత్తరాలని చూసి మనుషులని గుర్తుపట్టడానికి. ఓ అరగంట కూర్చోండి. మా ఎస్. ఐ వస్తారు. ఆ ఉత్తరం సంగతి, మీ సంగతి తేల్చేస్తారు" అంది కటువుగా.

ఎస్. ఐ పేరు వినగానే రావు మెత్తబడి గుమ్మం దాటుతూ "ముందా పాణిగ్రహణం బోర్డు పీకి పడేయండి" గట్టిగా అరిచి వెళ్లిపోయాడు పిచ్చివాడిలా.

"ఎవరో గడుగ్గాయి వీడి మెదడంతా పాడుచేసింది"

"అతని సంగతేమో కానీ తలంతా వేడెక్కిపోయింది నాకు. రమా! ముందు అందరికీ కూల్ డ్రింక్స్ తెప్పించు" అంది రాజేశ్వరి తల పట్టుకుని కణతలు నొక్కుకుంటూ.

★ ★ ★

"నాపేరు గిరిజ" అంటూ తనని తాను పరిచయం చేసుకుంటూ ఇరవైఐదేళ్ల యువతి పాణిగ్రహణం స్టాఫ్‌కి నమస్కరించి వాళ్లు చూపించిన కుర్చీలో కూచుంది. మనిషి ఎత్తుకు తగ్గ లావుతో ఉన్నా ముఖం మాత్రం చెప్పుకోతగ్గంత అందంగా లేదు. అలాగని అనాకారీ కాదు. బాగా నల్లగా ఉందేమో అందగత్తెల లిస్టులోకి చేరదు.

"చెప్పండి" అంది రాజేశ్వరి.

"నేను పెళ్లి చేసుకోవాలనుకుంటున్నాను. అంతేకదా అని తేలిగ్గా తీసుకుంటారేమో... నాకిదివరకే పెళ్లయింది" అంది గిరిజ.

అందరూ ఆసక్తిగా గిరిజవైపు చూశారు. "ఇంట్రెస్టింగ్‌గా ఉంది కదూ! నేను యమ్.యస్.సి కంప్యూటర్స్ చేశాను. ఓ ప్రయివేటు కాలేజీలో లెక్చరరుగా ఉద్యోగం కూడా చేస్తున్నాను. రెండేళ్లక్రితమే నాకు పెళ్లయింది.

"రెండు లక్షల నగదు, పది తులాల బంగారం కట్నంగా ఇచ్చి మా నాన్నగారు నా పెళ్లి రంగరంగ వైభోగంగా చేశారు. నా భర్త బ్యాంక్ ఆఫీసరు. స్వంత ఇల్లు, బ్యాంకు బ్యాలెన్సులున్న ఏకైక కుమారుడు. అత్తమామలు లేరు. నౌకర్లు, చాకర్లు... ఓహ్.. ఒకటేమిటి... జీవితం జాలీగా ఉండేది"

"మీవారు మీకంటే అందం తక్కువా? ఎక్కువా?"

"అనుమాన పిశాచా?" ప్రశ్నలేశారు స్టాఫ్.

"అవేమీ కాదు. నాకు పిల్లలు కలగలేదు. పోట్లాట పెట్టుకుని వదిలేశారంతే!"

"అంటే మీకు ఎప్పటికీ పిల్లలు కలగరా?" జాలిగా అడిగింది రాజి.

"నాకు ఎప్పటికైనా పిల్లలు కలుగుతారు. నా భర్తకి ఎప్పటికీ పిల్లలు కలగరని డాక్టర్లు నిర్ధారించారు" అంది గిరిజ.

"అయితే?"

"అయితే ఇంకేం ఉంది. ఈ సమాజంలో స్త్రీని గొడ్రాలు అని వేలెత్తి చూపినా పెద్దగా బాధపడదేమో గానీ మగవాడికి లోపం ఆపాదించి పిల్లలు పుట్టడానికి అనర్హుడు అని తెలిసి ప్రశ్నార్థకపు చూపులు చూస్తే ఏమాత్రం భరించలేదు.

"అందుకే లోపం తనలో ఉన్నా నాకే లోపం ఉందని ఋజువులు, సాక్ష్యాలు పుట్టించి, లాయర్ని పెట్టి కోర్టు చుట్టూ

తిరిగి మరీ నాకు విడాకులిచ్చాడు. నేను పుట్టింటికి వచ్చాను. మా పుట్టింటి పరిస్థితి బావుండలేదు. ఉన్న డబ్బంతా ఆడపిల్లల కట్నాలకు, కానుకలకు హరించుకుపోయింది. నాన్నగారికి వచ్చే పెన్షన్‌తో బతుకు ఈడుస్తున్నారు.

"నేను పుట్టిల్లు చేరటంతో నాన్నకు హార్ట్ ఎటాక్ వచ్చి చనిపోయారు. ఆయన పోయిన ఆరు నెలలకు అమ్మ కూడా పోయింది. అన్నయ్య, వదినల సూటిపోటి మాటలు... ఇల్లు నరకంగా ఉంది. నేను నా బతుకు తెరువుకోసం ఉద్యోగం చేస్తున్నాను. కానీ... మా కుటుంబం విచ్ఛిన్నం... ముఖ్యంగా అమ్మానాన్నలు చనిపోవటానికి ఇంట్లో పోట్లాటలు, నరకం... వీటన్నిటికీ కారణం ఆ దౌర్భాగ్యుడే కదా. ఇదిలా ఉండగా అతను మరో అమ్మాయిని పెళ్ళి చేసుకున్నాడు. నేనూ పెళ్ళి చేసుకోవాలనుకుని సంబంధాలు వెతికించాను.

"కానీ నా మాజీ భర్త నేను గొడ్రాలినని ఎవరూ పెళ్ళి చేసుకోకుండా అడ్డుపుల్ల వేస్తున్నాడు. నేను ఎలాగైనా పెళ్ళి చేసుకోవాలి. బిడ్డలతల్లిని కావాలి. నేను గొడ్రాలిని కాదు. లోపమంతా వాడిదేనని నిరూపించాలి"

"అలా నిరూపిస్తే నీకేమిటి లాభం? "

"రెండు విధాలాలాభం! నన్ను, నా కుటుంబాన్ని బాధపెట్టిన వాడిమీద నా కక్ష తీరుతుంది. రెండోది నేనో ఇంటిదాన్నవుతాను"

"మీకెలాంటి వరుడు కావాలి? "

"ఆస్తి, అంతస్థు అక్కర్లేదు. పిల్లలతండ్రి అయినా ఫరవాలేదు. సర్దుకుపోగలను. మంచి మనసుండి నన్ను ఆదరిస్తే చాలు"

"ఇంకొక విషయం నా పెళ్ళి విషయం, విడాకుల విషయం ఏదీ అతని దగ్గర దాచక్కర్లేదు" అంది గిరిజ.

"సరే! మా ప్రయత్నం మేం చేస్తాం. మీకు తగిన వరుడు దొరకగానే కబురు పంపిస్తాం. మీరు వెళ్ళిరండి" అంది రాజేశ్వరి.

నమస్కరించి వెళ్ళిపోయింది గిరిజ.

"అమ్మాయి పెద్ద అందంగా లేదు. అందులోనూ విడాకుల కేసు, పైగా గొడ్రాలు బిరుదొకటి. వరుడు దొరకడం కష్టమే" అంది విజయ.

"రేప్‌కు గురైన అమ్మాయికే పెళ్ళిచేశాం. ఈ అమ్మాయికి పెళ్ళి చెయ్యలేమా? కాకపోతే కాస్త టైం పడుతుంది. అన్నట్టు ఆమధ్య గోపాల్రావు అనే ఆయన పెళ్ళి కావాలంటూ వచ్చాడు కదా రమా. వీరిద్దరికీ జోడి సరిపోతుందా"

"అయ్యయ్యో! అతనింకో సంవత్సరానికి రిటైరవుతాడుట. పెళ్ళాం చనిపోయింది. పిల్లలిద్దరూ అమెరికాలో సెటిల్ అయ్యారుట. కేవలం తోడుకోసం పెళ్ళి కావాలన్నాడు. గిరిజకు జోడికాదు వదిలెయ్యి"

"ఎవరైనా వరుడు కావాలనో... వధువు కావాలనో పాణిగ్రహణం ఆఫీసుకొచ్చి వెళితే వాళ్ళకు పెళ్ళి చేసేదాకా నీకు నిద్రపట్టదు కదా. విచిత్రమైన మనిషివి" అంటూ మందలింపు ధోరణిలో మాట్లాడింది విజయ.

ఆలోచిస్తూ ఉండిపోయింది రాజేశ్వరి!

ఆ సాయంత్రం పార్కులో మురళి రాజేశ్వరి చేతిలో ఓ ఉత్తరం పెట్టి, "మీ అమ్మగారు అంటే మా అత్తయ్య ఉత్తరం రాసింది" అన్నాడు.

ఆత్రంగా విప్పి చదివింది. ఆ ఉత్తరం మురళికి రాసింది. దాన్నిండా రాజేశ్వరి గురించే... ఆమె ఒంటరిజీవితం గురించి ఆవేదన చెందుతూ వీలైనంత త్వరగా పెళ్ళి చేసుకోండంటూ రాసింది. రాజేశ్వరి అన్న, తండ్రితో పోట్లాడి అత్తగారి ఊరికి బదిలీ చేయించుకుని వేరుకాపురం పెడతానంటూ వెళ్ళిపోయాడుట. అమ్మకేం బాధగాలేదుట. నాన్నమాత్రం బాధపడుతున్నాడుట. మేనత్త ఇంకా చక్రవర్తి, రాజేశ్వరిల పెళ్ళి

గురించి కలలు కంటూ పదిరోజులకోసారి వచ్చి నాన్న మెదడు తినేస్తోందిట. చివరగా రాజేశ్వరిని తనకు ఉత్తరం రాయమని చెప్ప మంటూ ముగించింది.

బాధగా నిట్టూర్చింది రాజేశ్వరి.

"చక్రవర్తి శశికళతో విడాకులు తీసుకోవ డానికి ఇంక నెలరోజులు మాత్రమే టైం ఉంది" అన్నాడు మురళి.

"అలాగా" అంది రాజి అన్యమనస్కంగా.

"అలాగా అని మెల్లిగా అంటావేమిటి భయంగాలేదూ"

"భయమా? భయమెందుకు? "

"పెద్దలంతా సంవత్సరం తర్వాత నీ పెళ్లి చేద్దామనుకున్నారుకదా! విడాకులు కూడా మంజూరవుతాయేమో. మీ నాన్నగారు నిన్ను లాక్కువెళ్ళి ఆ చక్రవర్తికిచ్చి పెళ్లి చేస్తాడు. నా గతేమవుతుందో ఏమిటో? " అన్నాడు మురళి బేలగా మొహం పెట్టి నటిస్తూ!

"మురళీ! మరీ అంతలా నటించి మాట్లా డక్కర్లేదు. మనసులో ఏముందో సూటిగా మాట్లాడితేనే బావుంటుంది" కాస్త సీరియ స్గా అంది రాజి.

"కోపమొచ్చిందా? సారీ! నువ్వన్నట్టు ముక్కుసూటిగానే అడుగుతాను. ఆ చక్ర వర్తి విడాకులు సంగతి తేలేదాకా మన పెళ్లి జరక్కూడదా? "

"అసలా చక్రవర్తి విడాకులు తీసుకుంటే కదా! శశికళను అతను భార్యగా ఎప్పుడో అంగీకరించాడు. ఈ నెలరోజులు జరగ్గానే మేమిద్దరం కాపురం చేసుకుంటాం అని ధైర్యంగా మా నాన్నముందు, వాళ్ళ అమ్మ ముందు, పెద్దలముందు చెప్పేయబోతు న్నాడు. కానీ ఈలోగానే మనం పెళ్లి చేసు కుంటే... నాకు పెళ్లయిపోయింది కాబట్టి అతనలా సర్దుకున్నాడని అనుకుంటారు... ముఖ్యంగా మా నాన్నకు అతని నిర్ణయం షాకిచ్చితీరాలి. అదే నా కోరిక!"

"చక్రవర్తి అంత ధైర్యంగా మీ నాన్న ముందు నిన్నుకాదని, శశికళ నా భార్య అంటూ డైలాగులు చెప్పేంత హీరోగా ఎది గిపోయాడంటావా? అది ఎలా జరుగుతుం దంటావు? "

"అది చక్రవర్తి గొప్పతనం, హీరోయిజం అనుకుంటే పొరపాటు. ఈ దేశసంస్కృతి, సాంప్రదాయం, తాళికున్న విలువ అటువం టివి" అంది రాజేశ్వరి.

"ఏదిఏమైనా మన పెళ్లికి గ్రీన్‌సిగ్నల్ వచ్చినట్టేకదా. అది చాలు. ఇప్పుడే టెన్షన్ లేదు నాకు!" నవ్వుతూ అన్నాడు మురళి.

★ ★ ★

"ఎవరు మీరు? ఏం కావాలి? " అడి గింది విజయ.

"లోపలికి రావచ్చాండి" అదోరకమైన బిడియంతో పాణిగ్రహణం గుమ్మంముందు నిల్చుని అడిగాడో యువకుడు. అతని వయసు దాదాపు ముప్ఫయి సంవత్సరాలుం టుంది. సన్నగా, రివటలా ఉన్నా మొహం కళగానే ఉంది.

విజయ అతనివైపు ఎగాదిగా చూసి, "రండి కూర్చోండి" అంటూ కుర్చీ చూపిం చింది.

బిడియపడుతూనే కుర్చీలో కూర్చున్నాడ తను. అతనికెదురుగా ఉన్న కుర్చీలో రాజే శ్వరి కూర్చుని "చెప్పండి! మీ పేరేమిటి? " అంది చిరునవ్వు నవ్వుతూ.

"నా పేరు కుమార్! నా వయసు ముప్ఫ యిరెండు. అగ్రికల్చరల్ డిపార్టుమెంటులో ఉద్యోగం చేస్తున్నాను. నా జీతం నెలకు నాలుగున్నరవేలు. చిన్న పెంకుటిల్లుంది. నాకు మా అమ్మ తప్ప వేరెవరూ లేరు. నాకు మీరు పెళ్లి చేయగలరా? " అన్నాడ తను.

"తప్పకుండా చేయగలం! మీకెలాంటి అమ్మాయి కావాలి? చదువుకున్న అమ్మాయి కావాలా? ఉద్యోగస్తురాలు కావాలా? చదువు లేకపోయినా సంసార పక్షం మాత్రం చాలా? "

"నేను మీతో కొంచెం విడిగా మాట్లాడాలి" అన్నాడు గొంతు తగ్గించి చుట్టూ ఉన్న స్టాఫ్‌ను బిడియంగా చూస్తూ కుమార్!

"ఫర్వాలేదు! మా స్టాఫ్‌లో అలాంటి దాపరికాలు ఉండకూడదని రూలు. మీరేదైనా చెప్పి రహస్యంగా ఉంచమని చెబితే అలాగే ఉంచుతాం. నిర్భయంగా చెప్పండి. మీ సమస్య మేం సాల్వు చెయ్యదగినదైతే తప్పక చేస్తాం. లేకుంటే వీలుకాదని చెప్పి పంపిస్తాం. మీరిక్కడినించి వెళ్ళిన వెంటనే మిమ్మల్ని మరిచిపోతాం" అంది రాజేశ్వరి.

"మా నాన్నగారు పేరుమోసిన కాంట్రాక్టరు. పల్లెలో దండిగా పొలం కొన్నాడు. ఎందుకు ఎప్పుడు ఎలా ఏర్పడిందో ఓ చిన్న పోట్లాట. ఆ పల్లెలో ఏర్పడి అది చిలికి చిలికి గాలివాన అయి నాన్నను హత్య చేసే వరకూ దారితీశాయి. ఆ తరువాత ఆ పొలం అమ్మేసి టౌనుచేరి ఉద్యోగం సంపాదించుకున్నాను. నాన్న హత్యతో తీరని వారికక్ష నా పెళ్ళి కాకుండా నిరోధించటం వరకూ అలా కొనసాగుతూనే ఉంది.

"నా కోసం... ఏ ఆడపెళ్లివారొచ్చినా... తెలుగు సినిమాలోలాగా ఊరిబయట కాపు కాసి నామీద ఉన్నవీ లేనివీ పుకార్లు పుట్టించి... వాళ్లు భయపడి పారిపోయేలా చేశారు. చివరికి ఆ పుకార్లన్నీ కలిసి ఓ పెద్ద... బలమైన పుకారు నామీద అలా నిలబడిపోయింది. దాని పేరు కుజదోషం. నాకు కుజదోషముందిట. నాకు పెళ్లి కావాలంటే నా కాబోయే భార్యక్కూడా కుజదోషం ఉండాలిట. అలా అయితే దోషం పరిహారమయి కాపురం బాగుంటుందిట.

"ఆ! ఏముంది కుజదోషం లేదు గుడ్డూలేదని కొట్టిపారేసి మోసం చేసి పెళ్లి చేసుకుంటే చాలా ఘోరాలు జరిగిపోతాయిట. ఎంతోమందికి ప్రాణగండం ఉంటుందిట. ఇలా నామీద కక్ష సాధింపుచర్య జరిగి పెళ్లికి నోచుకోకుండా ఇలా మిగిలిపోయాను. మా అమ్మ నా పెళ్లి గురించి చాలా బెంగపెట్టుకుంది. అనారోగ్యంతో మంచం పట్టింది. అసలు నా పెళ్లవుతుందా అని నాకే అనుమానం.

ఇక పెళ్లిమీద ఆశ వదులుకున్న టైంలో ఈ పాణిగ్రహణం గురించీ, జరిగిన ఆదర్శ వివాహాల గురించీ విన్నాను. నా అదృష్టాన్ని పరీక్షించుకొందామని ఇక్కడికొచ్చాను" అంటూ ముగించాడు కుమార్.

"ఇంతకీ మీకు నిజంగానే కుజదోషం లేదా? " అడిగింది విజయ.

"నా పుట్టిన తేదీ, తిథి, వారం గూర్చి మా అమ్మకే తెలీదు. నేను పుట్టాక మూడు రోజులు అమ్మ స్పృహలో లేదుట. ఆ తర్వాత మూడు నెలలు అనారోగ్యంతో మంచం పట్టిందిట. ఆమె అనారోగ్యంనించి కోలుకునేసరికి నాకు జబ్బు చేసిందిట. ఇలా అనారోగ్యాల సీజన్‌నించి బయటపడే సరికి నా పుట్టిన తేదీ కాస్తా మర్చిపోయారుట. కనీసం నామకరణం కూడా శాస్త్రోక్తంగా చెయ్యలేదుట. అదీ నా పరిస్థితి.

ఇంక ఏ శాస్త్రజ్ఞుడైనా నాకు కుజదోషం కానీ మరోటి కానీ ఉందని ఎలా చెప్పగలడండీ! అయినా మిలీనియంలో ప్రవేశించినా కూడా పెళ్లిళ్ల దగ్గరకొచ్చేసరికి జాతకాలు, కుజదోషాలు, నక్షత్రాలు లాంటి మూఢనమ్మకాలను మాత్రం వదల్లేకపోతున్నారు. ఈ తరం, ఇక ముందుతరం కూడా ఈ సమస్య గురించి ఆలోచించాలి.

ఈ మూఢనమ్మకాల ప్రభావం ఎక్కువగా స్త్రీ జీవితాన్నే బలి తీసుకుంటోంది. 'ఈ ప్రభావం నీమీద పడింది కాబట్టి ఇంత స్పీచ్ ఇస్తున్నావు' అని మీరనుకుంటుంటారు. అదీ నిజమే. తనదాకా వస్తేగాని తలనెప్పి బాధ తెలియదన్నట్టు మగవాడినయ్యుండి... ఈ మూఢనమ్మకాలకు, పుకార్లకు బలి అయిపోయి ఇంత మానసిక సంక్షోభం అనుభవిస్తున్నాను. ఇంక సుకుమార మనస్తత్వం గల స్త్రీల పరిస్థితి ఆలో

చిస్తే... సారీ... మీకు బోర్ కొట్టిస్తు
న్నానా? " ఆగి అడిగాడు కుమార్.

"మీరు చెప్పేవన్నీ మాకు తెలిసినవేనను
కోండి. మీ మనసులో ఉన్నది మీరు
చెప్పారు. మీరు మా కస్టమర్ కాబట్టి మీరు
చెప్పేవన్నీ ఓపిగ్గా వినాల్సిన బాధ్యత
మాకుంది" అంది రాజి.

"ఇంతకీ మీకెలాంటి అమ్మాయి కావాలో
చెప్పనేలేదు" అంది విజయ.

"అందగత్తె కావాలని లేదు. సంస్కారవం
తురాలయి సంసారపక్షంగా ఉండి... మా
అమ్మను మంచి మనసుతో కూతురిలా
చూసుకుంటే చాలు" అన్నాడు కుమార్.

"మా ఎరికలో ఓ అమ్మాయి ఉంది.
మీకు సరిగ్గా జోడి అవుతుంది. పెద్ద
అందంగా లేదు. కానీ మంచి గుణవంతు
రాలు. కాకపోతే ఆ అమ్మాయి మీలాగే
పుకార్లకు బలి అయి భర్తనించి విడిపో
యింది" అంటూ ఆగింది కుమార్ ముఖక
వళికలు పరిశీలిస్తూ రాజేశ్వరి.

"అంటే పెళ్లయిన యువతా? " అడిగాడు
కుమార్.

"అవును!"

"ఎటువంటి పుకార్లు? "

"గొడ్రాలు"

"కాస్త వివరంగా చెప్పండి!"

"గిరిజకు దాదాపు పాతికేళ్లకు పైగా
ఉంటాయి. గ్రాడ్యుయేట్, ఉద్యోగం కూడా
చేస్తోంది. రెండేళ్లక్రితం పెళ్లయింది. పిల్లల
కోసం చెకప్‌కెళితే గిరిజకేలోపం లేదు.
ఆమె భర్తకే లోపం ఉంది కాబట్టి వారికి
పిల్లలు కలిగే అవకాశం లేదన్నారు. మగ
వాడుకదా ఆ లోపాన్ని జీర్ణించుకోలేక
పోగా... గిరిజకే ఆ లోపాన్ని ఆపాదించి
'గొడ్రాల'న్న పుకారు పుట్టించి విడాకులిచ్చే
శాడు.

"అతను మళ్లీ పెళ్లి చేసుకున్నాడు.
దిక్కూ మొక్కూ, చదువు సంస్కారంలేని...
ప్రశ్నించటానికి ధైర్యంలేని ఓ అమ్మాయిని
చేసుకుని మగవాడుగా భర్తగా చెలామణి
అవుతున్నాడు. ఇకపోతే గిరిజ తనూ స్త్రీనని
నిరూపించుకోవాలన్న తపనతో, అతను
వదిలేస్తే అందరి ఆడపిల్లల్లా ఏడుస్తూ
కూర్చోవటం ఇష్టంలేక ప్రతీకారంగా పెళ్లి
చేసుకుని తనేమిటో నిరూపించుకోవాలని
మా పాణిగ్రహణం ఆఫీసుకొచ్చి తనకు
పాణిగ్రహణం జరిపించమని కోరింది.

"మేము ఆ ప్రయత్నంలోనే ఉంటూ వరు
డిని వెతుకుతున్నాం. ఇకపోతే మీరూ,
గిరిజ ఇంచుమించు ఒకేరకమైన బాధలు
పడ్డారు. మీరిద్దరూ పెళ్లి చేసుకుంటే మీ
కాపురం ఏ ఒడిదుడుకులు లేకుండా
ఉంటుందని నా అభిప్రాయం. అలా
కాకుండా ఏ అవస్థలుపడని అమ్మాయిని
పెళ్లాడితే... ఈ పుకార్లు ఆమెను కూడా
బాధపెట్టి మిమ్మల్ని సరిగ్గా అర్థం చేసుకోని
వ్యక కలవరపడే అవకాశముంది. ఆలోచిం
చండి. మీకభ్యంతరం లేకపోతేనే సుమండీ!
బలవంతం మాత్రం లేదు" అంది రాజి.

ఆలోచిస్తున్నట్టు కాసేపు మౌనంగా ఉండి
పోయాడు కుమార్.

"పెళ్లయిన అమ్మాయిని చేసుకోవాల్సి
వస్తుందని ఆలోచిస్తున్నారా? "

"అబ్బెబ్బే! అలాంటిదేం లేదు. ఆమె మన
సులో భర్తకు స్థానం మంచిగా లేదు అని
అర్థమవుతోంది. ఆమె నన్ను తప్పకుండా
ప్రేమించి గౌరవిస్తుంది. ఆ నమ్మకం
నాకుంది. ఆమెతో మాట్లాడి మిగతా
ఏర్పాట్లు చూడండి. ఆమె సమ్మతిస్తే పాణి
గ్రహణం ఆఫీసులోనే పెళ్లి చేసుకుంటాం"
అన్నాడు కుమార్.

వారంరోజుల్లోగా కుమార్‌ను గిరిజకు
పరిచయం చెయ్యటం వారిద్దరూ ఒకరి
సమస్యలొకరు చర్చించుకుని ఒక అభిప్రా
యానికి రావటం, పాణిగ్రహణం ఆఫీసులో
పెళ్లి జరగటం మొత్తం జరిగిపోయాయి.

గిరిజ ఆనందం పట్టలేక కన్నీళ్లతో రాజే
శ్వరి పాదాలకు నమస్కరించబోయింది.

ఆమెను అడ్డుకుని కన్నీళ్లు తుడుస్తూ "మళ్లీ సంవత్సరం ఇదే టైంకు చంకలో బిడ్డతో కనిపించాలి సుమా" అంది రాజేశ్వరి.

గిరిజ బుగ్గలు ఎరుపెక్కాయి. పాణిగ్రహణం స్టాఫంతా గల గల నవ్వేశారు.

★ ★ ★

ఆరోజు పాణిగ్రహణం గుమ్మం ముందు నిలబడ్డ వ్యక్తిని చూసి స్టాఫందరూ నోరు తెరిచారు.

"ఏమిటంత వింతగా చూస్తున్నారు? ఎవరొచ్చారు? " అంటూ ఫైల్లోంచి తలెత్తిన రాజేశ్వరి గుమ్మంవైపు చూసింది. ఓ క్షణం స్తబ్దురాలై అంతలోనే తేరుకుని "లోపలికి రండి" అంది చిరునవ్వుతో.

ఆ వచ్చినావిడ దాదాపు అరవై అయిదేళ్ల పండు ముత్తయిదువ. వయసులో ఉన్నప్పుడు ఇంకెంత గ్లామరస్‌గా ఉండేదో ఇప్పుడే ఇంత అందంగా ఉంది అనుకునేలా, ఆకర్షణగా ఉంది మొహం. మంచి తెలుపు రంగు, కోటేరులాంటి ముక్కు, కట్టుడుపళ్లు, ముగ్గుబుట్టలాంటి తల, చిన్నముడి వేసుకుని అందులో ఓ రెండు చామంతిపూలు. ముఖాన పెద్ద బొట్టు. చేతులనిండా గాజులు. ఆకుపచ్చని వెంకటగిరి చీర. ఎర్రటి జాకెట్టు. ఎంతో హుందాగా, అందంగా, నడిచివచ్చిన పార్వతీదేవిలా ఉంది. మంచి ఎత్తుగా ఉండేమో వయసు బరువుతో కాస్త వంగింది. నడవటానికి ఆసరా అన్నట్టు ఊతకర్రను పట్టుకుంది.

"కూర్చోండి!" అంది రాజేశ్వరి.

"కొంపదీసి ఆవిడ తనకు వరుడిని వెతకమనదుకదా!" గుసగుసగా అంది సుశీల.

"ఏమో! అంటే మాత్రం ఆశ్చర్యమేముంది కలికాలం!" అంది విజయ.

"మనిషి మంచి గ్లామర్ మీదుంది. ఏ అక్కినేనిలాంటి తాతయ్యో దొరక్కపోడు. కాకపోతే కాస్త కష్టపడి వెతకాలి"

"రాజేశ్వరి ఈ కేసును చాలెంజ్‌గా తీసుకుని నెలలోగా ముడెయ్యదూ!" గుసగుసలాడుతున్న స్టాఫ్‌వైపు ఓసారి మందలింపుగా చూసి, ముసలావిడవైపు చూసి "చెప్పండి!" అంది రాజేశ్వరి.

"నేను చెప్పటం కాదు. ముందు నీవే చెప్పు. ఏకవచన ప్రయోగం చేస్తున్నానను కోకు. నా మనవరాలిలాంటిదానివి. నిన్ను బహువచన ప్రయోగం చెయ్యాలనిపించటం లేదు" అంది ముసలావిడ.

"ఫర్వాలేదు. మీరూ నాకు బామ్మలాంటివారు. మీకు నేనేం చెప్పాలో చెప్పండి" అంది రాజి.

"ఇంత వయసొచ్చినా గొంతులో మార్దవం తగ్గలేదు. సింగరేమో!" అంది సుశీల విజయతో.

"గట్టిగా మాట్లాడకు. అందరి ముసలాళ్లలా ఈ బామ్మకు చెముడున్నట్టు లేదు. అన్నివిధాల ఆరోగ్యంగా ఉంది" అంది విజయ.

"నా పేరు గంగాభవాని. అందరూ భవానమ్మ అని పిలుస్తారు. మావారేమో గంగా అని పిలుస్తారు. నా స్నేహితులు మాత్రం భవాని అని పిలుస్తారు. మీలాంటివారంతా బామ్మా అని పిలుస్తారు"

"ముసలావిడ ఛాదస్తంతో సుత్తికొడుతోంది బాబోయ్" అంది రమ.

"అలాగా! విషయం చెప్పండి. మీకు మానించి ఏ విధమైన సహాయం కావాలి. ఇందాక మీరు నన్నేదో అడుగుతానన్నారు ఏమిటది? " అంది రాజి అసలు విషయంలోకి రమ్మని ఇన్‌డైరెక్టుగా చెబుతున్నట్టు.

"ఆ! ఆ! ఏమీ అనుకోకేం... అవునూ మీరు ప్రేమించుకొన్నవాళ్ళకే పెళ్లి చేస్తారా... లేక..."

"మేము మొదట్లో ప్రేమ పెళ్లిళ్లు మాత్రమే చెయ్యాలని బోర్డుపెట్టి... ప్రకటనలా ఇచ్చాం. కాకపోతే పెళ్లి అవసరమైన వారంతా రావటం... వారిని కాదనలేక

జోడిని వెదకటం. ఇలాంటి క్రమంలో కేవలం ప్రేమ పెళ్లిళ్లు మాత్రమే అని గీత గీసుకోలేకపోయాం. అయితే మేం ప్రేమ పెళ్లిళ్లకంటే ఆదర్శ వివాహాలే ఎక్కువగా జరిపించాం. అనుకున్నదొకటి అయిందొకటీ అన్నట్టు జరిగిపోతున్నా ఆదర్శ వివాహాలు జరిపించటంవల్ల చాలా తృప్తి ఫీలవు తున్నాం" అంది రాజి.

"అయినా ఈ రోజుల్లో ప్రేమపెళ్లిళ్ల కోసం మీలాంటివారిని ఆశ్రయించేవారు అరుదుగా ఉంటారని నేననుకుంటున్నాను. ఎందుకంటే ఆల్ రెడీ, జోడిని వాళ్లంతట వాళ్లే వెతుక్కుని పాటలు పాడేసుకుని ఉంటారా? ఆ కాస్త తాళిబొట్టు కట్టడం కోసం మళ్లీ మీ దగ్గరకు రావటం... అనవ సరం అనుకుంటారు. నా ఊహ కరెక్టేనా అమ్మాయ్!"

'కరెక్టే'నంటూ తలూపింది రాజి నవ్వుతూ.

"ఏ గుడికో, తిరుపతికో చెక్కేస్తారు. పెళ్లి చేసుకుని వచ్చి 'మేజర్లమయ్యాం. నా పెళ్లి నా ఇష్టం. మీకిష్టమైతే హారతిచ్చి ఇంట్లోకి పిలుచుకోండి. కష్టమైతే వాటా పంచండి. వేరు కాపురం పెట్టుకుంటాం' అంటారు. సినిమాలో సోమయాజుల్లాంటి తండ్రయితే చూపులతో ఉరిమిచూసి డైలాగులేసి తరిమే స్తాడు. కోటశ్రీనివాసరావులాంటి తండ్ర యితే అసలుకే ఎసరు ఎందుకని అన్నీ దిగ మింగి స్వాగతం పలుకుతాడు"

'ఇంతకీ ఈవిడే పనిమీద వచ్చిందో చెప్ప కుండా అందరికీ తెలిసిన భారతం విప్పు తోందేమిటి.' మనసులో అనుకుంది రాజే శ్వరి.

"ఏమిటమ్మాయ్ ఫీలింగ్సు మార్చేస్తు న్నావు. ఇంతకీ ఈ ముసల్ది ఎందుకొచ్చిందా అని జుట్టు పీక్కుంటున్నావు అవునా. చూశావా నీ మనసులో ఉన్నది కనిపెట్టేశా ను...నేనెప్పుడూ అంతే. నావి 'ఎక్స్రే' కళ్లని అందరూ అంటుంటారు. ఇక అసలు విషయంలో కొచ్చేస్తానేం? "

"హమ్మయ్య! బామ్మగారు అసలు విష యంలో కొస్తారట. దగ్గరగా వచ్చి వినం డర్రా" అంది విజయ చనువుగా నవ్వుతూ.

"నేను పాణిగ్రహణం ఆఫీసుకొచ్చాను కాబట్టి పెళ్లి నాకే అనుకునేరు సుమా! నా మనవడు ఓ అమ్మాయిని ప్రేమించాడు. ఆ అమ్మాయి మా వాడిని గాఢంగా ప్రేమిం చింది. మా ఇంట్లో మాత్రం నాతోసహా నా మనవడికి గ్రీన్‌సిగ్నల్ ఇచ్చాం. వాళ్లింట్లో మాత్రం ఆ అమ్మాయి మనసు తెలుసుకో లేక కట్టడిచేసి వేరే పెళ్లి జరిపిస్తామంటు న్నారు"

"ఏం మీ మనవడికి ఉద్యోగం లేదా? "

"భలేదానివే. గవర్నమెంటుద్యోగం. నెలకు ఆరువేలు సంపాదిస్తాడు"

"అందంగా లేడా? "

"మన్మథుడిలా ఉంటాడు"

"దురలవాట్లు...

"అబ్బెబ్బే! చద్దన్నం వెధవ. బొత్తిగా టి.వి. కూడా చూడడు"

"అయితే మరీ చలిమిడిలా... ముద్దప ప్పులా ఉంటాడేమో"

"అసలు ఆ పిల్లను ప్రేమలో పడేసిందే వీడు. అంత ఇంటెలిజెంటనుకో"

"ఓహ్! వాళ్ళ కులంకంటే మీ కులం తక్కువ. తప్పకుండా ఇది కరెక్టయి ఉంటుంది"

"నా బొంద... కాదు. నీ బొంద. వాళ్లదీ మాదీ ఒకే కులం. పైగా ఆ పిల్ల నా మన వరాలు అంటే కూతురు కూతురన్నమాట. నా కొడుకు, కూతురు అంటే అన్నాచెల్లెళ్లు పోట్లాడుకున్నారు. వాళ్ల పిల్లలేమో ప్రేమిం చుకున్నారు. కూతురింటికి ఎన్నిసార్లు పెళ్లి రాయబారం పంపించినా కాదూ కూడదూ 'ఈ పెళ్లి జరిగితే కురుక్షేత్రం అవుతుంది. శవాలు పడతాయి' అంటూ అల్లుడుగారు ఒకటే అరుపులు. నా మనవడు చూస్తే నెలలోగా ఆ పిల్లతో పెళ్లి జరక్కుంటే రైలు

కింద తలపెడతానని ఏడుపు, బెదిరింపు. నా కొడుకు, కోడలు వీడిని చూసి ఒకటే దిగులు. ఇంట్లో అసలు అన్నం వండటం లేదు. ఇదీ మా పరిస్థితి. ఏం తోచక మీ దగ్గరకొచ్చాను.

"ఇన్ని పెళ్ళిళ్ళు చేశారుకదా. నా మనవడి పెళ్ళి జరిగేలాగా ఏదైనా ఉపాయంచెప్పి పుణ్యం కట్టుకోండి. వాడి మొహం చూస్తే నాకు ఏడుపొస్తోంది. ఆ పిల్లకోసం బెంగపెట్టుకున్నాడు. ఆ పిల్లకూ వీడంటే ప్రాణం. వాళ్ళ నాన్న సినిమాలో విలన్‌లాగా బైటికెళితే బాడీగార్డునిచ్చి పంపిస్తున్నాడు. ఎవడో తలమాసిన వెధవతో సంబంధం ఖాయం చేశాడు. పదిహేను రోజుల్లో పెళ్ళి.

"అయినా ఇన్ని సినిమాలు చూస్తారు కదా. ఆ పిల్ల... అదే నా మనవరాలు వాళ్ళ నాన్నను మభ్యపెట్టి మా యింటికి పరిగెత్తుకువచ్చి వీడితో తాళి కట్టించుకుంటే ఏమవుతుంది. వాళ్ళనాన్నేం చేస్తాడు. కాసేపు కారంతిన్న కాకిలా అరిచి నోరు మూసుకోడూ? ఈ కాలం పిల్లలకి బొత్తిగా ధైర్యంలేదు సుమా" అంది బామ్మ.

"చూడండి బామ్మగారూ! మేం వరుడిని కానీ, వధువును కానీ వెతగ్గలం. లేదా ఇక్కడే పెళ్ళి చేయగలం. అంతేకానీ ఉపాయాలూ వగైరాలంటే వీలుకాదు. దయచేసి అర్థం చేసుకోండి" అంది రాజేశ్వరి.

"అయ్యో, నా తల్లీ! నీ వయసుమాత్రం ఎంతనీ... ఈ వయసులోనే ఇంతమంది పెళ్ళిళ్ళు కుదురుస్తున్నారు కదా. ఆ పాటి అయిడియా ఇవ్వకపోతారా అని ఆశతో వచ్చానుగానీ ఉపాయాలన్నీ గ్రంథం రాసి పెట్టుకున్నావని అన్నానుటమ్మా" నిష్ఠూరం ధ్వనిస్తూ అంది బామ్మ.

"నేనో అయిడియా ఇస్తాను అమలుపరుస్తారా?" అంది విజయ ముందుకొచ్చి.

"చచ్చి నీ కడుపున మగపిల్లాడై పుట్టి రుణం తీర్చుకుంటా చెప్పు తల్లీ" అంది బామ్మ.

"ముందిది చెప్పండి. మీరూ తాతయ్యా ప్రేమించి పెళ్ళి చేసుకున్నారుకదూ" అడిగింది విజయ.

"వార్నీ! ఎలా కనుక్కున్నావే పిడుగా" ఆశ్చర్యంగా అడిగింది బామ్మ నవ్వుతూ.

"పెద్దలనెదిరించి చేసుకున్నారా?"

"అవునే అమ్మాయ్! ఆ రోజుల్లో ప్రేమ వివాహాలంటే విపరీతమైన తప్పు. అలాంటి రోజుల్లోనే మేమిద్దరం తిరుపతి వెళ్ళి పెళ్ళి చేసుకుని వేరుకాపురం పెట్టాం. కాకపోతే కొన్నాళ్ళు కష్టాలుపడ్డాం. మా అమ్మానాన్నల చావులు కూడా చూడనివ్వలేదు. బంధువులంతా వెలివేశారు. కాలం మారేకొద్దీ అందరూ అన్నీ మరిచి మమ్మల్ని మనుషులుగా గుర్తించారు. అందుకే ప్రేమించుకున్నవారంటే నాకు జాలి. ఎలాగైనా నా మనవడు, మనవరాలికి పెళ్ళి జరిపే ఉపాయం చెప్పుతల్లీ. ఈ ముసలిప్రాణం ఆ పిల్లల బాధ చూడలేకపోతోంది" అంటూ కన్నీళ్ళు తుడుచుకుంది బామ్మ.

"ఇదేం కొత్త ఉపాయమేం కాదు బామ్మా! తెలుగు సినిమాల్లోంచి కాపీకొట్టిందే. కాకపోతే ఇంకాస్త పకడ్బందీగా ప్లాను వేసుకుని రిస్కు తీసుకుంటే సక్సెస్ అవుతుంది" అంటూ ప్లాను వివరించింది విజయ.

ఆ ప్లాను బామ్మగారి మనవరాలు అమలుజరిపింది. అదేమిటంటే తాను మూడునెలల గర్భవతినంటూ నటించింది. అయితే సినిమాలోలాగా ఆమె తండ్రి నెత్తీనోరు బాదుకుని ఆమె కోరుకున్న అబ్బాయికిచ్చి పెళ్ళి చెయ్యలేదు. డాక్టరు దగ్గరికి తీసుకెళ్ళి పరీక్ష చేయించి గర్భవతి కాదని తేలిపోగా నాలుగు తగిలించి ఇంట్లో కూర్చోపెట్టాడు.

కాకపోతే ఈ తతంగమంతా గుట్టుగా జరగక రట్టు అయిపోయి కాబోయే వియ్యంకులకు తెలిసింది. పెళ్ళి క్యాన్సిల్ అన్నారు. నిజం కాదని ఎంత నచ్చచెప్పినా నమ్మలేదు. అమ్మాయి తండ్రికి గుండె నెప్పి వచ్చి వారం రోజులు హాస్పిటల్‌లో కూడా

ఉన్నాడు. హితుల సలహామేరకు చివరికి ప్రేమికులిద్దరికీ పెళ్ళి చేశాడు. కథ సుఖాంతమైంది.

★ ★ ★

"ఏమిటీ, నెలరోజులనుంచి పత్తాలేవు. అంత బిజీనా?" అడిగింది విజయ, చందూని.

"మరేనండీ. రెక్కాడితేగానీ డొక్కాడని ఉద్యోగం మాది. మీలాగా ఫ్యాన్లకింద ఫైళ్లు ముందేసుకు కూర్చుని పసుపుతాడుతో ముడేసే ఉద్యోగాలు కాదుగా"

"ఏం. వెక్కిరిస్తున్నారా?"

"ఎంతమాట. మిమ్మల్ని వెక్కిరించి బతగ్గలనా? అవునూ అందరికీ ముడులేయటమేనా, మీరు ముడి వేయించుకునేదేమైనా ఉందా లేదా?"

"అంత ఉబలాటంగా ఉందా? ఏమాత్రం సంపాదించారేమిటి?"

"ఏ వయసులో ముచ్చట ఆ వయసులో అని పెద్దలన్నారు. ఉబలాటంగానే ఉంది మరి. ఇక సంపాదనంటారా? ఏదో అర్భకుణ్ణి. భార్యాపిల్లల్ని పస్తులుంచకుండా పోషించగలను"

"అయితే మంచి అమ్మాయిని చూడమంటారా?"

"తప్పకుండా, అచ్చు మీలాంటి అమ్మాయిని చూడండి. మీరే అయినా ఎలాగోలా అడ్జస్ట్ అవగలను"

చందూ, విజయ నవ్వుకున్నారు.

"ఏమిటి విశేషాలు?"

"టీ హోటల్లో విశేషాలేముంటాయి మీరే చెప్పండి. ఆదర్శ వివాహాలు బాగా జరిపిస్తున్నారంటూ ఊరంతా పేరు తెచ్చుకున్నారు. మగవాళ్ళకేమాత్రం తీసిపోకుండా పెళ్ళిళ్ళు చేస్తున్నారంటూ చాలామంది అనుకుంటుంటారు. ఇలాంటి పెళ్ళిళ్ళు చేయటం వల్ల కులాల సమస్యను కాస్తయినా రూపుమాపవచ్చు అవునా?"

"ఈ దేశంలో కులాల సమస్య అంతరించాలంటే మరో మిలీనియం రావాలేమో! అయినా ఉడతాభక్తిగా మా ప్రయత్నం మేం చేసి మాకు మేమే తృప్తిపడుతున్నాం"

"అవునూ! పదిరోజులక్రిందట నాకు తెలిసిన ఒకతన్ని పాణిగ్రహణం ఆఫీసు అడ్రసిచ్చి పంపాను. వచ్చాడా?"

"ఆ వచ్చాడు. ఆ గెడ్డమతనేగా పేరు రామారావనుకుంటా. అతను మీ స్నేహితుడా?"

"స్నేహితుడుకాదు. టీ స్టాల్‌లో ముఖపరిచయం. ఎవరో అమ్మాయిని ప్రేమించాడట. ప్రేమ విఫలమైందిట. మాసిపోయిన గుడ్డలు, మెడకు మఫ్లర్ చుట్టుకుని, పెరిగిన గెడ్డంతో, నాన్‌స్టాప్‌గా సిగరెట్లు, టీలు తాగుతూ శూన్యంలోకి చూస్తూ ఉండేవాడు. ఓరోజు అతన్ని కదిలిస్తే ప్రేమ విఫలమైందంటూ బావురుమన్నాడు. జాలేసి అధైర్యపడకు అంటూ మీ దగ్గరకు పంపించాను. అతని సమస్య సాల్వ్‌చేశారా?"

"సాల్వ్‌లేదు! గుడ్డూలేదు. అతని సమస్యేమిటో తెలుసా! అతనో అమ్మాయిని ప్రేమించాడు. ఆ అమ్మాయీ ఇతన్ని ప్రేమించానంది. కొన్నాళ్లు సినిమాలూ, షికార్లు, ప్రేమలేఖలు వగైరాలన్నీ ముగిశాయి. ఏదైనా ఉద్యోగం చూసుకో, పెళ్ళి చేసుకుందాం అందిటామ్మాయి. కాదు ముందు పెళ్ళి చేసుకుంటే, ఆ తర్వాత మీ నాన్న ఎలాగూ నాకుద్యోగం ఇప్పిస్తాడు. ఉద్యోగానికి లంచాలకు డబ్బులేదు. మీ నాన్నదగ్గర దండిగా డబ్బుంది కదా! నిన్ను పెళ్ళాడితే అదంతా నాదే కదా అన్నాట్ట!

"దాంతో ఆ అమ్మాయికి పిచ్చికోపమొచ్చి ప్రేమాలేదు, దోమాలేదు పొమ్మంటూ తండ్రి తెచ్చిన సంబంధం చేసేసుకుందిట. ఇతను మా దగ్గరకొచ్చి పెళ్ళయిన ఆ అమ్మాయిని ఇంకా ప్రేమిస్తున్నాను ఎలాగైనా పెళ్ళి జరిపించండంటూ అడిగాడు. పెళ్ళయిన అమ్మాయితో నీకు పెళ్ళేమి

టంటూ మందలించాం. వినలేదు సరికదా మీరు మధ్యవర్తిత్వం జరిపి పెళ్ళి జరిపించకపోతే ఆ అమ్మాయి రాసిన ఉత్తరాలు నా దగ్గరున్నాయి బ్లాక్ మెయిల్ చేస్తానంటూ ఆవేశంలో నోరుజారాడు. అన్నంత పని చేసినా చేస్తాడని తలచి యస్.ఐ. గోవర్ధనిని పిలిపించాం. స్టేషనుకు పట్టుకుపోయి నాలుగు తగిలించేసరికి ఉత్తరాల కట్ట తెచ్చిచ్చాడుట. అవన్నీ తగలేసి అతనికి గట్టి వార్నింగ్ ఇచ్చి పంపేసరికి తలప్రాణం తోక కొచ్చింది. ఓ వారంరోజులు మా తలలన్నీ వేడెక్కాయంటే నమ్మండి"

"అమ్మో, గెడ్డంగాడికింత స్టోరీ ఉందా? వాడి సంగతి వదిలేసి టాపిక్ మారుద్దాం. రమకేదైనా సంబంధం కుదిరిందా? వాళ్ళ అమ్మానాన్నలు వచ్చారా? "

"అవును. చెప్పటం మరిచాను. రమకు వాళ్ళ అమ్మగారి తరపు బంధువుల్లో సంబంధం కుదిరింది. రేపు నెలలో పెళ్ళి. పెళ్ళయ్యాక కూడా రమ పాణిగ్రహణంలోనే పనిచేస్తానని కాబోయే భర్తతో కండిషన్ పెట్టిందట. వప్పుకున్నారట కూడా!"

"విజయా, మీరేం అనుకోనంటే మరో ప్రశ్న. మీ అమ్మానాన్నల సంగతేంటి? "

"ఆమధ్య అమ్మ ఒకసారి, నాన్న ఒకసారి వచ్చివెళ్ళారు. వారి పంతాలు వారివే. వాళ్ళింకా ఎవరికి వారే ఏమనుకుంటున్నారంటే ఎప్పటికైనా వారివైపునుంచి తెచ్చిన సంబంధాన్నే నేను అంగీకరించి పెళ్ళి చేసుకుంటాననే అనుకుంటూ నన్ను తమవైపుకు తిప్పుకోవాలని చూస్తున్నారు. కానీ ఈ సారి వాళ్ళు నన్ను చూడటానికొచ్చేసరికి జంటగా చూడవలసి వస్తుందని వారికి తెలీదు పాపం!" అంది విజయ.

విజయ చేతిని ప్రేమగా తన చేతిలోకి తీసుకున్నాడు చందూ!

★ ★ ★

"ఎక్స్క్యూజ్ మీ" అన్న గొంతు వినిపించి పాణిగ్రహణం స్టాఫ్ గుమ్మంవైపు చూశారు.

"రండి, కూర్చోండి" అంది తనకెదురుగా ఉన్న సీటు చూపిస్తూ రాజి.

దాదాపు నలభై అయిదు సంవత్సరాల స్త్రీ. మంచి ఎత్తు, ఆకర్షణీయమైన మొహం, పాపిట్లో నెరసిన వెంట్రుకలను కప్పిపుచ్చే ప్రయత్నాలేవీ చేయకపోవడంవల్లనేమో చూడగానే హుందాగా, గౌరవనీయంగా కనిపిస్తోంది"

"చెప్పండి" అంది రాజేశ్వరి.

"నా పేరు లీలావతి. నా వయసు నలభై అయిదు సంవత్సరాలు. మీ పాణిగ్రహణం వారు నా వయసు వారికెవరికైనా వరుణ్ణి వెతికి పెట్టారా? "

"నా వయసువారు అంటున్నారు. మీరు ముసలమ్మలా మాట్లాడవద్దు"

"అది కాదు. పాణిగ్రహణం స్టాఫ్... పెళ్ళిళ్ళు.. అంటూ అందరూ పొగుడుతుంటే మీరంతా అనుభవంతోనూ, వయసుతోనూ బాగా పండిపోయి ఉంటారు. అందుకే ఇలా పెళ్ళిళ్ళు చేసి మంచిపేరు తెచ్చుకున్నారు అని అనుకున్నాను. కానీ మిమ్మల్నందర్నీ చూశాక ఇంత చిన్న పిల్లలు... సారీ నా వయసుముందు మీరు చిన్నపిల్లలేకదా మీముందు కొచ్చి 'నేను పెళ్ళి చేసుకోవాలనుకుంటున్నాను. వరుడు కావాలి' అని మీతో చెప్పాలంటే సిగ్గనిపిస్తోంది" అంది లీలావతి.

"మీ అభిప్రాయం మీ మనసులో ఉన్నది మీరు చెప్పారు. తప్పేంలేదు. మాముందు మీరు మీ పెళ్ళి గురించి నామోషీ కానీ, సిగ్గు బిడియాలు పడవలసిన అవసరంగానీ లేదు. ఎందుకంటే ఇది మా ఉద్యోగం... మీరు మీ అవసరార్థం ఏదైనా డిపార్టుమెంట్కెళ్ళినప్పుడు ఆ వృత్తిలో ఉన్న వ్యక్తి వయసును చూస్తారా? అతనివల్ల మీక్కావలసిన పనిని గూర్చికదా ఆలోచిస్తారు. ఇదీ అంతే. కాబట్టి ఆ సంకోచాలన్నీ పక్కకు పెట్టి మీ వివరాలు, మావల్ల మీక్కావలసిన పనిగురించి మాత్రమే చెప్పండి" అంది రాజే

శ్వరి.

అంతవరకూ ఉన్న బిడియం, సంకోచం రాజేశ్వరి మాటలతో తొలగిపోగా గుండెల నిండా గాలి పీల్చుకుని రిలాక్సింగ్‌గా కుర్చీలో కూర్చుని చెప్పసాగింది లీలావతి.

"నాకు అమ్మానాన్నా చాలా చిన్నప్పుడే చనిపోయారు. ఇద్దరు తమ్ముళ్ళు, ఒక చెల్లెలు ఉన్నారు. అమ్మానాన్నాలు పోవటంతో వారి భారం నామీద పడింది. వరుడికోసం వచ్చి చరిత్ర అంతా చెబుతుందేమిటా? అని అనుకుంటున్నారు కదూ. ఈ వయసు వరకూ పెళ్ళి కాకుండా ఉండవలసి వచ్చిన కారణాలు గురించి చెబుతున్నాను. మీకేమైనా 'బోర్'గా అనిపిస్తోందా? " అంది లీలావతి మధ్యలో ఆపి.

"అటువంటిదేంలేదు. మీరు మమ్మల్ని స్నేహితులుగా భావించి, మొత్తం చెప్పచ్చు. మేం బోర్ ఫీల్ కాము" అంది చిరునవ్వుతో రాజి.

"అమ్మానాన్నలు సంపాదించిన ఆస్తులేవీ లేవు ఒక్క ఇల్లుతప్ప. కొన్నిరోజులు మేనమామ ఆదరించాడు. కానీ మా అత్తయ్య పోరు పడలేక, ఆయన మమ్మల్ని మళ్ళీ మా ఇంటికి పంపించి పెద్దదిక్కుగా అమ్మమ్మను, తాతయ్యనూ పంపాడు. తాతయ్య ప్లీడరు దగ్గర గుమస్తాగా చేసేవాడు. నాకు పద్దెనిమిదేళ్ళ వయసొచ్చేవరకూ ఆయన సంపాదనతో కుంటినడకన బతుకులీడ్చాం.

"ముసలాళ్ళిద్దరూ మంచాన పడటంతో మామయ్య వాళ్ళిద్దరినీ తీసుకుని వెళ్ళాడు. పెద్ద తమ్ముడు టెన్త్, చిన్నవాడు నైన్త్, చెల్లి సిక్స్ ఇలా చదువుకుంటున్నారు. నేను ఇంటర్‌తోనే ఆపేయాల్సివచ్చింది. ఓ షాపులో సేల్స్‌గర్ల్‌గా చేరాను. షాపు యజమాని నన్ను కూతురిలా చూసుకుని నాకు, నా తమ్ముళ్ళకు బాగా సహాయం చేశాడు. నా చదువును మళ్ళీ కొనసాగించాను. అతని పరపతితో ముందు తాత్కాలికంగా, ఆ తరువాత పర్మినెంట్‌గా ఓ గవర్నమెంట్ ఉద్యోగం ఇప్పించాడు. తమ్ముళ్ళను ఒకడిని ఇంజనీరుగా, ఇంకొకడిని డాక్టరుగా చదివించాను. ఇప్పుడు వాళ్ళకాళ్ళమీద వాళ్ళు నిలబడి బతుకుతున్నారు. చెల్లిని టీచర్ ట్రయినింగు చదివించి పెళ్ళిచేశాను. రేపో మాపో దానికీ ఉద్యోగం వస్తుంది.

'అన్ని బాధ్యతలూ తీరాయి కాబట్టి పెళ్ళి చేసుకోవాలనిపించింది' అని మీరనుకుంటారేమో! ఈ బాధ్యతలు, బాధల మధ్య నలుగుతూన్న నాకు పెళ్ళి అనేమాటే మనసులోకి రాలేదు. యాంత్రికంగా రోజులు గడుపుతున్నరోజుల్లో మా దూరపుబంధువు శ్రీపతి నాకు దగ్గరయ్యాడు. మేమిద్దరం ప్రేమించుకున్నాం. కానీ బాధ్యతలు తీరేదాకా పెళ్ళిచేసుకోకూడదని నిర్ణయించుకున్నాం. కానీ అతని తండ్రి, అంతా సినిమా ట్రిక్ డ్రామా జరిపి మేనకోడలును శ్రీపతికిచ్చి పెళ్ళిచేశాడు. శ్రీపతికి పెళ్ళయిన మొదట్లో చాలా బాధపడ్డాను. క్రమక్రమంగా మరిచిపోయాను.

"కానీ శ్రీపతి నాతోను, మా యింటితోను ఉన్న అనుబంధం మర్చిపోలేక అప్పుడప్పుడు మా ఇంటికి వచ్చి పలకరించి పోతుండేవాడు. అతని భార్యకు మా పూర్వ పరిచయం ముందే తెలిసుండటం వల్ల అతనిప్పుడు మా ఇంటికి రావటం భరించలేకపోగా అనుమానంతో భర్తను సాధించి అతనికి మనశ్శాంతి లేకుండా చెయ్యసాగింది. ఆమె ఎంత అనుమానాగ్నిలో కాలిపోతోందంటే మొన్నామధ్య ఆత్మహత్యా ప్రయత్నం చేసి ప్రాణంమీదికి తెచ్చుకుంది.

"ఆమె భర్తతో ఏ సంబంధమూ లేకపోతే నేను పెళ్ళి చేసుకోకుండా ఒంటరిగా ఉండనుట. ఒకటికాదు, రెండుకాదు నోటితో చెప్పడానికి వీలుకాని మాటలతో అటు భర్తను వేధించడమేకాక, రెండుమూడు సార్లు సంస్కారం మరిచి మా ఇంటిముందుకొచ్చి గలాటా చేసి నా పరువు తీసింది. ఇదిలా ఉండగా ఇన్నేళ్ళుగా నాకు గౌరవ

మిచ్చి భయభక్తులతో ఉండే నా తమ్ముళ్ళు, వాళ్ళ భార్యలు నేనేదో తప్పు చేసినట్టు... మాట్లాడుతూ నన్నో పురుగును చూసినట్టు చూస్తున్నారు.

"ఈ నిరసనను భరించలేకపోతున్నాను. కనీసం నా మనసు విప్పి, నా బాధ చెప్పుకోవడానికి, ఆత్మీయంగా మాట్లాడే మనిషి కరువై అల్లాడుతున్న టైంలో, మా చెల్లి నాకో సలహా ఇచ్చింది పెళ్ళి చేసుకొమ్మనీ, ఆ విషయంలో మీ దగ్గరికి వెళ్ళమనీను. నేనూ ఆలోచించాను. నేను పెళ్ళి చేసుకోవడంవల్ల చాలామందికి పజిల్‌గా కనిపిస్తున్న నేను పరిష్కారమౌతాననీ, శ్రీపతికి కూడా భార్యతో బాధలు ఉండవనీ, నాకూ ఈ వయసులో ఓ తోడుండటం అవసరమనీ, ఇలా అన్నివిధాలా ఆలోచించాను.

"అందుకే ఇలా వచ్చాను. ఈ వయసులో పవిత్రమైన బ్రహ్మచారి భర్తగా దొరకడని నాకు తెలుసు. మంచి మనసుతో నన్ను ఆదరించి నాకో తోడుగా ఉండే వ్యక్తి ఏ వయసువాడైనా ఫర్వాలేదు" అంది లీలావతి ముగిస్తూ.

ఆమె చెప్పిందంతా విని అందరూ భారంగా నిట్టూర్చారు.

"స్త్రీ తల్లిగా, చెల్లిగా, అక్కగా, వదినగా రకరకాల పాత్రలకు న్యాయం చేస్తూనే ఉంది. సమాజం ఆమె నోరుమూయిస్తూ, తాను చెప్పిన పాత్ర వేసే స్థితికి స్త్రీని దింపుతూనే ఉంది. ఆమె కూడా ఆ పరిస్థితులకు తల ఒగ్గుతూనే ఉంది. లేకుంటే సమాజంలో ఆమెకు స్థానంలేదు. సమాజంకోసం కాకుండా స్త్రీ తనకోసం తాను బతకటం ఎప్పటికి నేర్చుకుంటుందో" మనసులో అనుకుంటూ,

"మీకు సరిఅయిన జోడి రెడీగా ఉంది. క్రితం నెలలో రిటైరయిన ఓ ఆఫీసర్ కన్న బిడ్డలతో ఘర్షణ పడి విడిగా ఉంటున్నాడు. భార్య చనిపోయి చాలా ఏళ్ళయింది. విడో అయినా ఫర్వాలేదు. విడాకులు తీసుకున్న యువతి అయినా ఫర్వాలేదు. చివరికి పిల్లలున్న తల్లి అయినా ఫర్వాలేదు. పెళ్ళి చేసుకుంటానంటూ ఓ ప్రముఖ దినపత్రికలో ప్రకటించాడు. అతని అడ్రసు, వివరాలు, మంచిచెడ్డల సేకరణతో ఫైల్ చేశాం. అతను మీకు అన్నివిధాల సరిపోతాడనీ నేననుకుంటున్నాను" అంది రాజి.

లీలావతి అంగీకారంతో నెలరోజుల్లోగా ఆ రిటైర్డు ఆఫీసర్‌కు లీలావతితో వివాహం పాణిగ్రహణం ఆఫీస్‌లోనే సింపుల్‌గా జరిగింది. పెద్దవాళ్ళ పెళ్ళికి పిల్లలు అక్షింతలు వేశారు ఆనందంగా.

★ ★ ★

"అమ్మకు రాజేశ్వరి రాయు ఉత్తరం.

నీవు రాసిన ఉత్తరం మురళి ద్వారా చదివాను. పెళ్లి, దాని ప్రాముఖ్యం... దాని అవసరం గూర్చి నీ సుదీర్ఘ థియరీ చదివి నవ్వుకున్నాను.

"అమ్మా! నీవన్నట్టు ఏ కులంలోనైనా, ఏ మతంలోనైనా పెళ్లి అనే బంధం స్త్రీకి కొత్త బాంధవ్యాన్ని ఏర్పరుస్తుంది. భర్త, కుటుంబమే తన ప్రపంచం. తన ఆలోచనలు, లక్ష్యాలు అన్నీ ఆ కుటుంబ పరిధిలోనే సాగి ఆ కుటుంబ వారసత్వాన్ని కొనసాగించటం, ఆ కుటుంబ సాంప్రదాయాలు, ఆచారాలను జీర్ణించుకోవటం ఆనవాయితీగా వస్తున్న నిజం. దాన్ని నేను కాదనను. కానీ పురుషస్వామ్య సమాజంలో స్త్రీకంటూ ఓ ప్రత్యేకమైన గుర్తింపులేదే... అస్తిత్వమూ లేదుకదా... నాలో ఏదో నిస్పృహ, నీరసం. మనమేం చెయ్యలేమా అన్న ప్రశ్నలు చేరి నా మెదడును తొలిచేస్తుంటాయి. దానికారణం మన ఇంటివాతావరణం...జరిగిన సంఘటనల ప్రభావమూ కావచ్చు!

"కొన్ని సంఘటనలు జరిగి చాలాకాలం అయినప్పటికీ వాటి వాటి ఫలితాలు, ప్రభావాలు మనల్ని నీడలా వెంటాడుతూనే ఉంటాయి. విచిత్ర సన్నివేశాలు, సంభాష

ణలూ... కొత్త కొత్త ఆలోచనలను రేకెత్తి స్తుంటాయి.

అమ్మా! నా ఆలోచనలు మాతృస్వామ్య వ్యవస్థచుట్టూ పరిభ్రమిస్తున్నాయి. మాతృ స్వామ్య వ్యవస్థకోసం నిరీక్షిస్తున్నాను. ఈ నిరీక్షణలో కాలమంతా కరిగి పోతుందేమో!

నేనెదురుచూస్తున్న వ్యవస్థ తప్పకుండా వస్తుంది. అమలు జరుగుతుంది. నాకాన మ్మకం వుంది.

నాన్నగారి కోపం గూర్చి రాశావు. ఏ పాత్ర వేయమంటే ఆ పాత్ర వేసి పితృ స్వామ్య వ్యవస్థకు గులాము కావటం నాకి ష్టంలేదు. నాకోసం నేను బ్రతకాలనుకు న్నాను. ఆ బతుకు కోసం నా వృత్తిని నేనే ఎంచుకున్నాను. నాలాంటి అమ్మాయిల పెళ్లి సమస్యల గురించి, వారి మానసిక సంఘర్షణ గురించి... నా జీవితమే నాకో పాఠం నేర్పడంవల్లనేమో నేను చేయాల్సిన ఉద్యోగం నేనే కల్పించుకున్నాను. పురు షులు నిర్వర్తించే ఈ వృత్తి స్త్రీలు చేయట మేమిటా అని ఎందరో గేలిచేశారు. వేచి చూశారు.

ఇప్పుడు మెచ్చుకుంటున్నారు.

ఇది నా ఒక్కదాని కృషికాదు సమిష్టి కృషి. పాణిగ్రహణంలో మా స్టాఫంతా అంకితభావంతో... ప్రతి పెళ్లి ఛాలెంజ్‌గా తీసుకుని... తమ తమ విధులు నిర్వర్తించ టంవల్లనే ఈరోజు ఈ మంచి పేరు సంపా దించుకోగలిగాము.

అమ్మా! ఎందరో అమాయకమైన అమ్మా యిల భవిష్యత్ కోసం కొన్నిసార్లు అభిమా నాన్ని కూడా చంపుకోవలసి వస్తుంది. అయినా నాకు బాధలేదు సరికదా ప్రతి పెళ్లి నాకో ఛాలెంజ్‌గా ఉంటోంది. నేను సృష్టించుకున్న ఈ ఉద్యోగంలో ప్రతిక్షణం జీవిస్తున్నాను. ప్రతిక్షణం ఆలోచిస్తున్నాను. వారసత్వాలుగా లభించే హోదాలు, ఆస్తులు కంటే కష్టపడి సంపాదించుకున్న ఈ హోదా... పదిమందికి దారిచూపుతున్న ఈ వృత్తి... ఎన్నో... జీవితాలను చదవగలిగే ఈ అవకాశం... నాకు గమ్యం వైపు దారి చూపిస్తున్నాయి.

ఇకపోతే నాన్నగారు ఏమాత్రం మార కుండా తాపట్టిన కుందేటికి మూడే కాళ్ల న్నట్టు... నా పెళ్లి చక్రవర్తితోనే జరిపిస్తా నంటూ మూర్ఖంగా మాట్లాడుతున్నారని తెలిసింది. ఆయనకు బాధ కలిగించినాసరే, నామాటగా నా ఈ ఉత్తరాన్ని ఆయనకు చూపించు. అన్నచాటు చెల్లిగా, తండ్రిచాటు బిడ్డగా... అనామకుల్లా... అమాయకుల్లా కనిపించే కాలంపోయింది. నేను వేసే ముందడుగును శాసించే హక్కుగానీ, నన్ను నియంత్రించే అధికారంగానీ ఆయనకు లేవు.

నాకేం కావాలో నాకు స్పష్టంగా తెలుసు. నా స్వేచ్ఛపై... నా జీవితంపై ఎవరూ దాడిచేయని రీతిలో నాకు నేనే పహరా కాసుకుంటున్నాను. నన్ను ఆపి ఆయన దారిలోనికి తెచ్చుకునే ఏ ఆయుధమూ ఇక ఆయన దగ్గర లేదని చెప్పు. నాలో వచ్చిన మార్పుకు ఆయన భాషలో ఏ పేరు పెట్టు కున్నా బాధలేదు. భయంలేదు. జన్మనిచ్చిన తండ్రికి ఇంత కటువుగా చెప్పమనవలసి వస్తున్నందుకు కొంచెం బాధగానే ఉంది. ఆయనే నాకీ పరిస్థితి కల్పించారంటే అతి శయం కాదేమో.

అమ్మా! త్వరలోనే నీకోరిక నెరవేరబో తోంది. నా అభిప్రాయాలను, ఆశయాలను గౌరవించి చివరివరకు తోడూ నీడగా నిలు స్తాడన్న నమ్మకంతో మురళిని నా జీవిత భాగస్వామిని చేసుకోబోతున్నాను. ఆ సమయం రాగానే నీకు కబురు పంపి స్తాను.

ఉంటాను ప్రేమతో రాజేశ్వరి"

ఉత్తరం రాయటం ముగించి కవరు మీద అడ్రసు రాస్తుండగా "మురళిగారా? రండి రండి" అంటున్న విజయ గొంతు విని చేస్తున్న పని ఆపి తలెత్తింది రాజేశ్వరి.

ఆశ్చర్యంగా కళ్లు విప్పార్చి చూసింది. అక్కడ రాజేశ్వరి తండ్రి నిలబడి ఉన్నాడు. అతని కిరువైపులా చందూ, మురళి. చందూ తల్లిదండ్రులు శకుంతల, నారాయణరావులు నిలబడి ఉన్నారు. అందరూ గుమ్మందాటి లోపలికొచ్చారు. ఉలిక్కిపడి ఈ లోకంలోకొచ్చి అంతవరకు రాసిన ఉత్తరాన్ని నిశ్శబ్దంగా ఉండచుట్టి డస్ట్‌బిన్‌లో పడేసి తండ్రినీ ఆ వచ్చిన వారినీ ఆనందాశ్రువులతో చూసింది రాజేశ్వరి.

★ ★ ★

"ఏమిటీ! అందరూ చేరి ఏవో లెక్కలేస్తున్నారు? " టవల్‌తో మొహం తుడుచుకుంటూ వచ్చి కూర్చుంది రాజేశ్వరి.

"చక్రవర్తి, అతని భార్య, మురళి తల్లిదండ్రులు, రాజేశ్వరి తల్లిదండ్రులు, విజయ, చందూ, రమ, అందరూ ప్లేట్లలో పకోడీలు తింటూ చర్చించుకుంటున్నారు. వాళ్ళ మధ్యనున్న టీపాయిమీద కొన్ని పెళ్లిపత్రికలు, పేపర్లు, పెన్నులు, అడ్రసులున్న కవర్లు అస్తవ్యస్తంగా పడివున్నాయి. కమలమ్మగారు ఓ ప్లేటుతో పకోడీలు తెచ్చి కూతురికిచ్చి "ముందు తిను! తర్వాత తీరిగ్గా మాట్లాడుకోవచ్చు మొహం చూడు ఎలా పీక్కుపోయిందో, టైంకి సరిగ్గా భోంచేయమంటే భోంచేయవుకదా" అంటూ కూతురిని కళ్లనిండుగా చూసుకుంటూ ఎదురుగా కూర్చుంది. పకోడీలను తింటూ "ఇంతకీ దేన్ని గురించి చర్చ? " అంది రాజి.

"పెళ్లి ఖర్చుల గురించి రాజీ" అంది రమ!

"నా పెళ్లి ఎలాగూ గ్రాండ్‌గా జరగలేదు. కలలో కళ్యాణం... ఇలలో కాపురంలాగా అయిపోయింది. నీ పెళ్లయినా గ్రాండ్‌గా... అంటే ఆకాశమంత పీట భూదేవంతపందిరి... సారీ... తప్పు చెప్పినట్టున్నాను. ఇటు అటుచేసి అర్థంచేసుకోండి. ఆ టైపులో పెళ్లిచేయాలని మామయ్యా, అత్తయ్యలు అనుకుంటున్నారు రాజీ" అన్నాడు చక్రవర్తి.

"అబ్బో" అన్నట్టుగా చూశారందరూ చక్రవర్తిని!

"పెళ్లయ్యాక నీకు కవిత్వం కూడా బాగా వచ్చినట్టుంది చక్రీ"అన్నాడు చందూ పరిహాసంగా.

"ఈ శుభలేఖల మోడల్స్ చూడు నీకేది నచ్చుతుందో" అంది విజయ.

"ఈరోజు సాయంకాలం పట్టుచీరల సెలక్షన్ కెళ్లాలి. కాస్త ఓ రెండు గంటలు ఖాళీగా ఉండమ్మా" అన్నారు లక్ష్మణరావు.

"అబ్బో! చక్రవర్తి బావన్నట్టు మా పెళ్లి నిజంగానే చాలా గొప్పగా చేసేట్టున్నారే" అంది రాజి.

"ఊళ్ళో అన్నిటికంటే పెద్ద కళ్యాణమంటపం బుక్‌చేస్తారుట మామయ్య" అన్నాడు మురళి.

"అలాగా! కల్యాణమంటపం బుక్ చేయగానే సరా! డెకరేషన్ వగైరా ఉంటాయి కదా! అంటే ఎంట్రన్స్‌లో ఓ పెద్ద కటవుట్ మీద పూలతో వధూవరుల పేర్లు... షామియానా... పెళ్లిమంటపం... పూలతో... లైట్లతో... మొత్తం కల్యాణమంటపమంతా వెలిగిపోవాలి. కదూనాన్నా! ఈ డెకరేషన్ ఖర్చు ఎంతవుతుందో? " అడిగింది రాజి.

"ఓ యాభైవేలు కావచ్చు" అన్నాడు లక్ష్మణరావు.

"అంతేనా! సరే. ఎంతమందిని పిలుస్తారేమిటి? "

"ఇంతమంది అని లెక్కబెట్టుకుంటామా ఏమిటీ... మళ్లీ మళ్లీ మనింట్లో పెళ్లిళ్లు చేసేదేముంది? మా చేతులమీదుగా చేసే ఆఖరి పెళ్లి. బంధువులను, స్నేహితులనూ పేరు పేరునా పిలవాలి. అదీగాక అంతపెద్ద కల్యాణమంటపం... నిండుగా జనం వస్తేనే కళకళలాడుతుంది. మరీ తక్కువమంది వస్తే బోసిపోదూ? హీనపక్షం వెయ్యిమందికి తక్కువయితే బాగోదు. ఏమంటారు? " అంది కమలమ్మ భర్తవైపు చూస్తూ.

నువ్వు చెప్పింది కరెక్ట్ అన్నట్టు తలూ

పాడు లక్ష్మణరావు.

"అమ్మా, నాన్నా! నేనోమాట చెబుతాను. వింటారా? " అంది రాజి.

"ఏమిటమ్మా? చెప్పు" నవ్వుతూ అన్నారు లక్ష్మణరావు.

"లక్షలకు లక్షలు ఖర్చుపెట్టి తాళి కట్టిస్తే తప్ప పెళ్లనిపించుకోదా? "

"అదికాదమ్మా..." మాట్లాడబోయిన లక్ష్మణరావును ఆపి...

"వద్దు. నాకింకేం చెప్పొద్దు. ఈ తరహా పెళ్లి మీరు నాకు చేయాలనుకుంటే నాకసలు పెళ్లేవద్దు. ఎప్పటిలా మురళి, నేను ఫ్రెండ్స్‌లా వుండిపోతాం!" ఖచ్చితంగా చెప్పింది రాజేశ్వరి.

"ఏమిటి రాజీ! ప్రతిదానికీ ఏదో వంక పెట్టి మాట్లాడ్డం గొప్పనుకుంటున్నావా ఏమిటీ? కన్న తల్లిదండ్రులు... వాళ్లకీ అచ్చటా, ముచ్చటా చూడాలని ఉండదా? మరీ దిక్కులేనివాళ్లలాగానో, బికారివాళ్లలాగానో పెళ్లి అయిందంటే అయిందనిపిస్తే ఏం బాగుంటుంది? " విసుక్కున్నాడు చందూ.

"ఏం తండ్రీ! డబ్బు బాగా సంపాదించావా పోజులు కొడుతున్నావు. ఒక లక్ష రూపాయలు సంపాదించడానికి ఎన్ని రోజులు కష్టపడాలి అన్న సంగతి నీకు బాగా తెలిసేవుంటుంది. ఓ లక్ష ఖర్చుపెట్ట డానికి ఎంత టైం చాలన్న సంగతి కూడా తెలిసే ఉంటుంది. కష్టం విలువ తెలిసున్న వాడివి నీవు కూడా ఆర్భాటాలకి పోతున్నావా? అందరూ వస్తారు. తింటారు. ఆహా ఓహో అంటారు. ఏవో బహుమతులిస్తారు. వెళ్లిపోతారు. అంతా ఒక్కరోజే. ఆ తర్వాత మనగురించి, మన పెళ్లి గురించి ఎవరూ ఆలోచించరు. పెళ్లి ఘనంగా చేసుకున్నామని గిన్నీస్ బుక్‌లోకెక్కము. ఆ కాసేపటి ఆర్భాటం కోసం అప్పులుచేయడం, దిగులు పడడం... ఇకపోతే తల్లిదండ్రులను అచ్చటా ముచ్చటా పేరుతో టెన్షన్‌కి గురి చేయకుండా ఈ వయసులో వాళ్లని నిశ్చింతగా బతికేలా చూడాల్సిన బాధ్యత మనకుంది"

కమలమ్మ, లక్ష్మణరావు మొహాలు చిన్న బుచ్చుకున్నారు. అది గమనించి మురళి, "అవును మామయ్యా! రాజి చెప్పింది అక్షరాలా నిజం. అనవసర ఖర్చులు వద్దు. సింపుల్‌గా జరిపించండి. ఏ ఇబ్బందులు లేకుండా ఉంటుంది" అన్నాడు.

"మీరంతగా పట్టుబడుతుంటే మేం చేసేదేముంది? " అన్నారు రాజి తల్లిదండ్రులు.

విజయ- చందూలకు, రాజేశ్వరి- మురళి, రమ- కిరణ్‌లకు సింపుల్‌గా పాణిగ్రహణం ఆఫీసులో పెళ్లి జరిగింది. పెళ్లవగానే అందరూ హోటల్‌కెళ్లి డిన్నర్ కానిచ్చి వచ్చారు. ముగ్గురి పెళ్లిఫొటోలు పేపర్లో వేయించారు.

తమతమ పిల్లల పెళ్లిళ్లు తృప్తిగా కళ్లారా చూసుకున్నారు తల్లిదండ్రులు. వాళ్ల కళ్లల్లో ఆనందబాష్పాలు చూసి "పెళ్లితో తప్ప జీవితాలు పరిపూర్ణం కావంటారు పెద్దలు. అందుకేనేమో వీళ్లకింత తృప్తి, సంతోషమూ..." అనుకుంది మనసులో రాజేశ్వరి.

★ ★ ★

"ఎక్స్‌క్యూజ్ మీ!"

"యస్! కమిన్ ప్లీజ్!" అంటూ తలెత్తి చూసి లోపలికి ఆహ్వానించిందా యువతిని రాజేశ్వరి. ఆమెను పరిశీలనగా చూసింది. వయసు ముప్ఫయి మించి ఉండదు. అందంగా ఉంది.

"కూర్చోండి!" అంటూ కుర్చీ చూపించింది. ఆమె గదిలోనున్న స్టాఫందరినీ ఓసారి కలియచూసి సంశయిస్తూ కూర్చుంది.

"చెప్పండి!" అంది రాజి.

ఆమె సంశయిస్తుంటే "చెప్పండి! ఫర్వాలేదు. ఇక్కడున్న వాళ్ళంతా మీ తోబుట్టువుల్లాంటి వారు. మీ సమస్య

ఎలాంటిదైనా అర్థంచేసుకుంటారు. సలహాలి స్తారు. సహాయం చేస్తారు. రహస్యంగా ఉంచుతారు కూడా. నిస్సంకోచంగా చెప్పండి" అంది రాజి.

రాజి మాటలతో కాస్త రిలాక్సయి చెప్ప సాగింది.

"నా పేరు కల్పన! నాకు పెళ్ళయింది. ఇద్దరు పిల్లలు. మావారు బ్యాంకు ఆఫీ సరు. చాలా మంచివారు. మేమెంతో అన్యో న్యంగా ఉంటాము. మా పెళ్ళయిన అయిదు సంవత్సరాలకు మా అత్తగారు చనిపోయారు. మా మామగారి వయసు దాదాపు డబ్భయి సంవత్సరాలు. బాగా ముసలాయన. అత్తగారు చనిపోయేవరకు ఆయనకు ఆవిడే సేవలు చేసేది. ఆవిడ సేవలకు ఆయన బాగా అలవాటుపడ్డారు. ఆవిడపోయాక ఈమధ్య మా యింట్లో పోట్లాటలెక్కువయ్యాయి"

"ఏ విషయంలో!"

"ఎవరైనా యువతిని చూసి తనకు పెళ్ళి చేయమంటూ మా మామగారు ఒకటే గోల!"

స్టాఫందరూ ఆశ్చర్యంగా ఒకరి మొహాలొ కరు చూసుకున్నారు.

"ఆశ్చర్యపోతున్నారు కదూ! తన సేవలు చేయటానికి, తన అవసరాలు తీర్చటానికి తనకు తప్పనిసరిగా ఓ తోడు కావాలిట!"

"మీరు కోడలిగా ఆయనకు సేవలు చెయ్యలేరా? "

"నా పెళ్ళయినప్పటినించి ఆయన్ని తండ్రిలా భావించాను. నా కాయనంటే ద్వేషంలేదు. కోపంలేదు. ఆయనకు దగ్గ రుండి అన్ని సేవలు చేస్తున్నాను"

"మరి? "

"ఆయనకు నాతో సేవలు చేయించుకో వటం ఇష్టంలేదుట. తన భార్య స్థానంలో ఓ యువతి కావాలిట. ఈ వయసులో ఇవేం బుద్ధులని మావారు కోప్పడ్డారు. 'పెళ్ళికి వయసుకు సంబంధం లేదు. నా దగ్గర దండిగా డబ్బు ఉంది. ఈ ప్రపం చంలో పెళ్ళి కావాల్సిన ఆడపిల్లలు కోకొ ల్లలు. డబ్బు కోసమైనా నన్ను పెళ్లిచేసుకో వటానికి ముందుకు వస్తారు' అంటూ పేపర్లో ప్రకటన వేయించారు. ఒక్కరంటే ఒక్కరు రాలేదు. మావారికి కోపం నసాళా నికంటుతోంది. తనకు పెళ్ళి చెయ్యకపోతే ఆత్మహత్య చేసుకుని అందుక్కారణం మేమే నని పోలీసులకు ఉత్తరం రాస్తానంటాడు. ఓరోజు కిరసనాయిల్ గుమ్మరించుకు న్నాడు. మరోరోజు ఫ్యానుకు ఉరితాడు కట్టుకున్నాడు. మరో రోజు అర్ధరాత్రి లేచి వెళ్ళి రైలుపట్టాలపై తలపెట్టి పడుకు న్నాడు. ఇలా రకరకాలుగా బెదిరిస్తూ మమ్మల్ని చిత్రహింసలకు గురిచేస్తున్నాడు. ఈ సమస్య ఎవరితోనూ చెప్పుకోలేక, దిగ మింగలేక రోజూ చస్తూ బతుకుతున్నాము. మీరు ఎంతోమందికి పెళ్ళిళ్ళు చేశారని విన్నాను. ఈరోజుల్లో పెళ్ళి చేసే స్థోమత లేకనో మరే కారణాలవల్లనో అమ్మాయిలు చాలామంది ఉన్నారు. మీ ఎరికలో అలాం టమ్మాయి ఉంటే మా మామగారికి వధు వును చూసిపెట్టండి" అంది కన్నీళ్ళతో చేతులు జోడిస్తూ కల్పన.

కొత్త మిలీనియంలోకి అడుగుపెట్టినా, స్త్రీ అన్నిరంగాల్లో ముందంజ వేసినా, అంతరి క్షంలోకి అడుగుపెట్టినా, కుటుంబవ్యవస్థలో మాత్రం మార్పు రావటంలేదు. తల్లిగా, కూతురిగా, చెల్లిగా, భార్యగా, కోడలిగా... ఎప్పుడూ ఏవో సమస్యలు గొంగళిపురు గుల్లా, ఆడవాళ్ళ మెదళ్లను తొలుస్తూనే ఉన్నాయి.

అందరూ నిశ్శబ్దంగా ఆలోచిస్తూండిపో యారు. నిశ్శబ్దాన్ని ఛేదిస్తూ కల్పన "మా మామగారికి వధువు దొరకదంటారా? " అంది.

"దొరికితే పెళ్ళి చేద్దామని మీరనుకున్నా, ఈ వయసతనికి వధువును వెతికి పెళ్ళిచే యటం లాంటి తెలివితక్కువ పని మేం

చెయ్యం" అంది విజయ విసురుగా.

"మీ మామగారికి మా తరఫున పెళ్ళి చేస్తే మా ఆఫీసుచుట్టూ కాటికి కాళ్ళు చాపుకున్న వాళ్ళు క్యూ కడతారు" రమ అంది.

"రోజురోజుకీ మగాళ్ళు మరీ రెచ్చిపోతున్నారు. డబ్బయి సంవత్సరాల ముసలాడికి నవవధువు కావాల్సొచ్చింది... ఛీ...ఛీ" ఛీత్కరించింది సుశీల.

"అయితే మా సమస్యకు పరిష్కారం లేదా? ఆ ముసలాడితో దినదిన గండంగా గడపాల్సిందేనా? " ఆవేదనగా అంది కల్పన.

"ఎంతసేపూ మీరు మీవైపునించి మాత్రమే ఆలోచిస్తున్నారే తప్ప, ఆ ముసలివాణ్ని పెళ్ళి చేసుకునే అమ్మాయి గురించి ఆలోచిస్తున్నారా? మీరన్నట్లు పెళ్ళిళ్ళు కావటం దుర్భరంగా మారిన ఈ రోజుల్లో పెళ్ళయితే చాలన్నట్టు ఎవరైనా అమ్మాయి మీ మామను పెళ్ళిచేసుకోటానికి ముందుకు రావచ్చు. అలాగని చూస్తూచూస్తూ మేమిలాంటి పెళ్ళిళ్ళు చేయలేము. కాకపోతే ఫ్రెండ్లీగా మీ సమస్యను పరిష్కరించటానికి మా శాయశక్తులా ప్రయత్నిస్తాము. సక్సెస్ కావచ్చు కాకపోనూవచ్చు. మీరోసారి మీ మామగారిని ఇక్కడికి పంపించండి" అంటూ నచ్చచెప్పే ధోరణిలో చెప్పి కల్పనను పంపించేసింది రాజి.

నిరుత్సాహంగా వెళ్ళిపోయింది కల్పన! ఆ మరుసటిరోజు కల్పన మామగారు విశ్వనాథరావు వచ్చాడు. తననుతాను పరిచయం చేసుకున్నాడు. స్టాఫంతా అతన్ని నఖశిఖపర్యంతం చూశారు. మీసాలకు రంగేసుకున్నాడు. సఫారిడ్రస్ వేసుకున్నాడు. వంగిపోతున్న నడుముని హ్యాండ్‌స్టిక్ సహాయంతో నిలబెట్టుకోవటానికి వంకర్లు పోతూ వ్యర్థప్రయత్నాలు చేస్తున్నాడు. బోర్లించిన గోదావరి పాత్రలా తలమీద ఉన్న నాలుగు వెంట్రుకలకు రంగేశాడేమో గుండు మీద ఆ రంగు తాలూకు మరకలు కనిపిస్తున్నాయి. యువకుడిలా కన్పించాలన్న ఆయన తాపత్రయం చూస్తుంటే అందరికీ నవ్వొచ్చింది.

రాజేశ్వరి ఆయనతో ఏదో మాట్లాడబోయింది "నువ్వుండు నేనీయనతో కాసేపు ఆడుకుంటాను" అంటూ రాజేశ్వరికి మాత్రమే వినిపించేలా అంది విజయ.

"తప్పు పెద్దాయన" అని ఇంకా ఏదో అనబోతుండగానే విజయ రాజీని పట్టించుకోకుండా "మీరేనా కల్పన మామగారు. ఎంత ఆశ్చర్యం! కల్పన అన్నగారంటే నమ్మేలా ఉన్నారు సుమా" కోపాన్ని పళ్ళ బిగువున దాచుకుని ముఖాన నవ్వు పులుముకుని అంది విజయ. ముసిముసి నవ్వులు నవ్వుతూ మీసాలోసారి దువ్వుకుని గుండు మీదున్న నాలుగువెంట్రుకలను చేత్తో సరిచేసుకుని, రుమాలుతో మొహం తుడుచుకుంటూ కుర్చీలో కూర్చున్నాడు విశ్వనాథరావు.

"మీకోసం వధువు గురించి ఎంక్వయిరీ చేశాం సార్. కానీ ఈ కాలం అమ్మాయిలు మరీ తెలివిమీరిపోతున్నారు" అంది విజయ.

"ఏం! ఏం జరిగింది? ఏం కావాలిట? ఆస్తిరాసివ్వమంటున్నారా? " ఆత్రుతగా ముందుకు వంగి అడిగాడు వణికే ముసలి గొంతుతో!

"వెధవాస్తి ఎవడిక్కావాలి? నలుగురిలోకెళితే స్టేటస్ గురించి ఆలోచిస్తారు అమ్మాయిలు. అమ్మాయిల ప్రశ్నలూ జవాబులూ భర్తల ఉద్యోగాల గురించే కదా! ఫలానా ఉద్యోగస్థుడి భార్య అనిపించుకోవటంలోనే ఆనందం ఉంది అని ఆమధ్య అదేదో టి.వి. ఛానల్ వాళ్ళు అమ్మాయిలతో జరిపిన ఇంటర్వ్యూలో తేలిందట.

డబ్బయిఏళ్ళ ముసలాడికి పెళ్ళాంగా రావటానికి ఇష్టపడ్డారు కానీ మీకు ఉద్యోగం ఉండాలిట. కులం చెడినా సుఖం దక్కాలిట" వత్తివత్తిపలుకుతూ నిదానంగా చెప్పింది విజయ.

"అయితే నేనిప్పుడేం చెయ్యాలి? " ఆవేశంగా అడిగాడు విశ్వనాథరావు.

"జగదేకవీరుడిలా ఆ ఊపు చూడు. పడుచు పెళ్ళాం వస్తుందంటే ఏమైనా చేసేట్టున్నాడు ముసలి నక్క" రమ గొణిగింది.

"మీకేదైనా ఉద్యోగం ఉంటే బావుంటుంది. వధువు ఈజీగా దొరుకుతుంది" అంది విజయ నవ్వుతూ.

"ఏంటమ్మాయ్! వేళాకోళంగా ఉందా ఈ వయసులో నాకుద్యోగం ఎవరిస్తారు? " కోపంగా అన్నాడాయన.

"అదేమిటి? ఉద్యోగానికి ఏజ్ బార్ అయిపోయిందా? "

"అవును!" ఆ మాత్రం తెలీదా అన్న భావం ధ్వనించింది ఆ గొంతులో.

"అయితే పెళ్ళికి ఏజ్ బార్ కాలేదన్న మాట. ఈ వయసులో నాకుద్యోగం ఎవరిస్తారని అనుకున్నట్టే... ఈ వయసులో నాకు అమ్మాయి నెవరిస్తారని అనుకోవచ్చుగా" అంది విజయ.

"మగాడిని! నాకు పెళ్ళికి ఏజ్ బార్ ఏమిటి? ఈ దేశంలో పెళ్ళిళ్ళు కాక ఏడుస్తున్న అమ్మాయిలు లెక్కలేనంత మంది ఉన్నారు. ఎవరో ఒకరు దొరక్కపోరు" కోపంగా అన్నాడాయన.

"ఎంత పొగరో చూడు!" సుశీల మెల్లిగా గొణిగింది.

"సరే! సరే! ఈ వయసులో మీకు గవర్నమెంటుద్యోగం ఎలాగూ రాదు. చిన్నదో చితకదో ప్రయివేటుద్యోగం... అంటే... ఏదైనా మంచి హోటల్‌లో రిసెప్షనిస్టుగానో, మేనేజర్‌గానో, క్యాషియర్‌గానో... అలాంటి ఉద్యోగం మీకు తప్పకుండా దొరుకుతుంది. ఓ యాభైవేలు లంచం పారేస్తే ఉద్యోగం మీకాళ్ళ దగ్గరుంటుంది. అపుడు అమ్మాయిలు కూడా మిమ్మల్ని పెళ్ళిచేసుకోటానికి ముందుకువస్తారు. మీరు ఎవరో ఒకరికి దండవేయొచ్చు ఏమంటారు? " అంది విజయ.

"అలాంటి ఉద్యోగం దొరుకుతుందంటావా? చూద్దాం!" అంటూ లేచాడు.

"బెస్టాఫ్‌లక్" అన్నారంతా.

అప్పుడే యస్.ఐ. గోవర్ధని లోపలికొస్తూ ఎదురుపడ్డ ముసలాయన్ని చూసి "ఏం తాతా! ఇలా వచ్చావు? మనవడికా? మన వరాలికా? పెళ్ళి సంబంధం? " అంటూ పలకరించింది నవ్వుతూ!

ఆమె ప్రశ్నకు జవాబు చెప్పకపోగా ముఖం చిట్లిస్తూ "ఈవిడెవరు? " అన్నాడు ముసలాయన.

"అదేమిటండీ! మీకు చూపు సరిగా ఆనదులాగుందే! డ్రస్సు చూస్తే తెలీటంలేదా? యస్.ఐ. ఈమధ్య ఆడాళ్ళ కేసులెక్కువయ్యాయికదండీ! అత్తగారు కోడలిని చంపటం, భర్త భార్యను చంపటం, మామగారు కోడలితో పెళ్ళిచెయ్యమని వేధించటం లాంటివన్న మాట. అలాంటి నిందితులను ఉతికి ఆరేసే ఉద్యోగమన్నమాట. సరేలెండి అనవసరంగా మీ బుర్ర పాడుచేసినట్టున్నాను. వెళ్ళిరండి!" అంది విజయ నాటకీయంగా మాట్లాడుతూ!

అందరివైపు అనుమానంగా ఓసారి చూసి వెళ్ళిపోయాడాయన.

నెలరోజుల్లోనే "మా మామగారు వృద్ధాశ్రమంలో చేరిపోయారం"టూ పాణిగ్రహణం స్టాఫందరికీ స్వీట్లు పంచింది కల్పన.

★ ★ ★

"ఈరోజు కూరేం చేశావు విజ్జీ!"

"ఇదిగో ఇలా చూడండి శుభ్రంగా విజయ అని పిలవండి. విజ్జీ బజ్జీ అని పిలిస్తే నాకు అలర్జీ" కోపంగా అంది విజయ.

"అలాగేనండి విజయగారూ. ఈ పూట వంటేంచేశారో సెలవిస్తారా? "

"కూరేం చెయ్యలేదు! ఆవకాయ, పెరుగుతో ముగించండి" విసుగ్గా అంది.

"అయ్యబాబోయ్! ఈరోజు అమ్మగారి

మూడ్ బాగున్నట్టు లేదు. పక్కింట్లో కెళితే బెటరు."

"ఏమిట్రా! పక్కింట్లో కెళితే బెటరనుకుంటున్నావు. దేనికోసం? ఆ! ఏంటమ్మా విజయా... బావున్నావా? ఈ సీజన్‌లో ఎన్ని పెళ్ళిళ్ళు చేశారు? ఏమిటి విశేషాలు? " అంటూ చందూ తండ్రి నారాయణరావుగారు వచ్చారు.

"రండి మామయ్యా! ఇలా కూర్చోండి! అత్తయ్యను తీసుకురాలేకపోయారా? ఒకే ఊళ్ళో ఉంటూ మీరు మా దగ్గరలేకుండా, ఇలా వేరువేరుగా ఉండటం నాకు చాలా బాధగా ఉంది" అంది విజయ.

"అమ్మో! అందరం ఒకేచోట ఉంటే నీ మొగుడితో నాకు చాలా ప్రాబ్లమ్స్ వస్తాయమ్మా. పెళ్ళాం పిల్లల్ని మా కొదిలేసి బలాదూరు తిరుగుతాడు. వీడితో నేను చాలా కష్టాలుపడ్డానమ్మా. సంసారమూ, బాధ్యతలూ తెలియాలంటే మీరు మాకు దూరంగా ఉంటే మంచిదని... అన్నీ ఆలోచించే ఈ నిర్ణయం తీసుకున్నాను" అన్నారు నారాయణరావుగారు.

"ఏమిటీ? మీరు నాతో కష్టాలుపడ్డారా? ఇంట్లో ఉంచుకోకుండా మమ్మల్ని వేరుగా పెట్టింది చాలక పనిగట్టుకుని వచ్చి నా భార్యకు నామీద చాడీలు చెబుతున్నారా? " చందూ కోపంగా ఎగిరాడు.

"ఏమిట్రా చందూ! అంత కోపం! నీమీద చాడీలు నేనెందుకు చెబుతాను. పిచ్చి సన్నాసి! వీడెప్పుడూ ఇంతేనమ్మా! ఆవేశం ఎక్కువ! ఆలోచన తక్కువ! అలా అని ఆలోచన పూర్తిగా తక్కువ కాదనుకో! చందూ చిన్నప్పుడు కథలు రాసేవాడమ్మా! నీకు చెప్పలేదా? " అన్నారు టాపిక్ మళ్లిస్తూ.

"అలాగా! మామయ్యా! నాకు తెలీదుసుమండీ! చిన్నప్పుడంటే చాలా చిన్నప్పుడా? " చందూవైపు నవ్వుతూ చూస్తూ అడిగింది.

"చిన్నప్పుడంటే మరీ నిక్కర్ల వయసులో కాదమ్మాయ్! జ్ఞానదంతం వచ్చాకే రాశాడు. దాదాపు అయిదారు మేగజైన్లలో వీడి ఫోటో, పేరు కూడా పడ్డాయి"

"ఏమిటీ! పేరూ, ఫోటో పుస్తకాల్లో పడ్డాయా? అదేమిటండీ మీరు ఒక్కసారి కూడా ఆ ప్రస్థావన తీసుకురాలేదు!"

"ఆయనలా చాదస్తం మాటలు మాట్లాడుతుంటాడు. నువ్విక్కడినించి కదిలి నీ పని చూసుకో!" కోపంగా అన్నాడు చందూ.

"వాడికి పొగడ్తలు ఇష్టం ఉండవమ్మా!"

"అదేమిటండీ! ఆయన మిమ్మల్ని గురించి పొగుడుతూ ఊరి నడిబొడ్డున నిలబడి టముకేస్తున్నారా? మీ భార్యనయిన, నాతోనే కదా చెబుతూంట" అంది విజయ.

"గొప్పగొప్ప వాళ్ళంతా ఇలాగే ప్రవర్తిస్తుంటార్లేమ్మా. నువ్వేం పట్టించుకోకు"

"ఇంతకీ ఆయన రాసిన కథలేంటి? ఏయే మేగజైన్స్‌లో పడ్డాయో చెప్పండి" అంది ఆత్రంగా విజయ ఒకవైపు భర్తవైపు ప్రేమగా చూస్తూ! తనెంత పొరబడింది. ఏదో జులాయిగా తిరుగుతూ తనతో స్నేహంచేసి... ఇప్పుడిలా బాగుపడి సంపాదిస్తూ, తనను పెళ్ళిచేసుకుని బుద్ధిమంతుడయ్యాడనుకుంది తప్ప... తనతో స్నేహం కాకముందే అతనో రచయిత అనీ అతనిలో ఇంత 'టాలెంటు' దాగి ఉందని మామగారు, చెప్పేవరకూ తెలియలేదు. తనెంత పొరబడింది. అయితే తను ఓ రచయితకు భార్య... ఆ ఊహ ఎంతందంగా ఉంది. భర్తవైపు పదేపదే ఆరాధనగా ఆర్తిగా చూస్తోంది. అప్పుడక్కడ నారాయణరావుగారు లేకుంటే భర్తను వాటేసుకోవాలన్నంత ఉత్సుకతతో ఉంది విజయ.

చందూ పరిస్థితి నిప్పులమీద కూర్చున్నట్టుంది. "నాన్నా! అసలు నువ్వు నా తండ్రివేనా? నా బతుకేదో నేను బతుకుతున్నాను. హాయిగా కాపురం చేసుకుంటుంటే నా కాపురంలో నిప్పు రగల్చటానికి వచ్చావు కదూ! నేను నీకేం ద్రోహం చేశాను" అని

అందామనుకున్న మాటలన్నీ తండ్రివైపు చూస్తూ కళ్లతోనే చెప్పాడు.

"ఆ! అసలు సంగతిలోకొస్తాను. ఎక్కడ ఆగాను. ఆ... చాలా మేగజైన్స్‌లో వీడి పేరు, ఫోటో కూడా పడ్డాయని చెప్పాను కదూ!"

"మామయ్యా! అసలు చందూని... మీ అబ్బాయిని రచయిత అంటే ఎవరూ నమ్మరు కదూ. చూస్తే అలా అనిపించడు కదూ!"

"అవునమ్మా! నీ వన్నట్టే చాలా మంది వీడితోనూ అన్నార్ట. ఆ విషయం గురించి కూడా ఇంట్లో వాళ్ళమ్మ దగ్గర 'డాక్టర్లకు లాయర్లకు, పోలీసువారికి, నేవీ, ఆర్మీవగైరా వగైరా వారికున్నట్టు రైటర్సుకు కూడా యూనిఫాం ఉంటే ఎంత బాగుండేది. చూడగానే రైటరని ఇట్టే తెలిసిపోయి గౌరవించే వాళ్ళు. ప్రతి వాళ్ళకు నా పేరు, నా కథ ఫలానా పుస్తకంలో అచ్చయింది, నేను రైటర్ని అని చెప్పుకునే బాధ లేకపోవును' అంటూ వాపోయేవాడు. దానికి వాళ్ళమ్మ... కడుపు తీపి... కదా... అవును ఈ 'పాయింటు'ను అసెంబ్లీలో పెడితే బాగుంటుందని ఉర్రూతలూగింది. అసెంబ్లీలో వాళ్ళ సమస్యలే పరిష్కారం కాక రోజుకు వంద మైకులు విరగ్గొట్టి చొక్కాలు చింపుకుంటున్నారు. మళ్ళీ మీ తల్లీ కొడుకుల గొడవేమిటని కసిరితే ఊరుకున్నారు. లేకుంటే ఈ పాటికి ఏమయ్యుండేదో" అన్నారు నారాయణరావు.

"నాన్నా! నీకింకేం పనిలేదా? ఇంటి దగ్గర అమ్మ ఎదురుచూస్తుంటుంది వెళ్ళు!" అన్నాడు చందూ కోపంగా... అసహనంగా!

"అదేమిట్రా అలా కసిరించి మాట్లాడతావు. చిన్నిక్రిష్ణుడి లీలలు వర్ణించినట్టు... నీ చిన్ననాటి సంగతులు అమ్మాయికి చెబుతుంటే అంత కోపమెందుకు?" ముద్దుగా కోప్పడ్డాడు చందూని.

"ఆయన్నలా వదిలెయ్యండి మామయ్యా! మీరు చెప్పండి ఆయన కథలు, పేరు, ఫోటో ఏ మేగజైన్‌లో అచ్చయింది, ఎందుకు అన్నీ వివరంగా చెప్పండి" అంది విజయ ఆత్రంగా.

"కథలంటే మీ ఆయన రాసినవి కాదమ్మా! మిగతా రచయితలు రాసిన కథలు బాగున్నాయంటూ మేగజైన్స్‌లో బోలెడు ఉత్తరాలు రాశాడు. అవి అచ్చయ్యాయి. కలం స్నేహం అంటూ అన్ని మేగజైన్స్‌లో పేరు, ఫోటో, హాబీస్ అని వేస్తుంటారు చూశావా? అలా ఇతగాడి పేరు, ఫోటో అచ్చయిందన్నమాట. ఆమాత్రానికే "నేను రచయితను, నేను రచయితను" అంటూ రొమ్ము విరుచుకుని ఊరంతా చాటుకుని ఆ అచ్చయిన పేపరు కటింగ్‌లకు 'లామినేషన్' చేయించి మరీ పెట్టుకున్నాడు. అదమ్మా నీ మొగుడి రచయిత ప్రహసనం!" అంటూ ఓరకంట చందూని చూశాడు. చందూ భయపడుతూ విజయ హావభావాలు గమనిస్తూ వంకర్లు పోతున్నాడు. విజయ గుడ్లురుముతూ భర్త వైపు చూస్తోంది.

"పని పూర్తయింది. వస్తానమ్మా!" అంటూ చిద్విలాసంగా నవ్వుకుంటూ వెళ్ళిపోయారు నారాయణరావుగారు.

★ ★ ★

తలుపు టకటకమని శబ్దం చేయటంతో పాణిగ్రహణం స్టాఫంతా తలతిప్పి చూశారు. ఓ అందమైన... అప్సరసలాంటి ఇరవై ఏళ్ళ అమ్మాయి వాకిట్లో నిలుచుంది.

"లోపలికి రండి! కూర్చోండి" అంది రాజేశ్వరి.

ఆ అమ్మాయి లోపలికి వచ్చి రాజేశ్వరి ఎదురుగా కుర్చీలో కూర్చుంది. "చెప్పండి. మీ పేరేమిటి?" అంది రాజేశ్వరి ఆ అమ్మాయి అందాన్ని మనసులోనే మెచ్చుకుంటూ. ఆ అమ్మాయి భుజానికున్న వ్యానిటీబ్యాగ్ తీసి ఒళ్ళో పెట్టుకుని అందులోంచి

ఓ చిన్న లెటర్ ప్యాడ్‌లాంటి పుస్తకం, పెన్ను తీసి ఏదో రాసి రాజేశ్వరి చేతికిచ్చింది. రాజేశ్వరి అది చదివి ఆశ్చర్యంతో "ఏమిటీ, మీకు మాట్లాడ్డంరాదా? మూగవారా?" అని అడిగింది. వెంటనే "సారీ," అంది. ఫరవాలేదన్నట్టు సైగచేసిందా అమ్మాయి. స్టాఫంతా ఆశ్చర్యంగా ఆ అమ్మాయిని చూస్తూ అందరూ దగ్గరికి చేరారు. "ఇంత అందమైన అమ్మాయికి భగవంతుడు నోరివ్వలేదా?" "దేముడు నిజంగా గుడ్డివాడు" తలోరకంగా మనసులో అనుకున్నారు. అందరినీ ఆ అమ్మాయి కొంచెం బెరుగ్గా చూసింది. "ఫర్వాలేదు! అంతా మనవాళ్ళే భయపడకు అన్నట్టు సైగ చేసింది రాజి. ఆ అమ్మాయి రాజేశ్వరితో "నాకు దివ్యంగా వినిపిస్తుంది. మాట్లాడండి. సైగలు చెయ్యకండి" అన్నట్టు సైగచేసింది. ఆ అమ్మాయి పేరు వీణ. అయిదేళ్ళ వయసు వరకూ వీణ అన్నివిధాలా ఆరోగ్యంగా ఉంది. బాగా మాట్లాడేది కూడా. ఓ కారు యాక్సిడెంట్‌లో వీణ తల్లిదండ్రులిద్దరూ చనిపోయారు. వీణకు మాట పోయింది. మేనమామ పెంచి పెద్ద చేశాడు. వినికిడి శక్తి బాగా ఉంది కాబట్టి అందరిలా స్కూలుకు వెళ్ళి బాగా చదువుకుంది. డిగ్రీ పూర్తిచేసింది. పి.జి. చెయ్యాలనుకుంటున్న టైంలో మూర్తి పరిచయమయ్యాడు. వీణ మేనమామ ఫ్రెండు కొడుకు. చుట్టపుచూపుగా యింటికొచ్చిన మూర్తి వీణపట్ల ఆకర్షితుడయ్యాడు. వీణ కూడా ఆమెకు తెలియకుండానే మూర్తి ప్రేమలో పడింది. తాను మాట్లాడలేదని తెలిసి కూడా తనపట్ల ప్రేమను వ్యక్తం చేస్తున్న మూర్తిని గుడ్డిగా నమ్మి మోసపోయి తనను తాను అర్పించుకుంది. తల్లిదండ్రులను ఒప్పించి పెళ్ళి చేసుకుంటానని వీణతోను, వీణ మేనమామ, అత్త, అందరి ఎదుట వాగ్దానం చేసివెళ్ళాడు. వెళ్ళిన వారంరోజులకే మూర్తికి మరో అమ్మాయితో నిశ్చితార్థం అని తెలిసి వీణ గుండెలు బద్దలయ్యాయి. వీణ మేనమమామ ఉగ్రుడయ్యాడు. వీణను వెంటబెట్టుకుని వెళ్ళి నిశ్చితార్థం చెడగొట్టి కేకలేశాడు. 'ప్రేమించాను పెళ్ళి చేసుకుంటానని చెప్పి ఇంత మోసం చేస్తాడా నీ కొడుకు' అంటూ మూర్తి తండ్రిని దుయ్యబట్టాడు. మూర్తి, అతని తండ్రి వీణ మేనమామను కొట్టినంత పని చేసి గెంటేశారు. ఏడుస్తూ ఇల్లుచేరటం తప్ప చేసేదేంలేకపోయింది. కానీ వీణకు మూర్తి మాటలే గుర్తుకు వస్తున్నాయి. "మూగముండవి. నీతో నా పెళ్ళా? ఏదో అందంగా, అమాయకంగా ఉన్నావుకదాని రెండుమాటలు మాట్లాడితే నన్నే వల్లో వేసుకోవాలని చూస్తున్నావా? ఈ నిశ్చితార్థం చెడిపోతే నాకు పెళ్ళి కాదనుకుంటున్నావా? నాకేమిటి, నేను మగాడిని. కో అంటే కోటిమంది ఆడవాళ్ళు నా పాదాలదగ్గర వాలతారు. ముందు నీ బతుకు చూసుకో. అసలు నీకీ జన్మకు పెళ్ళవుతుందా? నువ్వు నోరు మూసుకుని నాతో మంచిగా ఉండి ఉంటే నా పెళ్ళయినా, నిన్ను ఉంపుడుగత్తెగా ఉంచుకుని ఇంత తిండి పడేసేవాడిని. ఇప్పుడు అది కూడా లేకుండా చేసుకుని రెంటికి చెడ్డ రేవడివయ్యావు. ఇక నీ జీవితానికి పెళ్ళిలేదు. మంచి సెంటరు చూసి బిజినెస్ ప్రారంభించు. మాట్లాడ్డం రాకున్నా ఎర్రగా బుర్రగా ఉన్నావుకదా. పొట్ట గడుపుకోవచ్చు" అంటూ వీణను బయటకు గెంటిన దృశ్యం, ఆ మాటలు మరిచిపోలేకపోతోంది. ఇపుడు వీణ పెళ్ళి చేసుకోవాలనుకుంటోంది. ఆమె కథంతా తెలుసుకుని అందరూ నిట్టూర్చారు.

జీవితమనే పెద్ద చక్రంలో యౌవనదశ చాలా సున్నితమైంది. ఆ దశలో ఎంత ఆచితూచి అడుగులు వేస్తున్నా కుప్పలుతెప్పలుగా సమస్యలు పుట్టుకు వస్తూనే వుంటున్నాయి. వీటి బారినపడి ఎంత

మంది అమ్మాయిల జీవితాలు అగాధాల లోకి జారుతున్నాయో!

"నా పెళ్ళి కాదనీ, నన్నెవరూ పెళ్ళి చేసు కోరని ఆ రాస్కెల్ ఛాలెంజ్ చేసి, చులక నగా మాట్లాడాడు. నేను పెళ్ళి చేసుకో వాలి" అంటూ రాసి చూపించింది వీణ.

"తప్పకుండా. నీకెలాంటి వరుడు కావాలి? " అడిగింది రాజేశ్వరి.

"ఎలాంటివాడయినా సరే, అంటే అందంతో పనిలేదు. మంచి మనసుంటే చాలు. ఇంకో విషయం, నా గతంగురించి అతనికి తెలియాలి. విశాల హృదయంతో నన్ను పెళ్ళాడాలి. అంతటి ఆదర్శపురుషులు ఈరోజుల్లో ఎవరుంటారా? అని ఆలోచిస్తు న్నారా? ఉంటే ఉండచ్చు లేకపోనూవచ్చు ప్రయత్నం చేయటంలో తప్పులేదుకదా. నాకోసం మీరు వెతికే వరుడు రెండో పెళ్ళి వాడై ఉంటే మంచిదని నా అభిప్రాయం"

"రెండో పెళ్ళివాడా? అలాంటివాడిని కోరుకోవడంలో మీ ఉద్దేశ్యం? " అడిగింది విజయ.

"పెద్దగా ఉద్దేశ్యం అంటూ ఏంలేదు. మొదటి భార్యతో ఏవో కారణాలవల్ల విడి పోయి ఒంటరితనం అనుభవించి అనం తరం రెండో భార్యను చేపట్టే మగాడి మనసు విసిగిపోయి ఉంటుంది. రెండోభా ర్యలో సుగుణాలకోసం, గొప్పతనంకోసం ఆరాటపడడు. సర్దుకుపోగలడు. ఇకపోతే ఆడవాళ్ళ విషయమూ ఇంచుమించు అంతే. ఓసారి వేటగాడివల్ల గాయపడిన మనసుకు మందు రాసి ఆదరించి సేదదీ ర్చిన వ్యక్తిని ఆడదెప్పుడూ గౌరవించి, ఆరా ధిస్తుందే తప్ప చులకనగా చూడదు. కాబట్టి అలాంటివారి కాపురం పూర్తిగా సక్సెస్ అవు తుందని నా నమ్మకం. ఏమిటంత విస్మ యంగా చూస్తున్నారు. ఇంత పెద్ద మాటలు ఎలా వస్తున్నాయి అనుకుంటు న్నారు అవునా? నా జీవితంలో జరిగింది ఒకే ఒక పీడకలలాంటి సంఘటన. ఆ ఒక్క సంఘటనతో ఎన్నో జీవితాలను చది విన అనుభవమైంది" అంటూ ముగించింది వీణ.

"మీకు తప్పకుండా మంచి వరుడు దొరు కుతాడు. మా ప్రయత్నం ఈరోజునుంచే మొదలుపెడతాం" అంది రాజేశ్వరి. చేతులు జోడించి నమస్కరించి సెలవు తీసుకుంది వీణ.

"ఈ అమ్మాయి అందాన్ని చూసి వరుడు దొరికినా... కథ మళ్ళీ మొదటికొచ్చి బాధలు పడుతుందేమోనని నా అను మానం" సుశీల అంది.

"ఎప్పటికీ అలా జరగదు. ఆ అమ్మాయి ఆత్మవిశ్వాసమే ఆమెకు అండగా నిలు స్తుంది. ప్రస్తుతం ఒక మగవాడివల్ల మోస పోయినా ఆమె కుంగిపోయి ఏ ఆత్మహ త్యకో పాల్పడలేదు. తన జీవితాన్ని తనకిష్ట మైన పద్ధతిలో నిర్దేశించుకుని అడుగుముం దుకేస్తోంది. అపజయం ఆమె దగ్గరకి రాదు" అంది రాజేశ్వరి దృఢంగా.



"రేయ్! మురళీ, మురళీ... ఇలారా" చందూ కేకలేశాడు. తలుపులు దబదబా బాదాడు.

"ఏమిట్రా, ఆ హడావిడి. ఆ తలుపులు

అంతగా బాదుతావేంటి. నీకస్సలు మేనర్సు తెలీదు. ఏదో ఫ్రెండ్స్‌మి కదా. అందరం ఒకేసారి పెళ్ళిళ్ళు చేసుకున్నాం. ఇళ్ళన్నీ ఒకేచోట ఉంటే బావుంటుందని పక్కపక్క ఇళ్ళల్లో అద్దెకుందామని నిర్ణయించుకుంటే... ఇలా ఎప్పుడు పడితే అప్పుడు వేళకానివేళ... తలుపులు బాది మరీ డిస్టర్బ్ చేస్తావుట్రా... దుర్మార్గుడా? దుష్టుడా... ఇంతకీ ఏం కావాలి నీకు? చేతిలో ఆ బొచ్చేవిటి? అడుక్కుతినే వాడిలా" అన్నాడు మురళి కోపంగా.

వెనకే రాజేశ్వరి కూడా వచ్చింది. మురళికి సమాధానం చెప్పకుండా రాజేశ్వరి దగ్గరకొచ్చి, "రాజీ కాస్త కూర ఉంటే వెయ్యవా? ఆకలేస్తోంది. విజయ ఈ రోజు చిర్రుబుర్రులాడుతోంది. అన్నం మాత్రం వండింది. కూర సంగతి అడగడానిక్కూడా భయంగా ఉంది" అన్నాడు చందూ దీనంగా మొహం పెట్టి.

"అలాగా, ఇక్కడే భోం చేస్తావా? " అంది రాజి.

"వద్దులే, కూర ఇవ్వుచాలు. ఇంటికెళ్ళి విజయ, నేను తినేస్తాం"

"అబ్బ, అబ్బ, ఏం డ్రామాలాడతావురా? ఇదంతా పెళ్ళాంమీది ప్రేమే? ఇంతకీ విజయకెందుకు కోపమొచ్చిందట. మీ నాన్న మళ్ళీ ఏదైనా బాంబు పేల్చాడా? " అన్నాడు మురళి.

"అవున్రా, మా నాన్నను చూస్తుంటే యమధర్మరాజును చూసినంత భయంగా ఉంది. అన్నెం పున్నెం ఎరుగని విజయ మనసు కల్లోలం చేసిపోతున్నాడు. వచ్చినపుడంతా నా గతమంతా తోడి ఆమె ముందుంచుతాడు. నన్ను ఏడిపిస్తున్నాడు"

"మంచిపని జరుగుతోంది. ఆయన్ని నువ్వు ఏడిపించి ఏడు చెరువుల నీళ్ళు తాగించావుకదా. ప్రతీకార చర్య. బాగా కక్ష తీర్చుకుంటున్నాడు" అంది రాజేశ్వరి.

"నన్ను చూస్తే మీకందరికీ ఆడుకోవాలని పిస్తుంది. నాకూ మంచిరోజులొస్తాయి. అప్పుడు చెబుతా మీ అందరిపని. నా సంగతలా ఉంచు. ఇంతకీ విజయకంత కోపమొచ్చే 'సీను' ఏం జరిగింది మీ ఆఫీసులో" అడిగాడు చందూ రాజీని.

"ఆవిడగారికి కోపమొచ్చినా పట్టలేం. సంతోషమొచ్చినా పట్టలేం. ఈరోజు ఇద్దరు కస్టమర్సు మా మెదడును తినివెళ్ళారు. అలాంటివెన్ని జరిగినా మేమంతా అప్పుడే మరిచిపోతాం. కానీ ఈవిడగారు మాత్రం ఆ ప్రభావం నుంచి అంత తొందరగా బయటపడదు. అందుకే ఇంట్లో నీ మీద గంతులేస్తుంటుంది" అంది రాజేశ్వరి.

"ఇంతకీ ఆ కస్టమర్సు ఎవరు? ఏమిటా కథా కమామీషు? " నాటకీయంగా అడిగాడు మురళి.

"ఈరోజు పాణిగ్రహణం ఆఫీస్‌కి ఉదయం పదిగంటల సమయంలో ఓ యువకుడు వచ్చాడు. అతనికి 26, 27 ఏళ్ళుంటాయి. అంతో ఇంతో అందంగానే ఉన్నాడు. అతను రాగానే 'నేను మీతో కాస్త ఏకాంతంగా మాట్లాడాలి' అన్నాడు"

"ఎవరితో? విజయతోనా? " కోపంగా అడిగాడు చందూ.

"అబ్బ! కాదు చందూ! నాతో! ఏమిటంత కోపం? ఆరునెలలు సావాసం చేస్తే వారు వీరవుతారన్నట్టు... విజయకోపం... ఆవేశం... నీక్కూడా వచ్చేశాయి"

"సరి, సరి... తర్వాత..."

"ఇక్కడ ఏకాంతం... దోకాంతం లేదు. సమస్య అందరిముందూ చెప్పాల్సిందే..." అంది కటువుగా విజయ.

"సరే, ఆడాళ్ళుకదా. సిగ్గుపడతారేమో. ఒక్కరితోనే చెబుదామనుకున్నా. మీరు వినటానికి సిద్ధపడ్డప్పుడు చెప్పటానికి నాకేం సిగ్గు. ఆ సరే, అసలు విషయానికొస్తాను. నాకు చాలా ఆస్తి ఉంది. ఉద్యోగం చెయ్యాల్సిన అవసరంలేదు కూర్చునితిన్నా మూడు తరాలకు తరగని ఆస్తి. నేను ఒక్కడ్నే

సంతానం. ఇకపోతే నాకు పెళ్ళీడొచ్చింది కాబట్టి పెళ్ళి చేసుకోవాలనుకున్నాను. చాలా మంది అమ్మాయిలను చూశాను. కానీ నాకు ఎవరూ నచ్చలేదు"

"అంటే... మీ అంతస్థుకు తగినవారు దొరకలేదా?" అడిగాను.

"అంతస్థును గురించి నేనసలు ఆలోచించడంలేదు. పేద అమ్మాయి అయినా ఫర్వాలేదు. కానీ నా అభిరుచికి తగిన అమ్మాయి... నేననుకున్న లక్షణాలు కలిగిన అమ్మాయి దొరకలేదు"

"లక్షణాలంటే?" విజయ అడిగింది.

"నేనీమధ్య కామశాస్త్రంలాంటి కొన్ని సెక్స్ పుస్తకాలు చదివాను. అందులో పద్మినీజాతి స్త్రీని పెళ్ళాడితే ఉత్తమోత్తమంగా ఉంటుందిట. పద్మినీ జాతి స్త్రీకి శంఖంలాంటి మెడ, మంచి ఒంపుసొంపులు, మంచిరంగు ఉంటాయట. ఇవన్నీ మనం చూడగానే తెలుసుకోవచ్చు పద్మినీజాతి స్త్రీలకు శరీరం మీద కొన్నికొన్నిచోట్ల పుట్టుమచ్చలుంటాయిట. అవి కనుక్కోవడం కష్టంకదా. మీరంతా స్త్రీలు. పెళ్ళిళ్ళు కుదురుస్తున్నారు కాబట్టి మీరు అలాటి అమ్మాయిని వెతికిపెట్టాలి. అన్నట్టు ఆ అమ్మాయిది కన్యారాశి అయి ఉండాలి. అలాంటమ్మాయికోసం వెతికివేసారిపోయాను. లక్షణాలుంటే రాశి ఉండదు. రాశి ఉంటే లక్షణాలుండవు. ఇదీ నా సమస్య. మీరు నాకు ఖచ్చితంగా అలాంటమ్మాయిని వెతికిపెట్టాలి" అన్నాడతను ఆర్డరు జారీచేస్తున్నట్టు.

"అతను అంటున్నావు. పేరులేదా అతగాడికి?" మురళి అడిగాడు.

"ఆహా! ఎందుకులేదు. తల్లిదండ్రులు బుద్ధిగా ఉంటాడని సిద్ధార్థ అని పెట్టారు. కానీ ఇతను కామశాస్త్రాన్ని ఔపోశన పట్టాడుకదా. మన్మథరావని పేరు మార్చుకున్నాడట" అంది రాజి.

"తర్వాతేం జరిగింది?" చందూ అడిగాడు.

"ఏం జరుగుతుంది? తమ పట్టపురాణిగా రికి ముక్కుమీద కోపంకదా! 'అలాంటమ్మాయే కావాలంటే దొరకదు. పాణిగ్రహణంలో ఎక్కువగా ప్రేమవివాహాలు, ఆదర్శ వివాహాలు మాత్రమే జరుగుతాయి. ఇలా జాతకాలు, రాశులు, లక్షణాలు, గుడ్డూ అంటే వీలుకాదు. వెళ్ళి రండి' అంటూ నిష్కర్షగా చెప్పింది.

"విజయ అలా ఖచ్చితంగా మాట్లాడేసరికి అతగాడికి బాగా కోపం వచ్చింది. 'మీ స్టాఫ్‌లో ఎవరికైనా నేను చెప్పిన లక్షణాలుంటే చెప్పండి. పెళ్ళయిన వారయినా ఫర్వాలేదు. అడ్జస్టవుతాను' అన్నాడు పొగరుగా. దాంతో అందరికీ కోపం వచ్చింది. మెడబట్టి గెంటినంత పని చేశాం. వాడు నోటికొచ్చినట్టు పేలడం, మేం పోలీస్ కంప్లయింట్ యివ్వడం, గోవర్ధని రావటం, అబ్బో... పెద్ద తతంగం జరిగింది. విజయ సంగతి సరేసరి. 'చెత్తవెధవ... చెత్త వెధవాని... కామశాస్త్రంట. వాడి బొందట... చెత్తపుస్తకాలన్నీ చదివి ప్రయోగం చెయ్యటానికొచ్చాడు' అంటూ ఒకటే అరుపులు. బి.పి. పెంచుకుంది. ఓ గంటా రెండుగంటల వరకూ అందరికీ మూడ్ ఛేంజ్ కాలేదు. మళ్ళీ సాయంత్రం ఇంకో అతను వచ్చాడు"

"అతనూ ఇలాంటివాడేనా?" చందూ ప్రశ్నించాడు.

"కాదు. ఇతను వేరే టైపుమనిషి. పేరు మాధవరావుట. వయసు దాదాపు నలభై ఉంటుంది. ఖద్దరు బట్టలేసుకుని నామినేషను వేయటానికి వెళ్ళే రాజకీయనాయకునిలా వచ్చాడు. ఓ పేపరు ప్రకటన పట్టుకుని వచ్చాడు. అది పాణిగ్రహణం తరపున ఇచ్చిన ప్రకటన. ఓ సంపన్నురాలైన యువతికి అన్ని అర్హతలున్న వరుడు కావాలని ఇచ్చాం. ఆ సంపన్నురాలైన యువతికి నేను మొగుడినవుతానంటూ వచ్చాడతను. ఇది కూడా ఉదయం కేసులాగుంది అన్నట్టు

మొహం పెట్టాను నేను విజయవైపు చూస్తూ. 'నువ్వు తప్పుకో. నేను చూసుకుంటా'నన్నట్టు విజయ ముందుకొచ్చింది. విజయ అయితేనే ఈ కేసు బాగా డీల్ చెయ్యగలదు అనుకుని ఇవతలకొచ్చేశాను.

'మీరేం ఉద్యోగం చేస్తున్నారు? ఇంత వయసొచ్చినా పెళ్ళెందుకు చేసుకోలేదు' అని విజయ అడిగింది.

"నేను జాతకాలను బాగా నమ్ముతాను. మనుషులు చెప్పే జాతకాలకంటే రామచిలుక జోస్యం నేను నమ్ముతాను. నా జీవితంలో ఆ జోస్యం చాలాసార్లు ఫలించింది కూడా. చిలుకజోస్యం ప్రకారం నా జాతకంలో ముందు పెళ్ళి, తర్వాత ఉద్యోగం అని రాసుందిట. అందుకే ఉద్యోగంకంటే ముందు పెళ్ళి చేసుకోవాలనుకున్నాను. కానీ పెళ్ళి కుదరటంలేదు"

"అదిసరే, మరి బతుకుతెరువెలా? "

"మా నాన్నగారు పంచి ఇచ్చిన నా వాటా ఆస్తి అమ్మి తింటున్నాను"

"వెరీగుడ్, మరి ఉద్యోగానికి ఏజ్ బార్ అయిపోయింది కదా"

"అయితే అయింది. వెధవ ఉద్యోగం ఎవడిక్కావాలి? ఓ సంపన్నురాలికి భర్తగా ఉండటంమాత్రం ఉద్యోగం కాదా ఏమిటి? "

అతని సమాధానం విని అందరం స్టన్నయ్యాం.

"ఆహా... ఎవరు కాదన్నారు. ఆ యువతి మీ భార్య కావటానికి అర్హత ఆమె సంపన్నురాలు కావటం. సరే బాగుంది. మరి మీరు ఆమెకు భర్త కావటానికి ఏదైనా అర్హతంటూ ఉండాలి కదా" అడిగింది విజయ.

"భర్త కావటానికి వేరే అర్హతేముంది. మగాడైతేచాలు. మొగుళ్ళు దొరకక ఆడాళ్ళు ఛస్తున్నారు. అంత సంపన్నురాలయి ఉండి కూడా మొగుడు దొరకక పేపర్లో నాకు మొగుడుకావాలంటూ ప్రకటన ఇచ్చుకుంది కదా. తెలిసిపోవటంలేదా? ఆడాళ్ళ పరిస్థితి ఏమిటో" అన్నాడు అవహేళనగా. అతని వెటకారం, స్త్రీలపట్ల అతని నిర్లక్ష్యవైఖరి అతనిపట్ల అందరికీ అసహ్యం, కోపం పెంచింది. పైగా ఆ సంపన్నురాలైన యువతితో తన పెళ్ళి జరిపిస్తే మంచి కమీషను ఇస్తాడుట"

"చూడండి. అధ్వాన్నంగా మాట్లాడద్దు. ఒక జత బట్టలు కొనాలంటేనే నాలుగు షాపులు తిరిగి మనకు నచ్చినవి, మెచ్చినవి కొంటాం. జీవితాంతం కలిసి కాపురం చేయవలసిన భర్తను ఎన్నుకోవటంలో ఆలోచించి నిర్ణయం తీసుకోరా? ఆ ప్రకటన ఇచ్చిన యువతికి పాతికేళ్ళు. మహా అయితే ముప్ఫయ్ ఏళ్ళవాడిని, అందగాడిని, ఉద్యోగస్థుడ్ని భర్తగా స్వీకరిస్తుందే తప్ప, పైన పటారం, లోన లొటారంగాళ్ళను, ఆడాళ్ళంటే చులకనభావం ఉండేవాళ్ళను, పనీపాటాలేని బేవార్సుగాళ్ళను, పెళ్ళికి కూడా ఏజ్ బార్ అయిన వాళ్లను మాత్రం ఛస్తే స్వీకరించదు. మీరిక వెళ్ళచ్చు" అంటూ తెగేసి చెప్పింది విజయ.

"నన్ను ఏజ్ బార్‌గాడంటావా? " అంటూ భుజాలు తడుముకుని మరీ పోట్లాట పెట్టుకున్నాడు. పోలీసుల పేరు చెప్పి బెదిరించేసరికి జారుకున్నాడు. అదీ సంగతి" అంటూ ముగించింది రాజేశ్వరి.

"మా దేవిగారి చిర్రుబుర్రులకిదన్నమాట కారణం. అయినా పెళ్ళిళ్ళు చేసే మీ ఉద్యోగం కంటే రకరకాల డీలు చేసుకుని అమ్ముకునే నా ఉద్యోగమే మేలైనది. ఏ రిస్కులూ లేకుండా హాయిగా బతకచ్చు" అన్నాడు చందూ.

"రిస్కులుంటేనే జీవితానికి థ్రిల్లుంటుందని రాజీ అంటుంది. నీ ఉద్యోగం నీకు గొప్ప. వాళ్ళ ఉద్యోగం వాళ్ళకు గొప్ప" అన్నాడు మురళి.

★ ★ ★

ఆరోజు పాణిగ్రహణం ఆఫీసుకు ముప్ఫయిపైబడిన వ్యక్తి వచ్చాడు. అందంగా

ఉన్నాడు. కానీ ఒక కాలు మోకాలుదాకా లేదు. మూడు చక్రాల సైకిల్లో వచ్చాడు. సైకిలు దిగి కర్రల సహాయంతో లోపలి కొచ్చి కుర్చీలో కూర్చున్నాడు. స్టాఫంతా జాలిగా అతనివైపు చూశారు. "ప్రతి మని షికీ ఏదో ఒక లోపం పెట్టకపోతే తనను తలచుకోరని దేముడికి భయం కాబోలు" మనసులో అనుకుని నిట్టూర్చింది రాజేశ్వరి.

"నా పేరు నవీన్. మాది ఈ రాష్ట్రం కాదు, బొంబాయి" అంటూ హిందీ, తెలుగు కలబోసి మాట్లాడసాగాడు.

"అలాగా! చెప్పండి. మీరిక్కడ ఏ జాబ్ చేస్తున్నారు? " అడిగింది రాజి.

"జాబ్ కాదు, సెంటర్లో ఫ్యాన్సీ షాపు పెట్టుకున్నాను. ఫైనాన్స్ కంపెనీ కూడా ఉంది. డబ్బుకు కొదవలేదు. బతకటానికి ఢోకాలేదు. నాకు అయిదేళ్లక్రితం పెళ్ల యింది. రెండేళ్ల పాప కూడా ఉంది. ప్రేమించి పెళ్లిచేసుకున్నాను. ఎంతో అన్యో న్యంగా ఉండేవాళ్లం. నా భార్య కూడా అందంగా ఉంటుంది. ఆమె కూడా గొప్పింటి బిడ్డ. సంవత్సరం క్రితం యాక్సి డెంటులో నా కాలు పోయింది. అంతవరకు నాతో ఎంతో అన్యోన్యంగా కాపురం చేసే నా భార్య ప్రవర్తనలో చాలా మార్పు వచ్చింది. కుంటివాడిగా నన్ను చూసి సహించలేకపోయింది. ఛీదరించుకుంది. జీవితాంతం నీ అవిటితనాన్ని చూస్తూ బత కలేను. నాకూ ఆశలూ, కోరికలూ ఉన్నాయి. నీ అందాన్ని చూసి ప్రేమించి పెళ్లిచేసుకున్నాను. ఇపుడు అదే లేకపో యాక ఇంక కాపురం ఎలా చేసేది? అంటూ పాపను వదిలేసి వెళ్లిపోయి విడా కుల నోటీసు పంపింది. వేరే పెళ్లికి సిద్ధప డిందని, త్వరలో పెళ్లిచేసుకోబోతుందని తెలిసింది. నా మనసు చాలా వికలమైంది. ఆమెను నేను ఎంతగానో ప్రేమించాను. ఆమెను నేను పువ్వుల్లో పెట్టి చూసుకు న్నాను. కేవలం నా కాలు పోయిందని ఆమె నాపై ఏహ్యాభావం పెంచుకుని వెళ్లిపో యింది. నిజానికి నాకు పెళ్లి అవసరం లేదు. కానీ పాపకు తల్లి కావాలి. అందుకే పెళ్లిచేసుకోవాలని మీ దగ్గరకొచ్చాను. అందంతో పనిలేదు. ఐశ్వర్యంతో పనిలేదు. మనసున్న మనిషైతే చాలు. ముఖ్యంగా నా అంగవైకల్యాన్ని అసహ్యించుకోని మనిషైతే బాగుంటుంది. పాణిగ్రహణం ద్వారా ఎన్నో ఆదర్శ వివాహాలు, ప్రేమవివాహాలు జరుగు తున్నాయని తెలుసుకుని ఆశతో వచ్చాను" అంటూ ముగించాడు నవీన్.

అందరి మనసుల్లోనూ మూగ అమ్మాయి వీణ మెదిలింది. అదే విషయం నవీన్‌కు చెప్పింది రాజేశ్వరి. ఆమె గతమంతా వివ రించింది. "ఆమె గతాన్ని మరిచిపోయి ఆదరించి పెళ్లిచేసుకుంటే లైఫ్ బాగుం టుంది" అంది రాజి.

"ఇద్దరమూ లైఫ్‌లో ఎదురుదెబ్బతిన్న వాళ్లమే కాబట్టి లోపాలు ఎంచుకునే ప్రసక్తి ఉండదు. ఆమె ఇష్టం కనుక్కుని అరేంజ్ చెయ్యండి" అన్నాడు నవీన్.

"శారీరక అంగవైకల్యం గురించి నాకు బాధలేదు. ఏ మనిషికైనా మానసిక అంగ వైకల్యం లేకుంటే జీవితం ఆనందం చేసుకో వచ్చు ఈ పెళ్లి నాకిష్టమే" అంటూ వీణ తన సుముఖత తెలియచేసింది.

పాణిగ్రహణం ఆఫీసులోనే సింపుల్‌గా నవీన్, వీణల పెళ్లిజరిగింది.

★ ★ ★

"మా అబ్బాయికి మంచి వధువును వెతికి పెళ్లిచేస్తే మీకెంత కమీషను ఇవ్వాల్సి ఉంటుంది" ఓ అరవైఏళ్లతను పాణిగ్రహణం ఆఫీసుకు వచ్చీరాగానే ప్రశ్నించాడు.

"కమీషను సంగతి తర్వాత. అయినా కమీషను మీ స్తోమతలనుబట్టి తీసుకుం టామే తప్ప ఖచ్చితంగా ఇంత ఇవ్వాలన్న ఫిక్స్‌డ్ రేట్లు లేవులెండి. సరే అవన్నీ పెళ్లి ఫిక్స్ అయ్యాక చూసుకుందాం. మీ

అబ్బాయి వివరాలు చెప్పండి" అంది రాజేశ్వరి.

"అబ్బాయి మీ కొడుకా?" అంది విజయ.

"కొడుకేగానీ నా కొడుకు కాదు. మా అన్నయ్య కొడుకు. వాడికి మీరు పెళ్లిచేయాలి. వధువును వెతకక్కర్లేదు. అమ్మాయి రెడీగా ఉంది"

"అర్థమయ్యేలా వివరంగా పూర్తిగా చెప్పండి" కాస్త చిరాకు ధ్వనిస్తూ అంది విజయ.

"చెబుతానమ్మా! అంత కోపమెందుకు తల్లీ! నా పేరు వామనరావు. నేను పెళ్లిచేసుకోలేదు. బ్రహ్మచారిని. మా అన్నయ్య పేరు కుటుంబరావు. వాడికి ఒక్కకొడుకు, ఒక్కకూతురు. పేరుకి అన్నయ్య పిల్లలన్న మాటేకానీ, చిన్నప్పటినించి వాళ్ల ఆలనాపాలనా అంతా నేనే చూశాను. వాళ్లకే చిన్న బాధ కలిగినా విలవిలలాడాను. కొడుకు పేరు జగన్. కూతురి పేరు వాణి. వాణిని పి.జి. చేయించి పెళ్లి చేశాము. అమ్మాయి, అల్లుడూ ఇద్దరూ ఉద్యోగాలు చేస్తున్నారు. వాళ్లిప్పుడు బాంబేలో ఉంటున్నారు. వాళ్ల సమస్య ఏమాత్రం మాకులేదు. ఇకపోతే అబ్బాయి జగన్ సాఫ్ట్‌వేర్ ఇంజనీర్‌గా హైదరాబాదులో చేస్తున్నాడు. వాడీమధ్య ఓ ముస్లిం అమ్మాయిని ప్రేమించాడు. అమ్మాయీ ప్రేమించింది. అందరిలా లేచిపోయి పెళ్లిచేసుకోవటమో, పెద్దలనెదిరించి పెళ్లి చేసుకోవటమోలాంటివి చేయకుండా ఇద్దరూ ఇరుపక్షాల పెద్దలకూ తమ ప్రేమ గురించి చెప్పారు. అన్నట్టు అమ్మాయి కూడా కంప్యూటర్ ఫీల్డులోనే ఏదో ఉద్యోగంచేస్తోంది.

అమ్మాయి తల్లిదండ్రులు చదువుకున్నవారు. వాళ్ల తరపునించి ఈ పెళ్లికి అంగీకారం తెలిపారు. ఇకపోతే మా అన్నయ్య... నిత్య అగ్నిహోత్రుడు. ఉదయం సూర్యనమస్కారాలు, సంధ్యావందనాలు. అభిషేకాలు, పూజలు, జపాలు అంటూ రోజులో అయిదారుగంటలు తడిగుడ్డ మొలకు చుట్టుకుని చేతిలో జపమాల, నొసట విబూతిరేకలతో ఏవో మంత్రాలు ఉచ్చరిస్తుంటాడు. ముస్లింల అమ్మాయి కోడలు అనగానే హరహరా, శివశివా అంటూ చెవులు మూసుకుని లబోదిబోమన్నాడు. హూంకరించాడు. శవాలు పడతాయన్నాడు. రక్తం కళ్లచూస్తానన్నాడు. "నువ్వేమయినా చేసుకో! నేను ఆ అమ్మాయిని తప్ప మరో అమ్మాయిని చేసుకోను. ఆ అమ్మాయితో నువ్వు నా పెళ్లికి ఒప్పుకోకపోతే నా శవం కళ్లచూస్తావు. తలకొరివి పెట్టటానిక్కూడా ఎవరూ ఉండరు" అని జగన్ సెంటిమెంట్‌తో చాచికొట్టేసరికి అంతటి నిత్యాగ్నిహోత్రుడు అయిసుముక్కయిపోయాడు. కొడుకుకోసం పెళ్లికి ఒప్పుకొన్నాడు. హిందూ సాంప్రదాయం ప్రకారమే పెళ్లి చేసుకోవాలని ఆంక్షపెట్టాడు. అమ్మాయి... అన్నట్టు అమ్మాయి పేరు రజియా... అమ్మాయి తరపువాళ్లు ఓ.కె. మీ ఇష్టం. మాకే పట్టింపు లేదన్నారు. మా అన్నయ్య మీనమేషాలు లెక్కపెట్టి వీరిద్దరి జాతకరీత్యా ఇంకా రెండు నెలలు ముహూర్తబలం లేదంటూ పెండింగుపెట్టాడు.

ఈలోగా ఏంజరిగిందో తెలుసా? కార్గిల్ పోరు జరిగింది. ఆ పోరులో మా మేనల్లుడు చనిపోయాడు. దాంతో మా కుటుంబమంతా శోకంలో మునిగిపోయింది. కుటుంబం అందరినోటా పాకిస్తానీయులను, ముస్లింలను దుయ్యబట్టటమే పనిగా పెట్టుకున్నారు. బంధువుల్లో కొందరు ఎక్కడా దొరకనట్టు మన శత్రురాజ్యపు కులం అమ్మాయిని కోడలిగా తెచ్చుకుంటారా? బాబోయ్! ఇకనించి మేం మీ ఇంటికి రాము అంటూ పనికిరాని మాటలు ఎన్నో మాట్లాడి మా అన్నయ్య బుర్ర చెడగొట్టి, ఆయన్ని మళ్లీ మొదటికి తెచ్చారు. రజియా తల్లిదండ్రులు మా అన్నయ్య దగ్గరకొచ్చి "ఆ దేశంకు మాకు ఏమిటి సంబంధం? మేం

పుట్టింది పెరిగింది, భారతదేశంలోనే. మేం భారతీయులం. ఛాందస భావాలతో అనవసరంగా పసిమనసులను విడగొట్టి బాధపెట్టకండి. మనం బతికేది పిల్లలకోసమేకదా" అంటూ ఎంతో నచ్చచెప్పారు. అయినా వినలేదు. జగన్ చస్తానన్న 'బెదిరింపు బ్రహ్మాస్త్రం' కూడా అన్నయ్య దగ్గర పనిచెయ్యలేదు. జగన్‌కు వేరే సంబంధాలు చూస్తున్నాడు. నేను బాబాయిగా జగన్ బాధ చూడలేకున్నాను. తెగించి పారిపోయి పెళ్ళిచేసుకోమని చెప్పలేను. ఇటు అన్నయ్యను ఒప్పించలేను. నా చేతనైనది ఒకటే. అన్నయ్య మాట్లాడుతున్న పెళ్లిళ్ల పేరయ్యలకు నచ్చచెప్పి లంచాలిచ్చి పెళ్లి సంబంధాలు తిప్పికొడుతున్నాను. ఎన్నాళ్లిలాగ చేయగలను చెప్పండి. ఏదో ఒకరోజున ఈ సంగతి అన్నయ్యకు తెలిస్తే అభాసుపాలవుతాను. ఆలోచించి మీ గురించి తెలుసుకున్నాను. ప్రేమ పెళ్లిళ్లు చేయిస్తున్నారు కాబట్టి మా కుటుంబ సమస్య మీరు పరిష్కరించగలరని అనిపించి వచ్చాను" అంటూ ముగించాడు వామనరావు. పాణిగ్రహణం స్టాఫంతా ఆలోచనలో పడ్డారు.

"చూడండి అమ్మాయిలూ! 'కట్టె విరగకూడదు పాము చావకూడదు' పద్ధతిలో ఈ పెళ్లి జరగాలి. అటు రజియా తల్లిదండ్రులు బాధపడకూడదు. ఇటు అన్నయ్య మనసు కరగాలి. బహుశా మీకీ పెళ్లి ఓ పజిల్‌లాంటిది" అన్నాడు వామనరావు.

"ఇలాంటివన్నీ ఒక్కరోజులో తేలేవికావు. కాస్త టైంపడుతుంది. మీ అన్నయ్యగారి అడ్రసు, రజియా తల్లిదండ్రుల అడ్రసు, జగన్ అడ్రసు ఇచ్చివెళ్లండి. అప్పుడప్పుడూ మీరు వచ్చి వెళుతుండండి!" అంది రాజేశ్వరి.

★ ★ ★

"ఏమిటి ఉదయం అయిదు గంటల్లనించే లేచి ఇంట్లోకి, బయటకు తిరుగుతూ ఎవరికోసం ఎదురుచూస్తున్నారు. ఈరోజు ఉగాది పండుగకదాని అత్తయ్యను, మామయ్యను రమ్మన్నారా? వాళ్ళకోసం చూస్తున్నారా? " అంది విజయ చందూతో.

"ఏమిటీ! ఉండుండి తెలుగు సంవత్సరాది నాడు మా నాన్నతో తిట్లు పంచాంగ శ్రవణానికి పిలిపించుకోవటానికి నేనేం తెలివి తక్కువ దద్దమ్మను కాను. ఈరోజు న్యూస్ పేపరులో సంవత్సర ఫలాలు వేస్తారు. నాకు వాటిమీద చాలా నమ్మకం. చదువుకుందామనీ" అన్నాడు చందూ.

"ఏమిట్రా! మీకు పేపరు రాలేదా? సణుగుతున్నావు. మా ఇంటికి వచ్చింది. ఇక్కడికొచ్చి చదువుకోవచ్చుగా" కేకేశాడు మురళి.

"పేపరు కుర్రాడికి కూడా నేను అలుసైపోయాను. మీ ఇంటికీ, మా ఇంటికీ అయిదడుగుల దూరం కూడా లేదుకదా మీకు పేపరిచ్చి నాకివ్వకపోవటమేమిటి? రానీ వాడి పని చెబుతాను. దసరా మామూలు కూడా నిజాయితీగా ముట్టచెప్పుతాను. అయినా ఇంత పక్షపాతమా? విజ్జీ! ఉగాది పచ్చడి అక్కడికి తీసుకురా. నేవెళుతున్నాను. మరీ చేదుగా చెయ్యకు!" అంటూ మురళీవాళ్ళ పోర్షనులోకెళ్లాడు.

"ఇదిగో చందూ, ముందు ఉగాది పచ్చడి తిను. మీ ఆవిడ తెచ్చాక ఇంకోసారి ఆరగిద్దువుగాని" అంటూ రాజేశ్వరి ఉగాదిపచ్చడి తెచ్చిచ్చింది.

"ఆహా! అద్భుతంగా ఉంది"

"ఏమిటి ఉగాది పచ్చడా? "

"కాదు నా రాశిఫలం, ఆదాయం పన్నెండు, వ్యయం నాలుగు, రాజపూజ్యం ఆరు, అవమానం రెండు. ఈ సంవత్సరం అనుకోని ధనలాభం బంధుకలహాలు... అమ్మో... మా నాన్నతో పోట్లాట కాబోలు. అప్పుడప్పుడు అనారోగ్యం. శివుడికి రుద్రాభిషేకం చేయిస్తే మంచిది... సంవత్సరం చివర్లో..."

"సంవత్సరం చివర్లో లంకెబిందెలు దొరు

కుతాయా? " అంది రాజి.

"ఈ రోజుల్లో లంకెబిందెలు ఎక్కడ దొరుకుతాయిలేవమ్మా. రాశిఫలం ప్రకారం లాటరీ దొరకచ్చు"

"చదువు సంస్కారం ఉన్నవాడివి ఈ జాతకాలు రాశిఫలాల పిచ్చేమిట్రా? " మురళి మందలించాడు.

"జాతకాలంటే గుర్తుకు వచ్చింది. మొన్నొకరోజు పాణిగ్రహణం ఆఫీసుకు ఒక యువకుడు వచ్చాడు. అతను ఓ మంచి కాలేజీలో ప్రొఫెసర్. అతను తన చెల్లికి సంబంధం కావాలన్నాడు. చెల్లి ఇద్దరు పిల్లల తల్లి. ఆమె భర్త యాక్సిడెంటులో పోయాడుట. భర్త ఉద్యోగం గవర్నమెంటు ఆమెకిచ్చింది. తోడుకోసం ఆమె మళ్ళీ పెళ్లి చేసుకోవాలనుకుంది. ఆమె అన్నయ్య మా ఆఫీసుకొచ్చి ఏం చెప్పాడో తెలుసా? మా చెల్లికి సంబంధం చూడండి. అయితే మా చెల్లి జాతకానికి సరిపడిన వ్యక్తి కావాలి అన్నాడు"

"ఇంతకు ముందుభర్త జాతకం చూడకుండా చేశారా? " అనడిగాను.

"జాతకాలు చూడకుండా పెళ్లిళ్లు చేయటం మా ఇంటా వంటాలేదు"

"అంత మహర్జాతకుడు మీ చెల్లిని ఒంటరిచేసి అర్ధాంతరంగా ఎందుకు చనిపోయాడంటారు. చూడవలసింది జాతకాలు కాదు. భర్త చనిపోయి పిల్లలున్న స్త్రీని విశాల హృదయంతో ఆదరించగల మనసున్న వ్యక్తిని. ఎంతోమంది భావిభారత పౌరులను తీర్చిదిద్దే మీరు ఇలా జాతకాల దగ్గరే చతికిలబడితే ఎలాగ? మూఢనమ్మకాలు మాని ముందుకుపోతే అందరి భవిష్యత్తు బాగుంటుంది" అని క్లాసు తీసుకునేసరికి "అలాగేలెండి. మీకు నచ్చిన సంబంధం వెతకండ"ని చెప్పివెళ్ళాడు.

"అయితే నీవు పెళ్లిళ్లు చేయటమేకాక వచ్చినవాళ్ళకు 'బ్రెయిన్‌వాష్' కూడా చేసి పంపుతున్నావన్నమాట" చందూ అన్నాడు నవ్వుతూ.

"అవునూ, ఇంతకీ ఆ ముస్లిం అమ్మాయి, హిందూ అబ్బాయి పెళ్లి సంగతేం చేశావు? " మురళి అడిగాడు.

"వాళ్లిద్దరికీ పెళ్లి అబ్బాయి తండ్రే స్వయంగా దగ్గరుండి మరీ చేస్తున్నాడు. పెళ్లికి మా స్టాఫంతా వెళుతున్నాం కూడా"

"అలాగా! కట్టె విరగరాదు. పాము చావరాదు. టైపులో అన్నారన్నావు. ఎలా చేశావేమిటి? " మురళి ఆత్రంగా ప్రశ్నించాడు.

వాళ్ళ పెళ్ళి గురించి ఆలోచించి ఆలోచించి బుర్రలు బద్దలయ్యాయి. సినిమా ట్రిక్ ఉపయోగించక తప్పదని ధైర్యం చేశాము.

"జగన్ తండ్రి కొడుకు విషయంలో చాలా కఠినంగా వ్యవహరించటం చూసి పకడ్బందీగా ఓ డ్రామా సెట్ చేశాము. రజియాకు సంబంధాలు చూస్తున్నారని జగన్ తండ్రికి చేరవేశాము. జగన్‌కు దేవదాసు పోర్షనిచ్చాము. కొడుకును చూసి ఓ మెట్టు కిందికి దిగివచ్చినా బయటపడలేదు. ఓ నెల రోజులు యాక్టింగ్ తర్వాత ఈ ముసలాయన పూర్తిగా దారికి రావట్లేదు. ఏం చెయ్యాలా అని ఆలోచిస్తున్నటైంలో ఓ ట్రెయిన్ పట్టాలు తప్పి చాలా మంది చనిపోయారన్న వార్త టి.వి.లో రాగానే... ఆ ట్రెయిన్‌లో రజియా తల్లిదండ్రులున్నారనీ, వాళ్ళ ఆచూకి తెలియటంలేదన్న వార్త జగన్ తండ్రికి చేరవేశాము. అది విని జగన్‌తో పాటు జగన్ నాన్నగారు కూడా హుటాహుటిన ప్రమాదస్థలానికి చేరుకున్నారు. అక్కడికి రజియా తల్లిదండ్రులు కూడా చేరుకున్నారు. చివరి నిమిషంలో రైలు ప్రయాణం మానుకున్నామనీ, తమను అల్లా కాపాడాడని, తమ బంధువులు ఈ రైల్లో ప్రయాణం చేశారు. ఆచూకి కోసం వచ్చామనీ చెప్పారు., ఎంతోమంది ఆర్తనాదాలు, శవాలమధ్య... రజియా తల్లిదండ్రులు క్షేమంగా ఉన్నారన్న వార్తతో సంతో

షమూ, దుఃఖం మిళితంకాగా జగన్ తండ్రి రజియా తండ్రిని వాటేసుకుని అక్కున చేర్చుకున్నాడు. మతం వేరని సమాజం కోసం భయపడి దూరంగా ఉంచినా, అంత రాంతరాల్లో కాబోయే వియ్యంకుడిపట్ల ఉన్న అభిమానం, ఆప్యాయతను అడ్డుకోవ టానికి ఎవరితరమూ కాలేదు" అంది రాజే శ్వరి.

"రైలు ప్రమాదస్థలం... వగైరా డైరెక్షన్ కోసం నువ్వు అక్కడికి వెళ్ళావా?" మురళి ప్రశ్న.

"ఇక్కడ రిమోట్ నొక్కితే అక్కడ పేలే రోజులివి! వెళితే తప్ప పనులు జరిపించలే మనుకుంటున్నారా?" విజయ అంది.

"మతం మతం అంటూ పట్టుకు వేళ్ళాడి అంత కఠినంగా ఉండే మనిషి ఒక్క చిన్న సంఘటనతో మనసు మార్చుకోవటం గొప్పగా ఉంది కదూ!"

"మతంకంటే ముందు మానవత్వం పుట్టింది కాబట్టే కాఠిన్యం కరిగి పోయింది" రాజేశ్వరి మాటలు విని అందరూ నిశ్శ బ్దంగా మారిపోయారు.

★ ★ ★

పెద్ద కళ్యాణమండపం! పూర్తి డెకరేష న్‌తో కన్నులపండుగగా ఉంది. అది జగన్, రజియాల పెళ్ళి వేదిక. ముస్లిం, హిందువులు కలిసి ఓ ప్రేమ జంటను దంపతులుగా చేస్తున్న సంబరం. ముస్లిం స్త్రీలు కొందరు బురఖాలు ధరించి, మరి కొందరు సాదాసీదాగా, హిందూ స్త్రీలు పట్టు చీరల రెపరెపలతో, ముస్లిం పురు షులు తలపై టోపీలతో హిందూ పురుష లను భాయీభాయీ అంటూ పలకరిం పులు... నిజంగా ఆ దృశ్యం ఎంతో నయ నానందకరంగా ఉంది. ఒకటి రెండు చోట్ల గుంపులుగా చేరి "ముస్లిం అమ్మాయిని కోడలిగా తెచ్చుకుంటున్నాడు. హిందువుల బ్బాయిని అల్లుడిగా స్వీకరిస్తున్నాడు" అంటూ గుసగుసలాడి... అయినా ఈ రోజుల్లో అన్నీ మామూలైపోయాయి. మన కెందుకు అంటూ మళ్ళీ యథాస్థానాల్లోకెళ్ళి పోతున్నారు.

ఒప్పందం ప్రకారం క్రితంరోజు ముస్లిం ఆచారం ప్రకారం నిఖా జరిగింది. ఈ రోజు హిందూ సాంప్రదాయం ప్రకారం పాణిగ్రహణం జరుగుతోంది.

పాణిగ్రహణం స్టాఫ్ తమ జంటలతో ఆ సమైక్యవేదికను చేరుకున్నారు. రజియా తండ్రి, జగన్ తండ్రి పాణిగ్రహణం స్టాఫ్‌ను పొగడ్తలతో ఆకాశానికెత్తేశారు. ఆఫీసు భవనానికి విరాళాలు సేకరించి స్వంత భవనం నిర్మిస్తామని ఒకరు, పాణి గ్రహణం స్టాఫ్‌కు సన్మానసభ ఏర్పాటు చేస్తామని మరొకరు వాగ్దానాలు చేశారు.

"సన్మానాలులాంటివేవీ వద్దు. పాణిగ్ర హణం స్వంత భవనానికి మాత్రం హెల్ప్ చేయండి" అంది రాజేశ్వరి.

పురోహితుడి వేదమంత్రాలు, సన్నాయి మేళం కలగాపులగంగా వినిపిస్తున్నాయి. ఆ వేదిక మీద హిందూ ముస్లింలు తమనుతాము మరచిపోయారు. మన వర్గం, మన కులం, మన మతం, మన జాతి అని తరతరాలనుండి దోపిడీ వ్యవస్థ చేస్తున్న కుట్రలను, నియంతృత్వపోకడ లను, అణగద్రొక్కటానికి నడుం బిగించి నాందీ పలుకుతున్నట్టుగా ఉంది ఆ పాణి గ్రహణపు వేదికను చూస్తుంటే. చిన్నప్పటి ఎండా వాన దృశ్యం కదలాడి వళ్ళు పులక రించింది.

"భగవంతుడా! ఈ దృశ్యాన్ని శాశ్వతం చెయ్యి తండ్రీ! నా ఈ దేశాన్ని కులాలు, మతాల బారినించి రక్షించి ప్రేమకులమనే వేదిక మీదికి చేర్చు ప్రభూ!" కళ్ళు మూసు కుని దేముడిని ప్రార్థించింది రాజేశ్వరి. తథాస్తు అన్నట్టు మంగళవాద్యాలు మిన్నం టటంతో ఉలిక్కిపడి చేతిలో ఉన్న అక్షిం తలు వధూవరులమీద చల్లింది రాజేశ్వరి!

☆

# ఏరినముత్యాలు

★ మవునం ఓ శక్తి, ఓ సాధనం, ఓ యోగం, ఓ ఆనందం. మవునం విలువ తెలిసిన మనిషి బతుకే ఆనందమయం!

–ఓసూక్తి

★ రేపటి సూర్యుడికోసం ఈ రాత్రంతా ప్రసవవేదన పడేదే అసలైన కళారూపం.

–మాగ్జిమ్‌గోర్కీ

★ కాలం ఒక తేలని ప్రశ్న
కాలం ఒక తీరని తృష్ణ
విరామం లేదు విజ్ఞానానికి
సందేహం తీరదు వేదాంతికి

–ఆరుద్ర

★ సూర్యుడు ఈలోకంలో చాలామంది కష్టాలను చూస్తాడు. కాని సూర్యుడికన్నా చంద్రుడే వారి ఆవేదనలను ఎక్కువగా అర్థం చేసుకుంటాడు.

–రా.వి.శాస్త్రి

★ సంఘర్షణలేని జీవితం నిరర్థకం

–జవహర్‌లాల్‌నెహ్రూ

★ జీవితం ఆలోచించేవారికి విషాదమయం అనుభవించేవారికి ఆనందమయం!

–హార్స్‌వాల్‌పోల్

★ మహ్మద్, క్రీస్తు, బుద్ధుడు మంచివాళ్లే! అయితే నీకేమిటి ప్రయోజనం? నీవు మంచివాడివి కానప్పుడు నిన్నెవరూ రక్షించలేరు!!

–ఒకసూక్తి

★ నా ఇంటిపేరు ప్రపంచం
ప్రజలే నా కుటుంబం
వెదజల్లుతా దిగ్దిగంతం
అభ్యుదయ సుగంధం
అప్పుడు నా జీవితమే ఒక ప్రబంధం!

–శ్రీశ్రీ

★ ఈ లోకం మారదనే
వాదాలకు తావులేదు
రాక్షస వృక్షం సైతం
రంపానికి లొంగుతుంది!

–ఒకసామెత

సేకరణ: దేవులపల్లి శ్యాంసుందర్‌రావు

# 'ఏడు రోజులు' పై సమీక్షలు

**మే 'చతుర'లో ప్రచురితమైన తంగెళ్ళ శ్రీదేవిరెడ్డి రచన 'ఏడు రోజులు' పై మాకందిన ఉత్తమ సమీక్షలు**

## ఏడురోజుల యాత్ర

*(ప్రథమ బహుమతి రూ. 100/- పొందిన సమీక్ష)*

'మతం' అంటే విశ్వసించబడినది, ఇచ్ఛ, జ్ఞానము, అభిప్రాయము అనే అర్థాలు న్నాయి.

తమకు నచ్చిన భావాన్ని నమ్మడం అనే ఉద్దేశంతో ఉద్భవించిన మతం, కాలక్ర మేణా వెర్రితలలు వేసి మానవతకే మచ్చ తెచ్చే విధంగా తయారైంది. హత్యలు, విధ్వంసమే పరమావధిగా, ప్రేమాభిమా నాలు పూజ్యంగా సాగుతున్న మతాభి మానం మానవ జీవితాలనే అతలాకుతలం చేస్తోంది. దీని ముసుగులో స్వార్థపరులు పబ్బంగడుపుకుంటున్నారు.

మతమౌఢ్యాన్ని ప్రేమతో కలిపి రాసిన శ్రీదేవిరెడ్డిగారి 'ఏడురోజులు', ఏకబిగిన చదివించేలా వుంది. సినిమా చూస్తున్నట్లని పించే ఈ నవలలో గౌసియా మరిన్ని కష్టాల నెదుర్కొనేలా చేయడానికి చేసిన ప్రయత్నంలో కొంత అసంబద్ధత గోచరిం చింది. షేక్‌ని చంపే ధైర్యం చేసిన గౌసియా, కానిస్టేబుల్స్ వెంకట్, కృష్ణల ప్రవర్తనకు భయపడి వెళ్ళిపోవడం, అపరి చిత వ్యక్తి అని తెలిసీ, గతంలో వ్యక్తులచేత మోసగింపబడి కూడా శ్యామ్ ఉరఫ్ రమణ వెంట వెళ్ళిపోవడం సమర్థనీయం కాదు. యాక్సిడెంట్‌కు గురైన ఫాదర్‌ని చూద్దా మని బయల్దేరి 'నగరం అర్థం కావడం లేదనే' కారణంతో హైద్రాబాద్‌కి అదీ ఎవరో తెలీని పెళ్ళివాళ్ళతో వెళ్ళిపోవడం రుచించదు.

దేశమంతా సంచలనం సృష్టించిన గౌసియా, ముంబై పోలీసుల కళ్ళుగప్పి వచ్చేసింతర్వాత పోలీసులు పేపరు ప్రకట నిచ్చి ఊరుకోవడం సమస్య తీవ్రతను తగ్గిం చినట్లయింది. ప్రేమ కథగా సాగిన నవల సాంతమూ మతవిద్వేషాలనూ, ఒంటరి స్త్రీ ఎక్కువగా ఎదుర్కొనే కష్టాలనూ చూపిం చింది. మనః పరిపక్వత లోపించిన ప్రేమి కుల ప్రేమ సఫలం కావడానికి అందరూ తలో చెయ్యి వేశారే తప్ప వారి ప్రేమ వ్యక్తుల మత మౌఢ్యాన్ని జయించలేకపో యింది. బాలస్వామి, సాయిబులాంటి వ్యక్తుల్ని సంస్కరించలేకపోయినా, వారి నెదిరించి నిలబడగలిగి వుంటే వారి ప్రేమకు బలం వచ్చేది.

చివరిగా 'భవిష్యత్తులో ఒక స్థానం, స్థాయి సంపాదించుకున్న తర్వాత మాత్రమే నీ ప్రియురాల్ని తీసుకెళ్ళు' అంటూ కమలా కర్, భవానీశంకర్‌కి హితబోధ చేయడం ముదావహం. ఏడురోజుల్లో ఓ ప్రేమ కథని నడిపించడానికీ, వారి కష్టాలను చూపడా నికీ, సమస్యపట్ల అవగాహన, వ్యావహారిక భాషతో పరిచయం రచయిత్రికి బాగా తోడ్పడింది.

–గోదావరి పద్మావతి,
సోంపేట-532 284

## మెరుగునపడిపోయింది

*(ద్వితీయ బహుమతి రూ. 75/- పొందిన సమీక్ష)*

మే నెల చతురలో తంగెళ్ళ శ్రీదేవిరెడ్డిగారి రచన 'ఏడురోజులు'లో ముస్లిం అమ్మాయి, హిందూ అబ్బాయి ఇద్దరి మధ్య మొలకె

త్తిన ప్రేమ, దాని పర్యవసానంగా చోటుచే సుకున్న సంఘటనలు... ఈ నేపథ్యంలో అస్పష్టంగా మతం మనుష్యులకే కాని మనసులకు కాదు అనే సందేశం ఉంది.

నవల చదువుతున్నంత సేపూ మత ఛాందసభావాలను నరనరాన జీర్ణించు కున్న వారి తీరుతెన్నులు, వారి ఆలోచనా ధోరణులు, మతకలహాలు, ముస్లిం కుటుం బాలలో ఉన్న అపరిమిత సంతానం వలన ఏర్పడిన పేదరికం, అరబ్ షేక్‌లతో పడు చుపిల్లల వివాహం... ఇలా అనేకానేక సామాజికాంశాలు స్మృతిపథంలోకి వస్తాయి.

ఒంటరిగా ఉన్న యువతి, అందునా అందమైనది, బయటిప్రపంచం గురించి ఏమాత్రం పరిచయం లేనిది బయటికొస్తే ఈ లోకంలో చాలామంది ఆమెపట్ల ఎలా ప్రవర్తిస్తారో గౌసియా పాత్రద్వారా చెప్పడం, ఆమె ఇంకా ఎన్నెన్ని ఇబ్బందుల్ని ఎదుర్కొంటుందోననే ఉత్కంఠతో నవల పూర్తిగా చదవడానికి దోహదపడుతుంది.

తీరా నవలంతా చదివాక, ఇందులో కొత్త సంగతులేమున్నాయ్? అన్నీ మనం విన్నవే కదా అనుకుంటే అది పాఠకుల తప్పు కాదు. అయితే మంచితనానికి-మానవత్వానికి మతాలు చిరునామా కావనీ, అన్ని మతాల్లోనూ మంచివాళ్ళూ... చెడ్డవాళ్ళూ ఉన్నారనీ తోటి మానవులను మతంతోకాక మానవత్వంతో చూడాలనీ రచయిత్రి చెప్పదలచుకున్నట్లుంది. తప్పుడు పోకడలవల్ల, తప్పుడు విధానా లతో నేటి సమాజంలో మనుష్యులు ఇంగి తజ్ఞానం మరిచి కులమతాల పేరిట అజ్ఞా నంతో వ్యవహరిస్తూ సమస్యలను కొని తెచ్చుకుంటున్నారని రచయిత్రి చెప్పకనే చెప్పిన సందేశం సమంజసమైనదిగానే ఉంది. 'అగాథమౌ జలనిధిలోన ఆణిము త్యమున్నటులే' మరుగున పడిపోయిన ఈ వాస్తవాల్ని వెలికితీసి ఒంటపట్టించుకునే పాఠకులుంటే రచయిత్రి ప్రయత్నం ఫలిం చినట్లే!

చివరగా ముస్లింల గురించి రాసే ముందు రచయిత్రి ఆ కుటుంబాలను మరింత లోతుగా అధ్యయనం చేస్తే, నవ లలో దొర్లిన తప్పుడు పద, వాక్య ప్రయో గాలు తప్పేవి!

–సయ్యద్‌ఖుర్షీద్
మహబూబాబాద్-506 101

## మతసహనం కావాలి!

*(మూడవ బహుమతి రూ. 50/- పొందిన సమీక్ష)*

**మా**నవుడు విశ్వాంతరాళంలోకి వెళ్ళి గగనసీమను పాలించే ప్రస్తుత కాలంలో పాలకులే కుల, మతాల అగ్నికి ఆజ్యంపో స్తున్నారు. ఈ అగ్నిలో ఆహుతి అయ్యే వాళ్లు మూర్ఖంగా ఆహుతి అవుతున్నారే తప్ప అసలు మనిషి జీవితంలో ఈ కుల, మతాల ప్రసక్తి ఏమిటి? ఎందుకు? అని ప్రశ్నించుకోమని ప్రభోదిస్తుంది తంగెళ్ళ శ్రీదేవిరెడ్డి నవల 'ఏడురోజులు'.

వృత్తులనుబట్టి కులాలు, విదేశీప్రభావా లవలన మతాలు ఏర్పడ్డాయి. అయితే సర్వకులాలు, మతాల ధ్యేయం ఒక్కటే. మనిషి సాటి మనిషితో స్నేహంగా, సామ రస్యంగా బతకాలి. ప్రతి మనిషి రూపురే ఖలు వేరుకావచ్చుకాని, రక్తం రంగు వేరు కాదు. ఏ దేశంలోనైనా మనిషి మనిషిగా మనగలిగిననాడే మనిషి జన్మకు సార్థకత.

పేదరికం, మూఢనమ్మకాలు మనిషిని రాక్షసుడిని చేస్తాయి. ఆ రాక్షసత్వంలో జనించేది ఆశ. ఆ ఆశ అత్యాశగా మారిన నాడు కన్నకూతురే పెట్టుబడిగా కన్పి స్తుంది కన్న తండ్రికి. ఈ దేశంలో ఇలాంటి పేద కుటుంబాలు ఎన్నో. బేల తనం, చదువురాని తనం ఈ రాక్షసత్వాన్ని జయించలేక కోరి కష్టాలు తెచ్చుకుం

టుంది.

తెలిసీతెలియని వయసులో ప్రేమించడం తప్పు కావచ్చు కాకపోవచ్చు కాని సరియైన సమయంలో సరియైన నిర్ణయం తీసుకోకపోవడం వలన మనిషి ఎన్ని కష్టాలు పడగలడో ఎంతో చక్కగా విశదీకరించారు రచయిత్రి ఈ నవలలో. ప్రేమించడంలో చొరవలేక, సంపాయించడంలో చొరవలేక కాలయాపన చేయడం భవానీశంకర్ చేసిన పెద్ద తప్పు ఈ నవలలో. అనారోగ్యంతో బాధపడే తండ్రి సంపాదన కాజేసి గౌసియాతో పారిపోవాలనుకోవడంకంటే కష్టపడి సంపాయించి అనుభవజ్ఞులు, పోలీసుల సహాయంతో గౌసియాను పెళ్ళిచేసుకుని ఉంటే అతడి పాత్రకు వన్నెవచ్చేది. ఇలాంటి వాడిని నమ్మినందుకే గౌసియా ఏడు రోజుల నరకాన్ని చూస్తుంది.

ముఖ్యంగా ఈ నవల చదివిన తర్వాత ప్రతి పాఠకుడికి రెండు విషయాలు బోధపడతాయి. ఒకటి మూఢనమ్మకాలు విడనాడాలి. అల్లా, బాబా, జీసస్ అందరూ ఒక్కటే. ఒక్కొక్క మనిషి ఒక్కొక్క రూపురేఖతో ఉన్నట్లే ఒక్కొక్క మతం ఒక రూపాన్ని దేవుడిగా ప్రచారం చేస్తుంది. ఈ ప్రచారం తమ మత గొప్పతనాన్ని చాటుకోవడానికే తప్ప వేరే మతాన్ని కించపరిచేదిగా ఉండకూడదు. రెండవ విషయం చదువుకునే వయసులో ప్రేమ గురించి ఆలోచన రాకూడదు. ఒకవేళ తప్పనిసరి పరిస్థితిలో ప్రేమను జయించాలనుకుంటే చొరవ, ధైర్యం, ఆలోచనా శక్తి అత్యవసరమైనవి. ఊరికే గింజుకోవడంవలన ఎన్ని అనర్థాలు జరుగుతాయో గౌసియా పాత్ర ఒక ఉదాహరణ. ముఖ్యంగా ఆర్థిక బలం కూడా ఉండాలి. పోలీసుసహాయం తీసుకుని గౌసియాను ధైర్యంచేసి భవానీశంకర్ పెళ్ళి చేసికుని ఉంటే గౌసియా ఏడురోజుల విషవలయంలో చిక్కుకునేదికాదు.

డా. యం.ఎస్.జ్ఞానేశ్వర్,
మదనపల్లి-517 325

## హితం కోరేదే మతం

*(నాల్గవ బహుమతి రూ. 50 పొందిన సమీక్ష)*

సత్యాన్ని మించిన మతం ప్రపంచంలో లేదు. ఉన్నది ఒకే మతం మిగతావన్నీ దానికి వివరణలు మాత్రమేనని బెర్నార్డ్‌షా చెప్పారు. అంతా సమానం, అన్ని కులమతాలు ఒకటే అని అనుకుంటాం. ఆచరణలో వదిలేస్తాం. రెండు మతాలకు చెందిన యువతీయువకులు ప్రేమించుకుంటే ఎలా ఉంటుంది? ఎన్ని అడ్డంకులుంటాయి? వారిని హర్షిస్తామా? ఇత్యాది ప్రశ్నలకు సమాధానమే తంగెళ్ళ శ్రీదేవిరెడ్డి 'ఏడు రోజులు' నవల.

కథ ఆదివారం నుండి మొదలై మరో ఆదివారానికి సుఖాంతమవుతుంది. రచయిత్రి కథాంశాన్ని ధైర్యంగా ఎన్నుకోవడం జరిగింది. చాలామంది రచయితలు మతాలకు సబంధించిన అంశాలను ఎన్నుకోవడానికి వెనకడుగువేస్తారు. కానీ, ఈ రచయిత్రి అధైర్యపడక టిపికల్ సబ్జెక్టును తీసుకుని చక్కగా రాయగలిగారు. హైదరాబాద్‌లోనే కొంతకాలం క్రితం జరిగిన అమీనా కథ ఈ నవలకు ఆధారమని అర్థమవుతుంది.

హిందువైన భవానీశంకర్, ముస్లిం అమ్మాయి గౌసియాబేగం ఇరువురూ ప్రేమించుకోవడం, గౌసియా తండ్రి డబ్బు కోసం గౌసియాను దుబాయ్ సేట్‌కు అమ్మేయడం, గౌసియా అక్కడినుండి పడిన కష్టాలు, బాధలూ, కామాంధుల కర్కశ భావాలనుండి ఎలా తననుతాను రక్షించుకుంటూ వచ్చిందీ రచయిత్రి అద్భుతంగా చూపగలిగారు. అక్షరజ్ఞానం లేని ఒక స్త్రీ బొంబాయినుండి ఎందరో మదాంధుల నుండి, మోసగాళ్లనుండి తప్పించుకుని హైదరాబాదు చేరుకున్నదో ఆలోచిస్తే చదు

వుకున్న ఎందరో స్త్రీలు తమ బేలతనాన్ని వదిలి గౌసియాను స్ఫూర్తిగా తీసుకోవడం సముచితం.

మన పాలకులు మతాలను వాడుకోవడానికి చూస్తారేకానీ, సమాజంలోని ఆర్థిక అసమానతలను తొలగించడానికి ప్రయత్నించరు. ఆర్థిక అసమానతలను, నిరక్షరాస్యతను తొలగిస్తే సాయిబు, బాలస్వామిలాంటి వ్యక్తులను ఈ సమాజం నుండి దూరం చెయ్యొచ్చు పాలకులు ఎన్నికల్లో మతాన్ని వాడుకుని సమాజాన్ని కలుషితం చేయడం గర్హించదగింది. సాయిబు, బాలస్వామి లాంటి వీర మతపిచ్చి మనుషులకు తగిన బుద్ధి చెప్పగలగాలి. మతం అంటే హితం కోరేదై ఉండాలి. మాది గొప్ప మా మతమే గొప్ప అనే సంకుచిత భావాలున్నంతవరకూ సమాజాలు ఎదగవు.

రచయిత్రి కథనాన్ని పట్టుగా నడిపింది. మతం గురించి అవసరమైనంత మేర అనలైజ్ చెయ్యగలిగింది. భాషను సరళంగా వాడగలిగింది. రాస్తున్నామన్న స్పృహలేకుండా భాషలో ఫ్లో కనపడుతుంది. మంచి నవలతో ఔత్సాహిక రచయిత్రిగా మనముందుకు రావడాన్ని మనం అభినందించాలి.

–టి. తిప్పారెడ్డి
మదనపల్లె-517 325

## మతం- ప్రేమ

*(అయిదవ బహుమతి రూ. 50/- పొందిన సమీక్ష)*

పెద్దగా పటుత్వంలేని మతకలహాల నేపథ్యంలో సాగిన కథ 'ఏడురోజులు'. ఈ చిత్రమైన ప్రేమకథను పకడ్బందీ కథనంతో రక్తి కట్టించారు రచయిత్రి. అనేక సన్నివేశాలలో ప్రతిపాతకుడిచేత 'అయ్యో పాపం' అనిపింపచేశారు.

వివిధ రంగాల్లో స్వార్థంయొక్క వివిధ పార్శ్వాలను ఈ నవల స్పృశిస్తుంది. ప్రేమ సన్నివేశాలకంటే స్వార్థంకోసం మతాన్ని తమ స్వప్రయోజనాలకు వాడుకొంటున్న అనేక సందర్భాలను రచయిత్రి ఈ నవలలో ప్రస్తావించారు. స్వాతంత్ర్యానంతరం ధనం కోసం, అధికారంకోసం, స్వార్థ ప్రయోజనాల కోసం వ్యక్తులూ, రాజకీయనాయకులూ మత భావాలను రెచ్చగొట్టడం, దేశాన్ని అల్లకల్లోల పరచడం ఆనాటి రజాకార్ల ఉద్యమంనుండి నేటి బాబ్రీమసీదు విధ్వంసం వరకూ మనందరికీ విదితమే! నేటి సమాజంలో ఎంతో మంది బాలస్వాములూ సాయిబులూ ప్రశాంతంగా సాగుతున్న హిందూ-ముస్లిం జీవన విధానంలో జోక్యంచేసుకొని వాటి ఆసరాతో కోట్లకు పడగలెత్తిన సందర్భాలు మనమెన్నో చూస్తున్నాం. అధికార మార్పిడి కోసం ఒక జాతీయపార్టీ నాయకులు భాగ్యనగరంలో సృష్టించిన విధ్వంస కాండను ఈ నవల మనకు గుర్తుచేస్తుంది.

స్త్రీని దేవతగా పూజించే పవిత్ర భారతంలో అధిక సంతానంవల్ల వచ్చే అనర్థాలను తట్టుకోలేక వారిని అరబ్బు షేకులకు అమ్మే అత్యంత జుగుప్సాకర ప్రక్రియను రచయిత్రి ఈ నవలలో చిత్రించారు. దీనిని గౌసియా వీరోచితంగా ఎదుర్కొనటం మహిళాలోకానికి ఆదర్శప్రాయం, అభాగినులకు మార్గదర్శకం. ప్రేమకూ, ఆకర్షణకూ తేడా తెలియని పసి వయసులో భవానీశంకర్, గౌసియాల ప్రేమకథ కనువిప్పు కాగలదు. ఆద్యంతం ఆసక్తికరంగా సాగిన ఈ ప్రేమకథలో హీరో, హీరోయిన్, విలన్‌లు కేవలం కథనం మాత్రమే!!

–ఆర్.వి.యస్.ప్రసాద్
నెల్లూరు- 524 003

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications, Printed at Colorama Printers Pvt. Ltd., Hyderabad, Tel: 3730328. Office Address: CHATURA, Telugu Monthly, Eenadu Compound, Somajiguda, Hyderabad. Tel: Hyderabad: 3318181, 3398787; Madras: 8270434, 8251044; Vijayawada: 476685; Visakhapatnam: 552211; Tirupati: 75757; Anantapur: 33777; Rajahmundry: 79170; Karimnagar: 23216; Suryapet: 21146; Guntur: 512149; Nellore: 338734; Kurnool: 52122; Srikakulam: 26060.

